శ్రీవిఠల్ ప్రొడక్షన్స్ వారి

తప్పక చూడండి!

రచన: G.కృష్ణమూర్తి B.A.

సంగీతం: రాజన్-నాగేంద్ర

కెమెరా: రవికాంత్

పాటలు: C.నారాయణరెడ్డి-G.కృష్ణమూర్తి

కోడైరెక్టర్: S.D.లాల్

నిర్మాత:దర్శకుడు: విఠలాచార్య




పూర్ణా రిలీజ్

# ఉత్తరాలు

## ముఖచిత్రం

అందాల తార, వెండితెర వెలుగు అయిన 'రాజశ్రీ' చిత్రమును ఈ వారం పత్రిక యందు ముఖచిత్రంగా వేసిన మీకు నా ధన్యవాదములు.

గుండుమళ్ల వెంకట రామారావు. (శ్రీకాకుళం)

*    *    *

దివి నుండి భువికి యేతెంచిన అపూర్వ సుందరాంగి వలెనున్న రాజశ్రీ తన నయనాల నీలాల సొగసుల కాంతులతో ఈ వారం ఆంధ్ర సచిత్ర వార పత్రికకు అందాన్ని చేకూరుస్తున్నది. కథలలో 'అమాయకుడి నిర్ణయం' అన్న కథ చాలా బాగుంది. రచయిత గార్కి నా అభివందనలు.

యలమంచిలి రాఘవేంద్రరావు. (బెజవాడ)

## వ్యాసం

సామాన్య ప్రజలకు విజ్ఞాన మందించడం ప్రతి పత్రిక కర్తవ్యం. అది మీరు గుర్తించడం ప్రశంసనీయం.

ది. 24—7—64 సంచికలో ప్రచురించిన విజ్ఞానయుతమైన శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారి వ్యాసం సన్నార్షించింది.

విజ్ఞానులకే గాక సామాన్య పాఠకునికి (!) కూడా సులభ గ్రాహ్యమైన శైలిలో వ్యాసం వ్రాసిన శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు అభినందనీయులు. ఇటువంటి వ్యాస ప్రచురణ వలన మీ పత్రిక స్థాయి పెరుగ గలదని ఆశిస్తున్నాను. ప్రచురించిన మీకు నా అభివందనలు.

"పద్మ" (ఖర్గపూర్)

## కార్టూన్లు

"రచనలు — తూనిక"కు సంబంధించిన కార్టూన్లు, విట్లు ఇంక ఆపేస్తే చాలా బాగుండును.

ఆర్. ఎస్. బదరి, (వాల్తేరు)

## జపాన్ యువకుని కోరిక

నాకు, మీ దేశానికిచెందిన ఒక కలం స్నేహితుడు కావాలి. అందుకోసమే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. మా దేశంలోని యువకులమంతా, సహజంగా, ఇతర దేశాలవారి స్నేహాన్ని అభిలషిస్తూ ఉంటాము. ఉత్తరప్రత్యుత్తరాలను జరుపుకొంటూ, ఒకరి భావాలనొకరు పరస్పరం తెలుసుకోవటంలో మేము ఎంతో ఆశక్తి చూపుతున్నాము. అందువల్ల ఈ ఉత్తరాన్ని మీ పత్రికలో ప్రచురిస్తే, కృతజ్ఞుడనై ఉంటాను. నా వయస్సు 17 సంవత్సరాలు, అబ్బాయిని.

నా చిరునామా :—

Tokeo Uchihori
4411/ Terayashlki
Akanabe Gifu City
Gitu-Ken., JAPAN.

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# దీపావళి కథల పోటీ

## ముగింపు తేదీ 1-10-'64

○ *నవంబర్ నెలలో వెలువడే ఆంధ్ర సచిత్ర వార పత్రిక తొలి సంచిక దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో ఎప్పటికిమల్లే యీ ఏడాదికూడా 'కథలపోటీ' నిర్వహిస్తున్నాము. మంచి కథలకు మరింత ప్రోత్సాహం యిచ్చే నిమిత్తం బహుమతులను పెంచడం కూడా చేస్తున్నాము.*

○ *మొత్తం మూడు బహుమతులుంటాయి. బహుమతి పొందిన కథలకు చెందిన సర్వహక్కులు, ఆంధ్ర సచిత్ర వారపత్రికవై వుంటాయి !*

**మొదటి బహుమతి రు. 900 లు**
**రెండవ బహుమతి రు. 500 లు**
**మూడవ బహుమతి రు. 350 లు**

○ ఇతివృత్తం తెనుగు జీవితానికి సంబంధించినదై వుండాలి.

○ కథ అరఠావు సైజు కాగితాలపై ఒక వేపు సిరాతో రాసిపంపాలి. పన్నెండు పుటలకు మించరాదు.

○ పోటీకి గడువు అక్టోబర్ ఒకటవ తేదీ. అంటే మా కార్యాలయానికి ఆటుపై చేరిన రచనలు ఎంతమాత్రమూ పోటీకి స్వీకరింపబడవు. తమ తమ రచనలు తిరస్కరింపబడినప్పుడు తిరిగి పొందాలని కోరేవారు తమ రచనలతోనే తగినన్ని తపాలాబిళ్ళలు జతపర్చిన చిరునామాగల కవరులను పంపడం తప్పనిసరిగా భావించాలి.

○ పోటీ విషయంలో ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అనువాదాలు, అనుకరణలు పనికిరావు. రచనలు సొంత రచనలై తీరాలి. సంపాదకుల నిర్ణయమే తుది నిర్ణయం.

○ ప్రతి రచయిత తన రచనలతోపాటు (1) కలం పేరుతో రాస్తే అసలు పేరు (2) కథ తన సొంతమేనని తెలిపే ఒక జాబూ, పూర్తి చిరునామా విధిగా పంపాలని గ్రహించగోరుతున్నాము. పోస్టేజీ లేని రచనలు ఎంతమాత్రము త్రిప్పి పంపబడవు.

○ పోటీలో బహుమతులను పొందిన కథలు మూడూ; నవంబర్ 6 దీపావళి ప్రత్యేక సంచికలో వేస్తాము. పోటీలో బహుమతులను పొందని కొన్ని రచనలను కూడా సచిత్ర వారపత్రిక ఇతర సంచికలలో ప్రచురణార్థం స్వీకరించడం జరిగితే ఆయా రచనలను మామూలు రచనలుగానే స్వీకరించడం జరుగుతుంది. వాటికి యథోచిత పారితోషికం యివ్వడం జరుగుతుంది.

○ కవరుపై "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి. రచనలు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక: 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1" చిరునామాకే పంపాలి. వ్యక్తుల పేర్లతో పంపే రచనలు ఎంతమాత్రమూ ఆమోదించబడవు.

# మీ చర్మానికి తగినది

# నివియా




# ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన, సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను గోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్య వంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది. నివియా. ఇప్పుడే !

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్.




ఇండియాలో సోల్ డిస్ట్రిబ్యూటర్లు: జె. ఎల్. మారిసన్, సన్ & జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్,
పోస్టు బాక్సు నెం. 1746, బొంబాయి-1

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 14—8—'64
క్రోధినామ సం॥ శ్రావణ మాస శు॥ సప్తమి
సంపుటము 56 సంచిక : 50

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"నిగూఢంగావున్న నీ స్టాకును నేను తిరిగి నకు యిప్పించలేను. హైకమాండ్ యీ విషయాన్ని హస్తగతం చేసుకుంది. ఇక నా తరంకాదు."

## మన లో మాట

*ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరికీ 'స్వాతంత్ర్య దినోత్సవ' సందర్భంలో మా శుభాకాంక్షలు.*

రేపు మనం చేసుకునే 'ఆగస్టుపదిహేను' పండుగ పద్ధెనిమిదో సారి- దేశానికి స్వతంత్రం సిద్ధించినందుకు మనం చేసుకుంటున్న సంబరం! అంటే పదిహేడేళ్లే అయిందన్నమాట వలసాధిపత్యం యీ దేశంనించి నైదొలగి! దేశం రిపబ్లిక్‌గా అవతరించక మునుపే స్వాతంత్ర్య సమరనాయకుడు - మహాత్మా గాంధీజీ హత్య జరిగింది. దేశానికి ప్రణాళికాబద్ధమైన ప్రగతి పంథాను రచించి యిచ్చిన తొలి ప్రధాని- ప్రజల ప్రియతమనాయకుడు శ్రీ జవహర్‌లాల్ పోయి యింకా మూడునెలలు నిండలేదు. ఆయన పోవడంతో యించుమించు స్వాతంత్ర్య సమర శకం ముగిసింది. ఆతరం దేశభక్తులు మహా'వ్యక్తు'లు అస్తమించినట్లే కాని మన జీవన విధానంమీద వారి ప్రభావం, మన మనస్సులపై వారి స్మృతి చెరగని ముద్రవేసిపోయాయి. సాంకేతిక పారిశ్రామిక ఆర్థిక ప్రగతి స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనేటందుకు అవసరమన్న హెచ్చరికను మనకు చేసే రోజుగా కూడా యీ 'ఆగస్టు పదిహేను'ను జరుపుకోవల్సి వున్నది. ప్రపంచంలోకెల్లా పెద్దదైన ప్రజాస్వామ్య దేశం మనది — ఆ ప్రతిష్ఠ నిలుపుకో గల బాధ్యత యీ తరం ప్రతివ్యక్తి మీదా మరింతగా ఆధారపడి వున్నది !

* * *

బాలబాలికలకు ప్రత్యేకత యీ సంచికలో లేదనకూడా, [38, 39, 40, 41 పుటలలో] 'చాచా నెహ్రూ' వ్యాసం, దేశదేశాల జానపద కథలు శీర్షిక క్రింద ఈజిప్టు జానపద కథ మొదలైనవి వేశాము. కొత్త సీరియల్ కథ 'హృదయకుసుమాలు' రచయిత శ్రీ హరికిషన్ పాఠకులకు కొత్తవారు కాదు. ఈ 'సంచిక'లో కొన్ని ప్రత్యేక వ్యాసాలను చేర్చడంవల్ల 'సరాగమాల' 'ఇంటింటి పజ్యాలు' లాంటి మరికొన్ని మామూలు శీర్షికలను పైవారానికి వాయిదా వెయ్యవల్సి వచ్చింది. ★

## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన శ్రీబాపు


**కథలు :**

బ్రహ్మాండమైనకథ — 12
ప్రయాణం — 24

**సీరియల్ కథలు :**

కార్యసిద్ధి — 15
హృదయకుసుమాలు [ప్రారంభం] 32
మనసున మల్లెలు — 42
కూలినగోడలు — 50

**శీర్షికలు : వ్యాసాలు : సినిమా.**

ఉత్తరాలు 3, ఊమెన్ కార్టూన్ — 7, జార్ జోర్ సే బోలియే జైహింద్ (కథ) 8 ప్రాచీనగోవా—10, నరకానికి ప్రయాణం 19, స్త్రీ—సమాజంలో ఆమె ప్రతిపత్తి—21, వారఫలం—28, బాలసాహితి—38, ఎన్.టి.ఆర్ జాతకం—55, గాంధీజీ వారసుడు భౌతిక వాదియా?...—56, సినిమా 60


దొంగ నిలువచేసే ఎలుకలు


కేంద్రప్రభుత్వం
తీరు తెన్నులు!
కేంద్రం


చైనా


ఫరవాలేదు
అదే ఒక
అంగవస్త్రం
పెట్టు!



పదిహేడుసార్లు అగుపించిన యీ దృశ్యం యిక మనకి లేదు కాని దీని స్మృతి మాత్రం మాసిపోనిది

# 'జోర్ జోర్ సే బోలియే జైహింద్!'

స్వరాజ్యం వచ్చాకా
ఒంటరితనం ఎరుగని పావల్లారా!
నలభై నాలుగు కోట్ల
స్వేచ్ఛా భారత పౌరుల్లారా!

ఒంటరిగా ఒక్కరే ఒక్కరే వినట్లుందా మీకు?
వినబడటం లేదా మీ లోపల జవహర్‌లాల్ పలుకు?
అనండి అనండి ఇంకా గట్టిగా ఈ సారి
జై హింద్ జైహింద్ జై హిందని!

అన లేదా? మన జవహర్‌లాల్
ఎర్రకోటపై ఎత్తుగా వెలిగి
ఎఱ్ఱగా తెల్లగా పచ్చగా
ఆశలా శాంతిలా పంటలా

చైతన్య చక్రంలా జెండా నెగురవేసి
అన లేదా మన జవహర్‌లాల్
అనమని జైహింద్ జైహిందని!
అన్నాడన్నా! అన్నాడమ్మా! అంటూనే ఉన్నాడు!

ఒక్కొక్కణ్ని కలిపి తానొక్కడే
ఐ ఎత్తుకున్న బరువు తనదైన పరువు
మళ్లీ ఒక్కొక్కడికీ పంచియిచ్చి
నిన్నూ నన్నూ అందర్నీ ఒంటరిగా వొదిలి
వెళ్తూ వెళ్తూ అన్నాడన్నా అన్నాడు
జైహింద్ జైహింద్ జైహిందని మనమని !


ప్రధానమంత్రి లాల్ బహదూర్ శాస్త్రి

నీమీదా నామీదా
ప్రతి ఒక్కని మీదా పడ్డాదాతని వెలుగు
నీమీదా నామీదా
ప్రతి పౌరుని మీదా పడ్డాదాతని పరువు

ఎత్తైన హిమాలయ శృంగంలా
ఎదురెరుగని గంగా స్రవంతిలా
నీ వంతూ నా వంతూ మన అందరి వొంతూ
పదిహేడు వర్షాలు ఎలుగెత్తి పలికిన వెలుగు

ఈ సారీ అన్నాడమ్మా ! ఈ సారీ అన్నాడు
అనమని నిన్నూ నన్నూ తనవొంతు జైహింద్ !
అనగలవా అన్నా ! తనవొంతూ నువ్వు జైహింద్ ?
అనగలవా చెల్లీ ! తనవొంతూ నువ్వు జైహింద్ ?

అనగలిగి 'న్నాడు' అనగలిగి నేడు
మనగలమమ్మా మనం పదికాలాలు పచ్చగా
మార్గదర్శి మంచివాడు వెళ్తూ వెళ్తూ వెలిగాడు మనలో వెల్తురై ఎర్రగా
అందుకే ఎగురు ఎర్రకోటపై ఎత్తుగా జెండా చూడు
అందుకే ఒక్కటై వుంది దేశమంతా నేడు

జవహర్ లాల్ ! విను జవహర్ లాల్
జైహింద్ జైహింద్ అంటున్నాము
ఇంకా జోరుగా ఇంకా ప్రేమగా మేము
వేరుగా లేము వేర్వేరు గాబోము మేము
జైహింద్ జైహింద్ జైహింద్ ।

— వీ రా శి.





# ప్రాచీన గోవా




[1] సాల్సెటి జిల్లా కేంద్రం మార్గాం మ్యునిసిపాలిటీ భవనం [2] బోరిం బ్రిడ్జి

ప్రాచీన గోవా ఒకప్పుడు పోర్చుగీసు ఇండియాకు రాజధానిగా ఉండేది. 1843 సంవత్సరం నుంచి నవగోవా (పంజిం) రాజధానిగా ఉంటున్నది. నవగోవా నుండి మాండోవి నది మీదుగా లాంచిపై ప్రాచీన గోవాకు చేరవచ్చును. మరో మార్గం: లోండా (హుబ్లీ—పూనా సెక్షను) నుండి పంజింకు బస్సుపై ప్రయాణం. ఇంకా కోల్లెం, మార్గాం (లోండా—మార్మగోవా సెక్షనులో రైలు స్టేషనులు) ల నుండి కూడా బస్సులపై పంజిం పోయే మార్గంలో పాతగోవా చేరవచ్చును.

## పునరుద్ధరణ కృషి

ఆ రోజుల్లో ప్రాచీన గోవాలోని భవనాలు. అప్పటి ఆ నగర వైభవం దానికి 'పెరల్ ఆఫ్ ది ఈస్ట్', 'రోమ్ ఆఫ్ ది ఈస్ట్' అనే పేర్లు తెచ్చాయి. ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్న దేవాలయాల చర్చిల మొదలైనవాని పునర్నిర్మాణానికి తీవ్రమైన కృషి జరుగుతూంది. ముఖ్యంగా ఈ సంవత్సరం డిశంబరు 9 వ జరగబోయే సెయింటు ఫ్రాన్సిసు క్సేవియరు ఉత్సవం దృష్ట్యా సుమారు 5 లక్షల యాత్రికులు వస్తారని ప్రభుత్వం అంచనా వేస్తూంది. గోవా అంతటా జీర్ణ శిథిలాల పునరుద్ధరణకు, చరిత్రాత్మక స్థలాలను చేరే రోడ్లను వెడల్పు చేయటానికి ప్రభుత్వం 7 లక్షల రూపాయలు కేటాయించింది. ఏడు అంతస్థులు, డెబ్బయి గదులు గల ఒక వసతి గృహము, 45 గదులు గల మరో వసతిగృహమును నవగోవా యాత్రికుల సౌకర్యార్థం నిర్మించబడుతున్నాయి. నవనాగరిక సాంప్రదాయాలు, ఆధునాతన సౌకర్యాలకు అనుగుణంగా మరో ప్రైవేటు హోటలు, ఇంకా గోవా అంతటా యాత్రికుల కొరకు సుమారు 500 పెడ్ల నిర్మాణానికి సంకల్పం జరిగింది.

## మహమ్మదీయుల నిర్మాణం!

ప్రాచీన గోవా 1479 లో మహమ్మదీయులచే ప్రథమంగా నిర్మింపబడింది. అప్పటి బీజపూరు సుల్తాను ఆదిల్‌షాకు గోవాను రాజధాని చేసుకోవాలనే ఆకాంక్ష కలిగింది. కాని 1510 సం. లో అల్బుకర్కు దానిని స్వాధీనం చేసుకోవటంతో సుల్తాను ఆశలడియాసలయినాయి. వర్తకవ్య

భారత్‌కు స్వతంత్రం సిద్ధించిన పధ్నాలుగు సంవత్సరాల దాకా కూడా యీ గడ్డ మీద పరసాధిపత్యపు కళంకం గోవా డయ్యూ డామన్‌లనే సుమారు 1400 చ|| మై|| విస్తీర్ణంలో సుమారు ఆరున్నర లక్షల ప్రజలమీద ఉంటూ వచ్చింది. నాలుగువందల ఏభై సంవత్సరాల పోర్చుగీసు పరసాధిపత్యం తరువాత 1961 సం||రం డిసెంబరు పందొమ్మిదొవ తారీఖు ఉదయం ఆరు గంటలకే గోవాకే, ఎనిమిది గంటల ఇరవై నిమిషాలకి డామన్‌కీ, పదకొండు గంటల పదినిమిషాలకి డయ్యూకి, విముక్తి లభించింది. ముప్పేట దాడిలో - వెనుక హైదరాబాద్‌పై సైనిక చర్య తీసుకున్న లెఫ్టినెంట్ జనరల్ చౌధురియే యీ విజయాన్ని కూడా సాధించాడు. మార్చి పధ్నాలుగు '62 న లోక్‌సభ గోవాను భారత దేశంలో - కేంద్రపాలిత ప్రాంతంగా బిల్లు చేసి-కలిపింది. కొంకణిభాష ప్రథమభాషగా 61 శాతం హిందువులు 37 శాతం రోమన్ కాథలిక్‌లు 2 శాతం ముస్లిములు గల యీ 'గోవా'కి పంజిమ్ ముఖ్యనగరం. ఈ ప్రజలు యిప్పుడు నలభైనాలుగుకోట్ల స్వేచ్ఛా భారత పౌరుల కష్టనష్టాలలో భాగస్వాములు.

- బొంబాయికి దక్షిణంగా 300 మైళ్లలో గల గోవా ముఖ్యపంట మాంగనీసు, ఇనుములని చెప్పాలి.
- క్రీ|| శ|| 1370 తర్వాత విజయనగర సామ్రాజ్యంలో కూడా కొంతకాలం వున్న యీ గోవాను పురాణాలలో 'గోవపురి' 'గోమంత్' అనే పేర్లతో ప్రస్తావించినట్లు తెలుస్తోంది.
- క్రీ|| శ|| రెండో శతాబ్దంనించి కదంబవంశపాలకుల హస్తగతమై వున్న యీ ప్రాంతాన్ని పధ్నాలుగవ శతాబ్దారంభంలోనే మహమ్మదీయులు తీసుకోగలిగారు.
- ఫిబ్రవరి 10, 1510 లో మొదటిసారి పోర్చుగీసువారు ఆసియాలోనే గోవాపై దాడి చేయడం ద్వారా అడుగు పెట్టారు. బీజపూర్ సుల్తాన్ యీ బుడతకీచుల నాయకుడు అల్బుకర్క్‌ని మొదట తిరగగొట్టాడు. కాని అల్బుకర్క్ ఆ సంవత్సరం నవంబర్‌లోనే తిరిగి వొచ్చి గోవాను స్వాధీనం చేసుకొన్నాడు. డామన్ డయ్యూ ప్రాంతాలు దరిమిలాన 18 వ శతాబ్దంలో మరాఠీ రాజుల నించి పోర్చుగీసుల హస్తగతమైనాయని తెలుస్తోంది.
- ఇదివరకు గోవా స్థానిక పౌరుడైన ఉపాధ్యాయుడు శ్రీ లక్ష్మీనరసింహారావుగారు పంపిన 'ప్రాచీన గోవా' అనే వ్యాసం, ఫొటోలు యిక్కడ వేస్తున్నాము.

వాణిజ్యా మూలంగా ఆల్బుకర్క్ [illegible] వృద్ధి పరిచాడు.

ఈ నగరాన్ని జలమార్గాన చేరగానే ముందుగా మనల నాకర్షించేది ఒక పెద్ద ఆర్చి. "వైస్రాయిల ఆర్చి" వుంది. పదవీస్వీకరణ ముందు అధికారి ఈ ఆర్చిగుండా వెళ్ళేవాడుట. అందుకని ఆ పేరు వచ్చింది. ఇక్కడ ఆల్బుకర్క్ విగ్రహం కానవస్తుంది. దీనికి ఎడమప్రక్క పూర్తి జీర్ణావస్థలో నున్న వైస్రాయి భవనం ఇప్పటికీ కనబడుతుంది. ఇక్కడే నాలుగు కాన్వెంటులున్నాయి. వీటిలో ప్రధానమైనది 'హోలీ క్రాస్ ఆఫ్ ది మిరకిల్స్.' దీనిలోని చెక్కు చెదరని శిల్పసంపద ఇప్పటికీ యాత్రికులను దిగ్భ్రాంతులను చేస్తుంది. ఈ కాన్వెంటు ప్రక్కగా రోము నగరంలోని సెయింటు పీటర్స్ చర్చి నమూనాలో నిర్మింపబడిన మరో ప్రఖ్యాత చర్చి కానవస్తుంది. ఇంకోవైపున చరిత్ర ప్రసిద్ధిగాంచిన గోవా కేథడ్రలు ఉంది. సెయింటు పీటరు, సెయింటు కేథరిన్, మేరీ కన్యల గౌరవార్థం నిర్మింపబడిన ఈ కెథీడ్రలు సుమారు 75 మీటర్ల పొడవు, 65 మీటర్ల వెడల్పు 55 మీటర్ల ఎత్తు ఉంటుంది. జగత్ప్రసిద్ధమైన పెద్ద గంట ఒకటి ఈ కెథీడ్రలులో ఉంది. ఈ సిలువకు బంగారు మేకులతో బిగింపబడిన పల్చటి కొయ్య పొర ఉంది. ఈ కెథీడ్రలులోని అద్భుతమైన శిల్పసంపద, చిత్రలేఖనం ప్రతి వారిని ఆకర్షించి క్రైస్తవేతరులను సహితం ముగ్ధులను చేస్తుంది.

## క్రైస్తవమత ఆలయాలు

మరో దిశలో సైంట్ అంథోని 'చర్చి' ఉన్నది. సెయింటు అంథోని వారి మహాత్మ్యం కేథలిక్కులకు సువిదితమే. ఇటాలియనులు, పోర్చుగీసువారు, ఆయనను ప్రధాన దేవతగా పరిగణించేవారు. గోవాకు వచ్చేవారందరూ తప్పక దర్శించవలసిన వాటిలో ఇది ఒకటి. దీని దగ్గరగా కొండమీద 'చర్చ్ ఆఫ్ ది మిరక్యులస్ క్రాస్' ఉన్నది. ఇది ప్రస్తుతం పూర్తి జీర్ణావస్థలో ఉంది. దీనికి దగ్గరే ఇప్పటికీ శిథిల రూపంలో కానవచ్చే ఒక స్తంభం వద్ద ఆ కాలంలో నేరస్థులను ఉరిదీసేవారట. కొండ క్రింద రోడ్డమీదుగా కొంతదూరం నడుస్తే మనోహరమైన సరస్సు కనుపిస్తుంది. దీనికి దగ్గరనే ఆల్ సైంట్స్ ఆసుపత్రి స్థలం ఉంది. 1851 వరకు అక్కడ ఉన్న వైద్యశాలను ప్రస్తుతం [illegible] రైబందరుకు మార్చారు.

ఆగ్నేయంగా చూస్తే సెయింటు థామసు చర్చి శిథిలాలు కనబడుతాయి. ఆ మహాత్ముని ఎముకలు ఆయనను వధించిన బల్లెము ఇప్పటికీ ఇక్కడ భద్రపరుపబడి ఉన్నాయి. కార్మెలైట్ చర్చితో సెయింటు లాజరసువారి విగ్రహం (పాదాల దగ్గర రెండు కుక్కలతో సహా) భద్రం చేయబడినవి. [illegible] సెయింటు ఫ్రాన్సిసు మహాత్ములవారెన్నో అద్భుతాలు చేశారని ప్రజలు చెప్పుకుంటారు. 'కార్మెల్' కొండకు దిగువగా సెయింటు అలెక్సియసు చర్చి, మరోవైపు సెయింటు డోమినికు చర్చి ఉన్నాయి. సెయింటు డోమినికు చర్చి చాలా విశాలమైనది. ఈ చర్చికి సంబంధించినవారు ప్రత్యేకంగా నల్లని

58వ పేజీ చూడండి



ఏటా లక్షలకొలది కేథలికులను, ఇతరులనూ ఆకర్షించే 'సెయింట్ ఫ్రాన్సిస్ క్సేవియర్' క్రైస్తవ దేవాలయం.



కుశావతి నది ఒడ్డున జాంబవతి గ్రామంలోని శివ, కేశవుల ఉమ్మడి దేవాలయ ముఖద్వారం.



వ్యాసరచయిత:
కొమ్మరాజు
లక్ష్మీనరసింహారావు

# బ్రహ్మాండమైన కథ

ఆనందమైన కథ, కదిలించే కథ, జరిగిన కథ మొదలైనవి ఇదివరలో కథా సాహిత్యంలో వెలువడ్డాయి. ఇది బ్రహ్మాండమైన కథ. చదివిన వారందరినీ బ్రహ్మాండంగా మెప్పించి బ్రహ్మానంద భరితుల్ని చెయ్యాలని నా కోరిక. కాని అందరినీ మెప్పించడం బ్రహ్మతరం కూడా కాదు. అందుకే....

ఉపోద్ఘాతం చాలించి, అసలు కథకుపక్రమిద్దాం! బ్రహ్మ దేవుడికీ కవులకీ వృత్తి వైరం లాంటిదేదో వుండి వుంటుంది. అందుకనే వాళ్ళు 'పిల్ల' దొరికినప్పుడల్లా బ్రహ్మ మీద విరుచుకు పడి, విమర్శ విసిరేరు.

'బ్రహ్మకైనను పుట్టు రిమ్మ తెగులు' అన్నాడొక కవి.,

'ముదిమి మది దప్పిన మొదటి వేల్పు'గా పేర్కొన్నాడు పెద్దన., ''ఓరి బ్రహ్మదేవుడా! నీ బుద్ధి యింత బుగ్గయి (బుగ్గ కాదు. బుగ్గి అయి) పోయినదేమిరా?'' — అని బాహాటంగా నిలదీశాడు మరో మహాకవి!

నిప్పు లేనిదే పొగరాదు గదా! బ్రహ్మపై వచ్చిన ఆరోపణలలోని నిజా నిజాలు విచారించ వలసిందిగా కమిటీని నియమించగా, వారు సమర్పించిన నివేదిక మేరకు వెల్లడింప బడిన, బ్రహ్మ గావించిన — నేరాలేవనగా.,

1. దివ్యస్థలంబగు తిరుపతి కొండను కోతి మూకకు పాదుగొలుపుట!

2. హంస తూలికా తల్పంబులందున చెడు నల్లులను సృష్టి జేయుట.

3. ప్రీతి నించెడు గులాబీ చెట్ల నాడి నించెడు ముళ్ళు సృజించుట.

4. సౌఖ్యముల కాకరమైన చింతామణి ఇంట శ్రీహరిని సృష్టి చేయుట.

నివేదికలోని పై అంశాలు సత్యదూరాలు కావు. కాబట్టే శాశ్వత బ్రహ్మ కల్పంగా నిలిచి వున్నాయి. వీటిని కాదనడం బ్రహ్మవశం కాదు. బ్రహ్మ తరం కానివి చాలా వున్నాయి.

అతని కెంత కోపం వచ్చినా హంసకు, ''వనజ వనీ విహార కలనము దొలగంగ జేయు గాని, గుంభమున దుగ్ధ జీవన విభాగ విధాన నిరూఢీ వైపుణ జనిత మహాయశో విభవ సారము'' మాన్పలేడు. ఇది కవి చమత్కృతి. తనకు చేత కాదని తనంత తాను అంగీకరించిన విషయం మరొకటుంది. ''నా చేతను గాని పని — స్త్రీల నోరు మూయుటమ్మో'!

కేనీ చాత కాదని నిందించడం అనుచితం! అన్యాయము! అక్రమం! అధర్మం!

త్రిమూర్తులలో విష్ణువు శ్రీ, భూ, నీళలకు భర్త. మహేశ్వరుడు గౌరీపతి, గంగాధరుడు బ్రహ్మ ఏకపత్నీ వ్రతుడు. బ్రహ్మ లిపి యెవరి బోధ పడదు — కాబట్టే యెవరి చేత మార్చబడదు. అందుకనే ''మదుటన్ వ్రాసిన వ్రా మార్చ గలమే మారేండ్లు చింతించినన్'' అన్న సూక్తి ఉద్భవించింది. అంతేకాదు, అతడ ''వెన్నొసట వ్రాసిన సొమ్ము మరుభూమి కేగినన లభించు; మేరువు చేరబోయినన్ ధనమధికం రాదు.''

కవుల కావ్యాలలో 'అది లేదు' 'ఇది లేదు' అని రంధ్రాన్వేషకులైన విమర్శకులు తెగనా



వేట్నా., బ్రహ్మ లిపిలో తప్పు లెన్నడం అతని కొడుకు నారదుని కలవాటు. కళ్లలో ఒత్తులు వేసుకుని వెతగ్గా సముద్ర తీరాన అతనికో కపాలం కనిపించింది. శ్రద్ధాశక్తులతో దోషగవేషణ గావించగా; బ్రహ్మ కపాలం మీద ( హరి ద్వారం బ్రహ్మ కపాలం కాదు.) కపాలం మీద బ్రహ్మ ! వ్రాసిన పంక్తులలో

'' ......... సముద్ర తీరే మరణం
కించిత్ భోగం భవిష్యతి '' — అని కనిపించింది. వివాదగ్రస్తమైన కావ్యపు కవి కర్తృత్వం గురించి గ్రంథస్థ మయిన ఆధారం దొరికినంత బ్రహ్మానందం కలిగింది బ్రహ్మ నందనునకు ! '' చచ్చిన తర్వాత భోగ మేమిటి ? అనుభవమేమిటి ? విడ్డూరం ! వయస్సు మళ్లింది. బుద్ధి సన్న గిల్లింది. తన పదవికి నారసుణ్ణి ఎన్నుకొని, తర్ఫీదిచ్చి, శిక్షణానంతరం పదవికి రాజీనామా ఇచ్చి, ఆ పదవి శిక్షితుడికి ఇచ్చి, యే వేసవి విడిదిలోనో శేష జీవితం గడప కూడదా ? '' అని తనలో తాను తీర్మానించుకుని, ఆ తీర్మానంతోపాటు సముద్ర తీరాన దొరికిన కపాలము గొని, సత్యలోకము జని, తా గన్న విడ్డూరం తండ్రికి విన్నవించగా —

నారదుని ఏకగ్రీవ ( తక్కిన వారి గ్రీవాలు వినిపించక పోవడం రాజకీయ ధర్మం ) ఏకైక గ్రీవ తీర్మానం విని బ్రహ్మ వెల్లడించిన వైనమిది :

'' నిరంతర నారాయణ స్మరణ పరాయణుడవు ! బ్రహ్మానంద మానస బ్రహ్మచారివి ! త్రిలోక(సం)చారివి ! త్రికాల వేదివి ! స్వహస్తాలతో ఆ కపాలం, మర్త్యలోకం నుంచి సత్య లోకానికి తీసుకు రావడమే ఆ '' కించిత్ భోగం '' అన్నాడు బ్రహ్మ. పదవికి రాజీనామా ఇవ్వాలన్న తీర్మానం వోటింగ్ వరకూ రాకుండానే ' వోడి పోవా యుంది ' .......

అదీ బ్రహ్మ లిపి. బ్రహ్మాస్త్రం అలాటిదే ! ఆ అస్త్రం ప్రయోగించాక, మరే అస్త్రమూ దాని మీద పని చెయ్యదు. బ్రహ్మముడి అలాటిదే ! బ్రహ్మవిద్య కష్టసాధ్యమైనది. ససాధ్యమైన వాటిని గురించి వ్యంగ్యంగా చెప్పాలంటే '' ఓ అదేం బ్రహ్మవిద్య గనకనా ? ఇట్టే సాధిస్తా '' అనడం పరిపాటి. ఏ పనైనా సాధించడానికి విపరీతంగా పరిశ్రమించి, అపరిమితంగా అల్లకల్లోలము లేవదీస్తే ' బ్రహ్మ ప్రళయ మయింది ' అని సగర్వంగా చాటి చెబుతారు.

మహా నదులతో విలసిల్లే భారత దేశానికి తరచు ప్రళయాలు ఉపద్రవాలు సంభవిస్తుంటాయి. వాటిలో ఒకటి, ఉత్తరప్రదేశ్‌లోని బ్రహ్మపుత్రానది వరదల భీభత్సం.

వరదలకి సైతం వెరువని చలింపని నిశ్చల సమాధి స్థితి చతుర్ముఖ పురాణం పారాయణ చేసే వాళ్లకి సిద్ధించింది. చతుర్ముఖాలంటే ఋగ్, యజుర్, సామ, అధర్వణాలనుకునేరు ! ఆటీన్, డైమన్, ఇస్పేట్, కళావర్ అన్నవి చతుర్ముఖాలు. (రాజకీయ జూదంలో చతుర్ముఖాలు.) 1. పలుకుబడి. 2. ఎన్నికలో విజయం. 3. పదవి. 4. సంపద.

జీవితంలో పండుగ రోజుల్లో చతుర్ముఖ పురాణం అధ్యయనం చేస్తారు కొందరు. ఆ ' పెరడుగ ' తోనే జీవితమంతా గడుపుతారు మరి కొందరు. ఇవన్నీ బ్రహ్మ సృష్టిలోని విచిత్రాలు. అతని సృష్టివైచిత్రి గురించి చిన్నప్పుడొక చిన్న పాఠం చదువుకున్నాను.

దారినపోయే దాసయ్య ఒకడు ఎండగా వుందని చెట్టు నీడకి చేరుకున్నాడు. తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టినట్టు కొమ్మలు, ఊడలు, ఆకులు, కాయలూ చూడ్డం మొదలెట్టేడు. చూడగా చూడగా, అతనికో బ్రహ్మ జిజ్ఞాస కలిగింది. '' ఇంత పెద్ద చెట్టుకి ఇంత చిన్న కాయలేమిటి ? బ్రహ్మకి బుర్రలే'' దనుకున్నాడు. ( నిజమే ! బ్రహ్మకి ఒక బుర్రలేదు !! ) ఎండ తగ్గలేదు. కాళ్లు పీకెడుతున్నాయి. పడుకుంటే బాగుంటుం దనుకున్నాడు. అటూ ఇటూ చూశాడు. గుమ్మడి కాయలతో వున్న తీగ పాద కనిపించింది.

కాయలున్నాయి ! బ్రహ్మకి నిజంగానే బుర్ర లేదు '' అని దృఢ పరుచుకున్నాడు. పరుచుక పడుకున్నాడు. లేచే సరికి తన చుట్టూ గా పడి వున్న మర్రిపళ్లు ( తన మీద కూడా కొ పడ్డాయి ! ) చూశాడు.

బ్రహ్మని నిందించిన తన తెలివి తక్కువతనా సిగ్గు పడ్డాడు. బాటసారులు విశ్రమించే పె చెట్టుకి పెద్ద కాయలు ఎందుకు బ్రహ్మ సృష్టి లేదో అర్థమైంది.

విచిత్రమైన బ్రహ్మసృష్టి ఆదర్శప్రాయమైన బ్రహ్మకి పితామహుడని పేరు. ఏ మ ష్యుడైన ఒక కొత్త విషయం కనిపెట్టి, రంగంలో మార్గదర్శకుడైతే అతనిని పితామ నిగా సంభావిస్తారు. సన్మానిస్తారు.

అల్లసాని పెద్దన ఆంధ్ర కవితా పితామహు



**'లతిక'**

# బ్రహ్మాండమైన కథ

అక్కనే కవి బ్రహ్మ ఆదిభట్ల నారాయణదాసు గారు హరికథా పితామహులు !

పెద్దన వాడు ప్రాదుర్భవించిన ప్రబంధం పింగళి సూరన నాటికి ఉచ్ఛదశ అందుకుంది. అతని కళా పూర్ణోదయ మంతటికీ మూలం వాణి చతుర్ముఖుల ప్రణయ ప్రసంగమే. ఆ కావ్యంలోవి పాత్రలన్నీ వారి చేతల ప్రతి రూపాలే.

సరస్వతి అనసేందు బింబమే కళాపూర్ణుడు. ఆమె నవ్వు అభినవ కౌముది. రూపానుభూతి, మదాశయుడు, ధీర భావుడు, మొదలైన పాత్ర లన్నీ బ్రహ్మ అనుభూతులు.

తొలి జన్మలో సరస్వతీదేవి పెంపుడు చిలుక, మరుసటి జన్మలో కలభాషిణి. మూడవ జన్మలో మధురలాలస! ఈ మూడు జన్మల కళాపూర్ణోదయ బృహత్కథ — అర్థం కాని వాళ్లకి, చేసుకునే వోపిక లేని వారికే బ్రహ్మజెముడు ముళ్లడొంకలా వుంటుంది. అర్థమైతే 'ఆనందో బ్రహ్మ' అన్న వేదోక్తిలోని నిజం అనుభవానికి వస్తుంది.

అనుభవాలు యెవరివైనా, వాటివల్లగుణ పాఠాలు అందరూ నేర్చుకోవచ్చు. 'ప్రమత్తులై నిద్రపోతే సొత్తు దొంగలు కాజేస్తారు' అన్నది మొదట బ్రహ్మకే అనుభవమైంది. "ప్రళయాంభో నిధి లోన మేన్మరచి నిద్రం జెందు వాణీశు మోముల వేదంబులు" సోమకాసురుడు అపహరించాడు.

యోగ నిద్ర కానివ్వండి ! మొద్దు నిద్ర కానివ్వండి ! మేను మరచి నిద్రపోతే ఇలాటి ఇబ్బందులు తప్పవు. సోమకాసురుడు వేదాలు అపహరిస్తే, రావణాసురుడు వేదవతీ అవతారమైన సీతను అపహరించాడు. ఆమె కోసం రాముడు రావణుని ప్రాణాలు హరించాడు. రాముడికి బ్రహ్మహత్యా పాతకం బ్రహ్మరాక్షసిలా చుట్టుకుంది. ఆ పాప పరిహారానికి రాముడి శివలింగ ప్రతిష్ట గావించాడు. రామునిచే ప్రతిష్ఠింపబడిన శివలింగమే రామలింగం. ఆ తీర్థమే రామేశ్వరం. నాటి సంఘటనకి చిహ్నంగా రాముని పేర రామేశ్వరం వున్నట్లే బ్రహ్మ పేరిట కూడా ఒక ఊరు ఉంది. అది బ్రహ్మపురం. సంయుక్తాక్షరాలు పలుకలేని పాశ్చాత్యులు బెర్‌హెంపూర్ అన్నారు. క్రమంగా అది ఈనాటికి బరంపురం అయింది.

" మనం మనం బరంపురం " అంటారు పిల్లలు. బాల వాక్యం అంటారు పెద్దలు. బాలలకి బ్రహ్మదేవునితో సమానమైన ప్రతిపత్తి లభించడానికి కారణం తెలుసా ? !

" తొలత బ్రహ్మాండమ్ము
తొట్టె గావించి
నాలుగు వేదముల్.
గొలుసు లమరించి
జో అచ్యుతా నంద
జో జో ముకుందా !
లాలి పరమానంద
రామ ! గోవిందా !"

— అని దేశి కవితలో, ద్విపద ఛందస్సులో తల్లులు జోల పాటలు పాడడమే ఆ కారణమేమో ! బాలుడు జోల విని నవ్వళిస్తే నడతికి బ్రహ్మానందం కలుగుతుంది. బ్రహ్మానంద మన్నపదానికి, ఆంధ్ర కవితా పితామహుని నిర్వచనమిది. ( వచనం కానిది — నిర్వచనం — పద్యం !! )

'ఎందే డెందము కదళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగత దీపకళికా
శ్రీ దోప నెందెందు బో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నా
యుంపే పరబ్రహ్మ ' మా
నందో బ్రహ్మ ' యటన్న ప్రాజదువు
నంతర్బుద్ధి నూహింపుమా !'

ఇంత బ్రహ్మాండంగా కవిత చెప్పాడు గనకనే సారస్వత పోషకుడు, ఆంధ్రభోజుడు అయిన రాయలు పెద్దనకి బ్రహ్మరథం పట్టేడు. మను చరిత్ర వ్రాసిన ఘనత పెద్దనది. ఆదరించిన ఘనత ఆంధ్ర విద్వజ్జనతది.

బ్రహ్మార్పణం!





# కార్యసిద్ధి

ముద్దా శాస్త్రిబాబు

## 14

శుక్రాచార్యుడు కధ ప్రారంభించాడు.

సింధురాజు శ్రద్ధగా వింటున్నాడు—

'అమ్మా !— ఈ ప్రపంచంలో గల వీరాధి వీరులందర్నీ వోడించి వేశాను. దేశదేశాలన్నీ జయించి వేశాను. ఎక్కడెక్కడి నించో అపరూప సౌందర్య వతుల నెందరినో తెచ్చి మన లంకా పట్టణంలో పెట్టాను, నా వల్ల కాని పని అంటూ ఏమీ లేదు. నీకేం కావాలో చెప్పుతల్లీ !— క్షణంలో తెచ్చి ఇస్తాను. . . .' అంటూ, రావణబ్రహ్మ ఒకప్పుడు తల్లి అయిన కైకసను అడిగాడు.

'సంతోషం నాయనా ! బతికి వున్నాళ్లింక బతకను. ఇంకా నాకు కోరిక లేమిటి, తండ్రీ !'— అన్నది కైకస.

'అలా కాదమ్మా ! నువు కోరుకునే తీరాలి. నీ కోరిక నేను తీర్చే తీరాలి. లేకపోతే నా జన్మ సార్థకం కాదు !' అన్నాడు, రావణుడు.

'బిడ్డా !— అంతగా నువ్వు పట్టుబట్టావు గనక అడుగుతున్నాను ! నా నిత్య పూజ కోసం మహేశ్వరుడి ఆత్మలింగం స్థాపించుకోవాలని చిర కాలం నించి ఆశగా ఉంది. వీలయితే తెచ్చిపెట్టు. ఇంతకు మించి నుచేసిగా వద్దు. . . .' అని తన మనసులో మాట చెప్పింది, కైకస.

'అదేమిటమ్మా ! ఈపాటి దానికే వీలయితే తెచ్చి పెట్టమని సంశయిస్తూ అడుగుతావేమిటి!? —తప్పక తెచ్చి నీకు సమర్పిస్తాను. ఇదిగో ఇప్పుడే వెళుతున్నా' అంటూ, రావణుడు తల్లి దీవెనలందుకుని, ఈశ్వరుడి ఆత్మలింగం కోసం బయల్దేరాడు.

* * *

'పన్నగభూషణా !' అని పాడుకుంటూ, కైలాసంలో కాలు పెట్టాడు, నారద మహర్షి.

అర్ఘ్య పాద్యాలతో సత్కారం జరిగింతర్వాత కుశల ప్రశ్నలు వేస్తూ, 'మహాత్మా ! ఏమిటి విశేషాలు ?' అని అడిగాడు, పరమేశ్వరుడు.

'విశేషాల కేముంది. అన్నీ మామూలుగా జరిగి పోవటమే గొప్పవిశేషం. దానికేం గాని, చిన్న మాట ఒకటి చెప్పిపోదామని ఇప్పుడిలా వచ్చాను : నీభక్తుడు రావణాసురుడున్నాడే, అతను నీ ఆత్మలింగం కావలసి వస్తున్నాడు. కన్ను తెరిచి ఉండు, మహాదేవా !'— అని హెచ్చరించాడు, నారదుడు.

* * *

అన్నట్టుగానే, రావణుడు తపస్సు చెయ్యడమూ ఫలితంగా పరమేశ్వరుడు సతీసమేతంగా దిగి రావటం జరిగింది.

'ఏమి రావణా ! ఏం కావాలి ?' పరమేశ్వరుడు అడిగాడు.

రావణుడి దృష్టి అంతా పార్వతిపైనే ఉంది ! ఆ ధ్యాసలో అతడు 'పా. . . . ర్వ. . . . తి. . . .! అన గలిగాడు, దేవి సౌందర్యానికి ముగ్ధుడై, అంతే'

శంకరుడు మాయ మయ్యాడు. రావణుడి ఎదుట పార్వతి మటుకు నిలిచి పోయింది !—

తను వచ్చిన పని మరిచి పోయాడు, రావణుడు. పార్వతిని వెంట బెట్టుకు బయల్దేరాడు.

తోవలో నారద మహర్షి తారసపడ్డాడు.

'అదేమిటయ్యోవ్, రావణా ! అయ్యో బాబోయ్ !— భూతం ! !— భూతాన్ని వెంట బెట్టుకు వస్తున్నావేమిటి ! ! !'— అంటూ పెద్ద కేక వేశాడు !

గిరుక్కున వెనక్కు తిరిగాడు, రావణాసురుడు ! చూస్తే— నిజంగా భూతమే ! — అతని వెనక ఉన్నది. పార్వతీదేవికాదు — భూతం !— రావణుడు కళ్ళకి నిజంగా భూతమే కనిపించింది ! !—

'అరి పిచ్చివాడా !— ఆ ఈశ్వరుడు నిన్ను మోసం చేశాడు. లేకపోతే, అడగ్గానే పార్వతిని నీకిచ్చేస్తాడా ? అంత తెలివి తక్కువ వాడా ?—' అని వేళాకోళం చేశాడు, నారదుడు.

వెంటనే రావణుడు భూతంవేపు తిరిగి 'ఫో—'మ్మన్నాడు. భూతం మాయమయింది!!—

రావణుడు తెలివి తెచ్చుకున్నడు. ఆత్మలింగం కోసమని మళ్ళీ తపస్సు ప్రారంభించాడు. ఈసారి ఈశ్వరుడు తన భక్తుని కోరిక తీర్చక తప్పిందికాదు.

'' రావణా ! — నీ భక్తికి మెచ్చాను. ఇదుగో, నువు కోరిన ఆత్మలింగం. జాగ్రత్తగా పట్టుకెళ్ళు. అయితే, ఒక్క మాట మాత్రం జ్ఞాపక ముంచుకో. దీన్ని ఎక్కడైతే భూమి మీద పెట్టావో, అక్కడే ఇది స్థాపితమై పోతుంది. మరి నీకు దక్కదు ! ' అని పరమేశ్వరుడు ఆత్మలింగాన్ని ఇచ్చాడు. రావణుడు దాన్ని అందుకుని, భక్తితో కళ్ళకు అద్దుకున్నాడు. తల్లి కోరిక నెరవేర్చ గలిగి నందుకు సంతోషంతో ఉరకలేసుకుంటూ, లంకకు మళ్ళ ముఖం పట్టాడు.

తిరుగుదలలో దారిలోనే సందె వేళయింది. సంధ్య వార్చుకోవాలి. చేతిలో శివుడిచ్చిన ఆత్మ లింగం వుంది. దాన్ని కింద పెట్టడానికి వీల్లేదు. చిక్కే వచ్చింది. ఎలా ? అని ఆలోచనలో పడ్డాడు.

[illegible], ఒక పశువుల కాపరి కుర్రవాడు ఆ దారిన పోతున్నాడు. వాడు పొట్టి వాడు, మెల్లచూపు వాడు, వెర్రికీ అయిన వాడులా కనిపించాడు.

'' ఏయ్, అబ్బాయీ ! ' — అని కేక వేశాడు రావణబ్రహ్మ.

వాడు చెంగు చెంగున గెంతుకుంటూ వచ్చి, ' ఏం ? ' అని ప్రశ్నించాడు.

' సంధ్య వేళ దాటి పోతూంది. కాస్సేపు ఈ లింగాన్ని పట్టుకుంటావా, నాయనా! ఇప్పుడే వచ్చేస్తా' నన్నాడు, రావణాసురుడు.

' ఏదీ, ఎంత బరువుందో, చూడనీ ! ' అన్నాడు. కుర్రవాడు.

రావణుడు ఆత్మలింగాన్ని వాడి చేతికిచ్చాడు.

' అబ్బో ! —, శానా బరువుందే. నేను మొయ్య లేను బాబూ, నావల్ల కాదు.......' అని ఇచ్చెయ్య బోయాడు. కుర్రవాడు.

' బాబ్బాబు, ఇట్టే వచ్చేస్తా. కాస్త పట్టుకో ! ' నంటూ బతిమాలాడాడు, రావణాసురుడు.

' అట్టయితే ఒక మాట : నిన్ను మూడుసార్లు పిలుస్తా. మూడోసారి పిలిచే సరికి రాకపోయావో, దీన్ని కింద పెట్టేసి, నాదారిన నేను పోతాను. అంతే. తెలిసిందా ? ' అని కచ్చితంగా చెప్పాడు. కుర్రవాడు.

' ఓ . అలాగే ! — ' అంటూ, రావణాసురుడు ఒప్పుకున్నాడు.

' బాగానే వుంది. మరైతే నిన్ను ఏమని పిలవడం ?' అని అడిగాడు పశువుల కాపరి.

' నా పేరు రావణ ................ '

' సరే, తొందరగా పోయిరా ?

ఒక్క క్షణం ఆగి —

' ఇదుగో, మొదటిసారి ...... రా—వ—ణా !—'

రావణుడు పరుగెత్తుకు వెళ్ళాడు, మడుగులోకి.

' రావణా ! — ' అని రెండో పిలుపు.

నీళ్ళలో దిగి నించుని వున్నాడు, రావణుడు.

' రా — వ — ణా !!! ' — మూడోసారి.

ఇంకా సంధ్యావందనం మొదలెట్టనైనాలేదు. ఇప్పుడే ' కేశవా నారాయణా ..... ' అన్నాడు. అంతే. ఆత్రం కొద్దీ కుర్రవాడి దగ్గరికి పరుగెత్తుకు వచ్చాడు. రావణుడు.

కానీ, ఏం లాభం ? —

ఆత్మలింగాన్ని అక్కడే పెట్టేసి, ఎప్పుడో మాయమయ్యాడు, కుర్రవాడు !

ఇంక చేసేదేముంది ?

అమాంతంగా రెండు చేతులతోనూ కదిపి చూశాడు, ఆ లింగాన్ని. ఉహూ. అది కదల్లేదు. సరిగదా రావణుడు చేతులు తగిలిన చోట లింగానికి రెండు చెవులు మొలిచాయి. అవి ఆవు చెవులు ! —

చూడగా, ఎంత లాగినా ఆ లింగం వూడి రావటం లేదు. రావణుడికి ఆవేశమూ అహంకారమూ ఎక్కువయ్యాయి. అక్కడ పాతుకు పోయిన ఆత్మ లింగానికి తల ఢీకించి బద్దలు కొట్టుకోవటానికి సిద్ధమయ్యాడు. లోకమంతా కంపించి, గజ గజ లాడింది.

బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు.

'' నాయనా, రావణా ! — ఎందుకు వచ్చిన తాపత్రయ మిదంతా ? స్థాపితమై పోయిన ఈ ఆత్మలింగాన్ని కదిలించటానికి ఎవడితరమవు

# కార్యసిద్ధి

ఇలాంటి ? కనుక, దీన్ని కలకాలమూ మనస్సులో పెట్టుకొని మసలుకో. నువు తలపెట్టిన పని ఇలా ఎందుకు తారుమారైందో కొంచెమైనా కనుక్కున్నావా ? — విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించకుండా ఈ పని ప్రారంభించావు. అందుకే ఇన్ని విఘ్నాలు కలిగాయి.''

' అయినా, ఇప్పుడు మించింది లేదు. నువు చేసిన ఈ పని చాలా గొప్ప పని. ఈ విధంగా, అమూల్యమైన ఆత్మలింగాన్ని భూలోకానికి తెచ్చి ప్రతిష్ఠించిన కీర్తి నీకే దక్కిందన్న మాట. ఈస్థలం దివ్యక్షేత్రమై, ' గోకర్ణ క్షేత్ర ' మనే పేరుతో శాశ్వతంగా వర్ధిల్లుతుందిగ' అని చెప్పి అంతర్ధానమయ్యాడు. బ్రహ్మ.

ఇలా చెప్పి శుక్రాచార్యుడు, ' నాయనా, సింధూ — ఈ కథ విన్నావు కదా ! బుద్ధిశాలివి. ఆ గోపబాలుడి రూపంలో వచ్చి, మన రావణాసురుణ్ణి మోసం చేసిన వాడెవడో చెప్పుకో, చూదాం ! — ' అని సమస్య ఇచ్చాడు.

ఇందుకు సింధురాజా జవాబు చెప్పలేదు, కాని ఒక్క నిట్టూర్పు విడిచాడు.

## 15

"రాజా !— ఇవాళ కైలాస పర్వతం మీద ఎటువంటి చిత్రం జరిగిందో తెలుసా ?—

విను, చెబుతా :

ఐరావతాన్ని మించిన గొప్ప ఏనుగొకటి అవతరించింది. ఇటు తొండమూ, అటు తోకా వూస్తూ కొంటూ, అది చేసే హడావిడికీ, అట్టహాసానికీ కైలాసమే గడగడలాడి పోయింది !

ఉరకలతో పరుగులతో అది తిన్నగా పిల్లల ఆట స్థలానికి వచ్చింది. అక్కడ వినాయకుడూ, ముని కుమారులూ కలసి ఆడుకుంటున్నారు. దాన్ని చూడగానే హడలి పోయి, ఎక్కడి వాళ్లక్కడే చెల్లా చెదరై పోయారు. ఒక్క వినాయకుడు మాత్రం అక్కడ దిగడి పోయాడు !—

గణేశుడు ఒక్కడూ నిలబడి ఉండటం చూసి, ఆ యేనుగు విసురుగా మీది మీదికి వచ్చేసింది. అయితే బాల గణపతి కొంచెమైనా భయపడలేదు. దానికి దొరికి పోయినట్టే నటించే వాడు. తీరా అది అందుకుందామని తొండం చాచేసరికి వెనక కాళ్ల దగ్గర ఉండేవాడు. దాని కాళ్ల మధ్యని దూరి, నాలుగు స్తంభాలాట ఆడి, దాన్ని కవ్వించసాగాడు. ఏనుగుకు గణేశుణ్ణి పట్టతరం కాలేదు.

చివరకు వినాయకుడు తనంతట తనే కావాలని ఆ యేనుగు తొండంలో ఇరుక్కున్నాడు.

అది అమాంతంగా తొండం పైకెత్తింది. అదే సమయమని వినాయకుడు దాని దంతాలు రెండూ గట్టిగా పట్టి, పళక్కున విరిచేశాడు ! అంకుశాల వంటి ఆ దంతాలతోనే యేనుగును నానా విధాల పొడిచి పొడిచి బాధించాడు.

దాని ఒళ్లంతా రక్త మండల మయింది. నేలంతా నెత్తురు మడుగయింది. ఏనుగు భయంకరంగా ఘీంకరిస్తూ, ఆ నెత్తురు మడుగులోనే పడి, గిల గిల కొట్టుకుంది. మరికొంచెం సేపటికి అది రాక్షసరూపంతో కనబడి, 'గణా ! గణా !—!' అంటూ, మహా వృక్షంలా నేలకూలి, ప్రాణాలు వదిలింది !—

అలా నేలకూలిన ఆ యేనుగు ఎవరనుకున్నావు? చెబుతా, విను : మన ఆస్థాన మంత్రులు సమావేశమై, 'గణేశుణ్ణి చంపగల శూరుడు కావాలి' అని తీర్మానించి, దేశమంతటా దండోరా వేయించారు కదా.

ఆ దండోరా విని, హేమాహేమీలు ఎంతో మంది వచ్చారు. ఆ వచ్చిన వాళ్లలో— అవిశుడు, అజగాశురుడు అనే ఇద్దరు కవల లున్నారు. ఇప్పుడు ఏనుగు రూపంతో వెళ్లి, ప్రాణాలు వదిలిన వాడు పెద్దవాడైన అవిశుడు. ఇక— వాడి తమ్ముడు అజగాసురుడు ఎటువంటి జిత్తులు పన్నుతాడో వాడి పన్నుగడలు ఎంతవరకూ ఫలిస్తాయో, దేవు చూద్దాం !'

—అని చెప్పి, శుక్రాచార్యులు ఆ నాటికి సెలవు తీసుకున్నాడు. సింధురాజా దీర్ఘంగా ఒక్కనిట్టూర్పు విడిచాడు.

## 16

రాక్షసరాజా వింటున్నాడు,

అసుర గురువు చెబుతున్నాడు—

'రాజా !—నిన్నటి రోజున అవిశుడు వినాయకుడి చేతిలో మరణించిన సంగతి చెప్పుకున్నాం. అవిశుడి మరణవార్త అతని సోదరుడైన అజగాసురుడికి చెప్పలేని ఆహ్లాదాన్ని కలిగించింది. ఆ ఉత్సాహంతో అతను అమాంతం ఆకాశంలోకి ఎగిరాడు!—

ఈ సమయంలో గణేశుడు మునికుమారులతో కూడా ఉద్యానంలో దాగుడుమూత లాడుకుంటున్నాడు. ఆటల్లో గణేశుడు 'దొంగ' అయ్యాడు. మునికుమారులంతా దొంగకు దొరక్కుండా దాక్కోవాలి.

కళ్లకు గంతలు కట్టుకుని ఉన్న గణపతి, "ఏం? —రానా ? పట్టుకునేదా ?" అని అడిగితే ముని కుమారు లెవరూ బదులు చెప్పలేదు. • ఎన్నిసార్లు అడిగినా, వాళ్లు మాటాడలేదు. ఇదేమిటా విడ్డూరం ? అని గణేశుడు, కళ్లు తెరిచి చూశాడు.

చూస్తే ఎదురుగ్గా !—బ్రహ్మాండమైన కొండ చిలువ !!

బుసలుకొడుతూ మీది మీదికి రాబోతూంది.!! —మిలమిల మెరిసే దాని కళ్లు చూడగానే ముని కుమారులు పక్కకి తప్పుకుని దాక్కున్నారు. వాళ్లు పలక్కపోవటానికి గల కారణం ఇప్పుడు తెలిసింది, గణపతికి. అయితే ఏమీ తొందరపడ లేదు.

కదలక మెదలక ఆ కొండచిలువ కేసి అలాగే చూస్తూ నించున్నాడు. చిలువ కూడా అతనివేపు చూస్తూనే ఉంది. ఒడుపు చూసి అది మెల్లిగా వినాయకుడి దగ్గరకు వచ్చింది. అతనికి చాలి

58 వ పేజీ చూడండి



## భారీయెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

# రామం నడుమునొప్పితో బాధపడెను










నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సారిడన్ నొప్పికి త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా ఉపశమనము కలిగించును. నడుమునొప్పి, తలనొప్పి, పంటినొప్పి, జ్వర చిహ్నములు మరియు జలుబులకు సారిడన్ వేసుకొండి. పెద్దవారికి ఒక బిళ్ల పూర్తియైన మోతాదు. పిల్లలకు $\frac{1}{4}$ నుండి $\frac{1}{2}$ బిళ్ల వరకు చాలును.




ఒకే సారిడన్ బిళ్ల చాలును

ఒక బిళ్ల ఖరీదు 13 పైసలు

ఒకే ఒక **సారిడన్** 'రోష్'

నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

JWT-VT-1048 (a)

# నరకానికి ప్రయాణం!

## కథనం డెరెక్ ఈవ్

**2**

శ్రీమతి ఆలం మళ్లా తన తల్లిని కలుసుకుంది — ఎన్నో ఏళ్ల తర్వాత, ఒక పాకిస్తానీ పల్లెటూరులో నరకయాతన అనుభవించిన తర్వాత.

బ్రిస్టల్‌లో శ్రీమతి ఇవిలిన్ జార్జి తన కూతురు కష్టాలు ఎటువంటివో చదివి తెలుసుకుంది. ఎంతో బాధపడింది. పోలీసు స్టేషనుకి టెలిఫోను చేసింది. వాళ్ళు విచారణ జరిపారు. శ్రీమతి ఆలం బ్రిటన్‌లోనే, సెంగాం అనేచోట, ఉందని తెలుసుకున్నారు!

ఈ సమాధానం తెలిసిన రోజునే తల్లీ కూతుళ్లు దీర్ఘ వియోగం తర్వాత కలుసుకున్నారు. ఇద్దరి కళ్ళా కన్నీరు వర్షించాయి. ఇలా తిరిగి ఏకమవుతామని ఇద్దరూ ఊహించలేదు.

శ్రీమతి ఆలం మళ్ళీ తన దేశం, తన వారిని చూడగలనా అనుకునేది.

తన ఇద్దరు పిల్లలు కలరా వాతబడటం కళ్లారా చూసింది. సరయిన ఆహారారోగ్యాలు లేక ఆత్మ హత్యకికూడా సిద్ధపడింది.

తను బ్రతికి ఉండగనే తన భర్త రెండో పెళ్లి చేసుకొనటం చూసింది.

ఇదంతా, ఆమె ఆవేదనంతా, తన సోదరుడికి రాసిన ఉత్తరంలో కనిపించేది.

అతను తన నియోజకవర్గంలో శాసనసభ్యుని ఎలా కలుసుకున్నాడో, చివరికి మా పత్రిక ఈ 'ఉద్యమం' లోకి ఎలా దిగిందో, పోయిన వారం సంచికలో వివరించాను. శ్రీమతి ఆలంని, ఆమె ముగ్గురు పిల్లలనీ ఎలా రక్షించానో కూడా వివరించాను.

ఆమె 16 ఏళ్ల పెద్ద కొడుకు హమీద్‌ని నా వెంట తీసుకు రాలేకపోయాను.

ఆలం దానికి ఒప్పుకోలేదు.

మేమంతా ఇంగ్లండ్‌కి తిరిగివస్తూ ఉంటే 37 సంవత్సరాల వయస్సుకల శ్రీమతి ఆలం తన కష్టాలని, నరకయాతనని, వివరంగా వర్ణించి చెప్పింది.

ఆమెదొక విచిత్ర గాథ. దైవభక్తి, పాపభీతి చిన్నప్పుడే అలవడ్డ ఈమె ఆలంని కలుసుకున్న నాలుగు రోజులకే వివాహం చేసుకుంది.

''ఎలా జరిగిందా? ఏమో నేనే చెప్పలేను!

''అసలు నా గృహ వాతావరణం దానికి కారణమేమో........

''మా వాళ్లందరూ నియమంగల మెథడిస్టులు. ప్రతి ఆదివారం చర్చికి వెళ్లేవాళ్లం. ఎప్పుడూ మొగ పిల్లలతో తిరగనిచ్చేవారుకారు. స్కూలునుంచి వస్తూ ఉంటేకూడా వాళ్లతో కలిసి నడిచిరానిచ్చేవాళ్ళుకాదు. అదొక పెద్ద పాపం!

''నాకు 16 సంవత్సరాలు వచ్చేటప్పటికి ఒక డాక్టరు ఇంట్లో పనికిచేరాను.

''కాని అక్కడ పని విసుగు పుట్టింది. నా స్నేహితురాలొకామె చెప్పగా ఇద్దరం బర్మింగ్‌హాంకి వెళ్లిపోయాము.

''స్టేషన్‌లో దిగినప్పుడు నా సంబరానికి అంతులేదు. చూసుకోకుండా నడిచివెళ్లి ఒక అబ్బాయికి ఢీ కొట్టుకున్నాను. కిందపడిపోయాను.

''అతని సహాయంతో లేచి నుంచున్నాను. అతని చర్మం ఎర్రగా ఉండకపోవటం గమనించాను. అతను, పాపం చాలా నొచ్చుకున్నట్టున్నాడు. క్షమించమని వేడుకున్నాడు.

''అంతటితో ఈ సంఘటన ముగిసింది. అక్కడ నుంచి బ్రాంప్‌టన్ వీధిలో మా స్నేహితురాలి ఇంటికి వెళ్లాను.

''ఆమె భర్త భారతీయుడని తెలుసుకున్నాను.

''వాళ్ల ఇంట్లో పలుగురు భారతీయులు అద్దెకు ఉన్నారు—అని విన్నాను. (అప్పటికి పాకిస్తాన్ ఏర్పడలేదు.)

''నా స్నేహితురాలు 'మే'కి రాత్రి డ్యూటీ ఉండేది. తెల్లవారుతుండగా ఇంటికి వచ్చేది.

''పొద్దునే లేచి కిందకి వెళ్లాను. వంటగదిలో ఎవరో ఒకతను వంట చేస్తున్నాడు.

''నేను రాగానే ఇటు తిరిగాడు. అతనెవరో కాదు! నిన్న స్టేషన్‌లో నాకు తగిలిన అబ్బాయే!

''చిరునవ్వుతో తన పేరుచెప్పి పరిచయం చేసుకున్నాడు. కరచాలనంచేశాడు. ఎందుకోగాని నా గుండె వేగంగా కొట్టుకొనటం మొదలుపెట్టింది...

''మనిషి అందగాడే. ఐనీ అని నూట్లాడు



అంతటి నరకయాతనను అనుభవించిన శ్రీమతి ఆలం సంతోషంతో తన తల్లిని కలిసి, మంచి—చెడ్డలను చెప్పుకొంటున్న దృశ్యం. పిల్లలు ఫరూక్, హలీఫా, హలీమాలను చిత్రంలో చూడవచ్చును.

*అతను అధికారి; తాను భార్య అంటే అతని పనిమనిషి — అతనికున్న ఆస్తులలో ఆమె కూడా ఒకతె! — రానురాను ఆమె గ్రహించిన సత్యాలివి! — అంతేనా? పిడకలు పెట్టడం నేర్చుకుందామె, తిరిగి పోడానికి వీలులేని బందిఖానాలో ఇరుక్కుంది!*

కున్నాను. అతను తనదేశం గురించీ, తన భూములని గురించీ చెప్పాడు........

ఇలా రెండు గంటలసేపు మాట్లాడాము. అతనంటే చాలా ఇష్టం కలిగింది.

"అయినా అతను హఠాత్తుగా, 'నన్ను పెళ్ళి చేసుకుంటావా?' అని అడిగేసరికి కంగారుపడి పోయాను.

"తమాషాకి అడిగాడనుకున్నాను. జవాబు చెప్పలేదు. అతను అదే ప్రశ్న తిరిగి అడిగాడు.

"ఇంతకన్నా వివరించి చెప్పలేను. నా కెందుకో చాలా సంతోషం వేసింది— పొడుగాటి అందమైన యువకుడు నన్ను తన భార్య కమ్మంటున్నాడు!

"యస్! అన్నాను. అతను తన చెయ్యి జాపితే ఆనందంతో నా చేతుల్లోకి తీసుకున్నాను. అదొక ఆనందమయమయిన సమయం; ఉన్మాదం ఆవరించిన క్షణం!

"అదే మధ్యాహ్నం ఇంటికి రైలు ఎక్కి వెళ్ళిపోయాను. నా వయస్సు 18. తలితండ్రుల అనుమతి లేనిదే వివాహం జరగటానికి వీల్లేదు."

ఇవలిన్ (అప్పటికి ఆమెపేరు డేవిస్) తలిదండ్రులు విడిపోయారు. అందుకని తల్లి ఇంటికి వెళ్ళింది.

బర్మింగ్‌హాంలో ఒకరోజు ఉండి తిరిగివచ్చి పెళ్ళాడుతున్నానన్న కూతురి నిర్ణయం విని ఆశ్చర్యపోయింది శ్రీమతి డేవిస్.

కాబోయే అల్లుడి వివరాలన్నీ అడిగింది కాని కూతురు అతనొక ముస్లిం అనీ, అతనిపేరు లాల్ అనీమాత్రం చెప్పింది.

అతను తెల్లజాతివాడు కాదని తెలిస్తే తల్లి అనుమతి ఇవ్వదేమోనని భయపడింది.

రెండు రోజుల వాదన తర్వాత ఇవలిన్ తల్లి సమ్మతం పొందింది. వివాహం ముస్లిం ఆచారం ప్రకారం జరగటానికి శ్రీమతి డేవిస్ ఒప్పుకుంది.

ఇవలిన్ బర్మింగ్‌హాంకి తిరిగి వచ్చింది. శనివారం (అంటే ఆలంని కలుసుకున్న నాలుగురోజులలో) పెళ్ళి అయిపోయింది. వివాహం మాదిరి తమకి తామే చేసుకున్నారు. 'మతాధికారి' ఎవరూ రాలేదు.

ఇద్దరూ మరొక లాడ్జిలోకి మారారు. ఇద్దరూ ఉద్యోగాలుచేసి వారానికి సుమారు 135—140 రూపాయలు సంపాదించేవారు.

వివాహం అయిన కొన్ని రోజులలోనే శ్రీమతి ఆలంని కొన్ని అనుమానాలు పీడించటం ప్రారంభించాయి.

భర్త ఆమెని తనకన్నా తక్కువ మనిషికింద చూడటం మొదలుపెట్టాడు.

"ముస్లిం సమాజాలలో భార్యాభర్తల మధ్య సంబంధాలు ఇక్కడికన్నా వేరుగా ఉంటాయన్న సంగతి నాకు పెళ్ళయేముందు తెలియలేదు." అంది శ్రీమతి ఆలం.

"అతను అధికారి; నేను భార్యనే కాని అతని పనిమనిషిని కూడా!

"నేను కూడా అతని ఆస్తులలో ఒక వస్తువుని అన్నట్లు చూసేవాడు. అతన్ని ఎదిరించటం అనేది లేనేలేదు.........

"ఉద్యోగం ఉన్నంతకాలం జీవితం సాఫీగానే గడిచిపోయేది. పనిలో మునిగిపోయేదాన్ని.

"కాని గర్భవతినయినప్పటినుంచీ ఈ కొద్ది స్వతంత్రం కూడా నశించింది. లాల్ నా మీద మరింత అధికారం చెలాయించడం మొదలు పెట్టాడు."

పెళ్ళి విషయమయి ఈ బాధ ఇలా ఉండగా శ్రీమతి ఆలంకి మరొక దిగులు పట్టుకుంది. తన భర్త శ్వేతజాతివాడు కాదన్న విషయం తల్లికి చెప్పనేలేదు ఇంతదాకా. 1949కి ఆమెకి ఇద్దరు పిల్లలు పుట్టినా వారిని ఇంటికి తీసుకుపోతే తన గుట్టు బయటపడుతుందన్న భయం వేరే.....

ఒకసారి తన సోదరుడు వచ్చినప్పుడు భర్త అక్కడలేకుండా చేసింది.

అయినా రహస్యం ఎక్కువకాలం దాగలేదు. ఆమె తలిదండ్రులు మాత్రం అంతగా బాధపడలేదు. క్రమంగా భర్త, పిల్లలతో తల్లినిచూసి రావడంకూడా జరిగింది.

కాని, ఆమె స్వతంత్రం పోను పోను తగ్గిపోయింది. చివరికి ఒకనాడు ఆమె తన మతం మార్చుకుంది. ఇస్లాం స్వీకరించింది.

పిల్లల సంఖ్య పెరిగింది. ఫరీదా, హలీమా, హలీఫా కూడా ఈ లోకంలోకి వచ్చారు.

డబ్బుకి ఇబ్బంది అధికం కాసాగింది. తను ఉద్యోగం మానేసింది. భర్త జీవితం బాగానే ఉన్నప్పటికీ ఇంటికి వారం వారం 3 పౌనులు పంపటంతో తమకి కష్టంగానే ఉండేది.

ఈ డబ్బంతా పాకిస్తాన్‌లో బాంకులో వేస్తున్నానని భార్యతో చెప్పేవాడు.

మొదటినుంచీ తనదేశంలో తనకున్న పెద్ద భూములను గురించి ఆమెతో చెబుతూనే ఉండేవాడు. 'అక్కడికి వెళ్ళి తను ఉండగలదా?' అనే సందేహం ప్రారంభంలో ఉన్నా క్రమంగా అదీ బాగానే ఉంటుందనిపించింది.

ఒకరోజు ఆలం ఆమెని పిల్లలతో ముందు వూరికి వెళ్ళి ఉండమన్నాడు. తర్వాత తను కూడా కొంచెం డబ్బుకూడబెట్టిన తర్వాత, వస్తానన్నాడు.

అప్పటికి శ్రీమతి ఆలం ఆరవ కాన్పు కానున్నది. లాల్ ఆమెతో తన వూరిలో అన్ని సౌకర్యాలూ ఉంటాయని చెప్పాడు........

నిజానికి ఆమె శిశువు వైద్య సహాయం లేకుండానే ఈ ప్రపంచంలోకి వచ్చాడు.

తను సదర్‌ఘాట్ చేరుకున్నప్పుడు ఎలా ఉన్నదీ తలుచుకుని శ్రీమతి ఆలం వణికిపోయింది. తను ఎంత మోసపోయిందీ తెలుసుకుంది.

"సదర్‌ఘాట్ అర్ధరాత్రికి చేరాను. చిట్టడవిలో వెదురు గుడిసెలు చూసేసరికి నా గుండె దడ ఎక్కువయింది.

"ఇదేనా లాల్ చెప్పిన గొప్ప వూరు? ఇవేనా పెద్ద పొలాలు?

"నిజం అనుమానంకన్నా భయంకరంగా తయారయి వూరుకుంది.

"ఎవరెవరో మనుష్యులు వచ్చి నన్నుతేరిపార చూశారు.

"ఆ వూరికి వచ్చిన మొదటి తెల్లజాతి మనిషిని నేనే!

"కాని చాలా అలిసిపోయి ఉన్నానేమో ఇదేమీ పట్టించుకోలేదు. వెళ్ళి నిద్రపోతే చాలుననుకున్నాను.

"పిల్లలతోబాటు గుడిసెలోకి వెళ్ళాను.

"గుడిసె నేలకూడా సరిగా లేదు. ఒక చిన్న ఇల్లు, కొన్ని కంబళీలు కనిపించాయి......... "

"ఫరూక్ అడిగాడు,' ఇది గొడ్ల సావిడా?" అని.

"అయిదేళ్ళ నా కష్టాలు ఆ రోజు ప్రారంభమయ్యాయి.

"నా భర్త చెప్పిన పొలాలు పట్టి నిస్సారమయిన నేల.

"అక్కడ అందరికీ ఒక శత్రువు— క్షామం

"నీటికి నదిదాకా వెళ్ళవలసి వచ్చేది.

"ఇంగ్లండ్‌కి తిరిగి పోదామనుకున్నాను. నా భర్త చేర్చానన్న డబ్బు ఉందికదా అనుకున్నాను.

"సరే, నా చుట్టాలని అడిగాను. 'ఏం డబ్బు?' అన్నారు. 'అంతా ఖర్చయిపోయింది. మేమూ బతకాలా?'

"పేదరికం, దూరం— ఈ రెండూ, ఇవికాక రాబోయే నా పాప, ఇవన్నీ నన్ను బంధించేశాయి.

"పిడకలు చెయ్యటం నేర్చుకున్నాను. శుభ్రమయిన నీరు కరువయిపోయింది. చేపలు తప్ప మాంసమే లేదు. ఎప్పుడూ అన్నం, అన్నం.....

"నా చుట్టూ మరణాలు, రోగాలు. పురుడు రాబోతుంది. ఇదంతాచూసి హడలిపోయాను. నా పనేమికావాలి? నేనుపోతే నా పిల్లల గతేమిటి?

"నేను వచ్చిన 30 రోజులకి పురుడు పోసుకున్నాను. ఎవరి సాయమూ దొరకలేదు. చచ్చి బ్రతికాను.

"నా ఆరవ బిడ్డ పుట్టాడు. ఆరోగ్యంగానే ఉన్నాడు.

"కాని 48 గంటలు గడిచేలోగా నాకు అయిదుగురు పిల్లలే మిగిలారు.

"చిన్నారి ఫరీదా, నా కుతూరు జబ్బు పడింది. నేనింకా కాన్పువల్ల బలహీనంగా ఉన్నా పక్క గుడిసెలో పడుకున్న ఆమెను చూడటానికి వెళ్ళాను.

"నా బిడ్డనిచూసి నీరయి పోయాను. ఆమె ముఖం శుష్కించిపోయి ఉంది. ఆమె మరణిస్తోంది. కలరా వ్యాధి మా గ్రామాన్ని ప్రవేశించింది. నా బిడ్డని బలిగొన్నది." (సశేషం)

# స్వేచ్ఛా భారత్‌లో
# స్త్రీ - సమాజంలో ఆమె ప్రతిపత్తి!

**శ్యామసుందరి**

"యత్రనార్యస్తు పూజ్యన్తే
రమన్తే తత్ర దేవతాః
యత్రైతాస్తు న పూజ్యన్తే
సర్వాస్తత్రా ఫలాః క్రియాః"

అని ఆర్యోక్తి స్త్రీ గృహిణిగానూ, మాతృమూర్తిగానూ కుటుంబంలో ఉన్నత స్థానాన్ని అలంకరిస్తుంది అనే సత్యాన్ని మన ధర్మశాస్త్ర వేత్తలు గుర్తించారు. కాబట్టే స్త్రీలకు మహోన్నత స్థానాన్ని వేదకాలంనించీ యిచ్చారు. కుటుంబ సంక్షేమం సామాజిక అభ్యున్నతి స్త్రీజాతిని గౌరవించిన నాడే అని చాటిచెప్పారు.

దేశాభ్యుదయానికి నాంది ప్రస్తావన జరగాలంటే అది ప్రతి కుటుంబంలోనుంచే జరగాలి. కుటుంబానికి జీవగర్ర స్త్రీ! కావున సమాజంలో సగ భాగమయిన స్త్రీ జాతిని ఉపేక్షించటం అనర్థదాయకం. అశాంతి హేతువు. త్యాగశీలానికీ, సహిష్ణుతకూ, మానవత్వానికీ, భూతదయకూ, విశ్వాసానికి ప్రత్యక్ష మూర్తి స్త్రీ అని మన జాతిపిత బాపూజీ ఎన్నోసార్లు వక్కాణించాడు. మన సంస్కృతికీ, ధర్మానికీ ప్రవక్త అనదగిన వివేకానందుడు పదేపదే స్త్రీ జాతిని గురించి అనేకసార్లు అనేక సందర్భాల్లో లోకానికి ఎలుగెత్తి చాటాడు. అంచేత నారీ లోకం విజ్ఞానవంతంగా విలసిల్లినప్పుడే జాతి సౌభాగ్యం అనేది నిర్వివాదాంశం.

ఒక్క దేశంలోనే కాదు. ఈ నాడు చూస్తే నాగరికమైన ప్రతి దేశమూ నారీలోకం విద్యావంతంగా ఉంటే జాతి అభ్యున్నతి కుంటుపడుతుంది అనే వాస్తవాన్ని గుర్తించినట్లు తోస్తుంది. ఇటీవలనే స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్న కీన్యా మొదలైన చిన్నచిన్న రాజ్యాలు కూడా ఎన్నో అభ్యుదయ కరమైన చట్టాలు చేసి జాతికి సమానావకాశాలు ఇచ్చారు. అమెరికా, రష్యా, ఇంగ్లండు, జపాన్ మొదలైన దేశాల్లో స్త్రీలు దాదాపు అన్ని రంగాల్లోనూ — రాజకీయంగా, ఆర్థికంగా సాంస్కృతికంగా, సాంఘికంగాకూడా గణనీయమైన అభివృద్ధి ఇప్పటికే సాధించారు. ఇంకా ఎన్నో విధాల కృషి చేస్తున్నారు.

## మనదేశం-ప్రస్తుత పరిస్థితి

విజ్ఞానం, వికాసం కలగాలంటే ముందు అక్షరాస్యత చాలా అవసరం. నిన్న, మొన్నటి వరకూ స్త్రీలలో అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులుగానే ఉన్నారు. చదువుకున్న ఏ కొద్ది మంది అయినా కలం, కాగితం చేతికి ఇస్తే, కలం విరగ కొట్టకుండానూ, కాగితం చింప కుండానూ సంతకం చేయగలిగిన వారు చాలా కొద్దిమంది. కాని ఈనాటి పరిస్థితి వేరు. ఏ వూళ్లో చూసినా బి. ఎ., యమ్. ఎ. చదువుకున్న వాళ్లు కన్పిస్తున్నారంటే అతిశయోక్తి కాదు. ఆడవాళ్లు చదువుకొని "వూళ్లేలాలా, ఉద్యోగాలు చేయాలా," అనే ప్రశ్న ఎవరికీ రావటం లేదు. ఒకానొకప్పుడు స్త్రీ చదువుకోవటమే అపచారం అనే భావం ఉండేది. కాని అది ఈ రోజుల్లో ఇంచుమించు అంతరించి పోయిందనే చెప్పాలి. పైపెచ్చు ప్రతి తల్లీ తన బిడ్డను చదివించాలనే ఆదుర్దా చూపుతున్నది. ప్రతివారూ చదువు విలువనూ, ఉపయోగాన్నీ గుర్తించారు. ఇది నిజంగా శుభ సూచకం! నవ్య కాలకం కూడా!

రాజ్యాంగ రీత్యా కూడా మనకు 1947వ సంవత్సరంలో స్వాతంత్ర్యం వచ్చి జాతీయ ప్రభుత్వం ఏర్పడిన తరువాత స్త్రీలకు సంఘంలో సమాన ప్రతిపత్తి కల్పించ బడింది. ఎన్నో చట్టాలు అమలు అయినవి. కట్నాలను నిషేధిస్తూ వరకట్న నిషేధ చట్టం వచ్చింది. అలాగే ఆస్తి హక్కుల చట్టం వచ్చింది. ప్రత్యేక వివాహాల చట్టం, దారపత్య చట్టం మొదలైన ఎన్నో చట్టాలు మన పార్లమెంటులో ప్యాసు చేయబడినవి.

ఇలా ఈ చట్టాలే కాక ఎన్నో బృహత్పథకాలు, ప్రణాళికలు మహిళాభ్యున్నతికై రూపొందించ బడినవి. సంక్షేమ కేంద్రాలు ఎన్నో కృషి



చిన్నపిల్లల ఆటలు వారి మేధస్సును పెంచుతాయి. అందులోనూ వ్యాయామం శరీర దారుఢ్యాన్ని పెంచి, దేహంలో అందమైన వంపు సొంపులు తెస్తుంది. అందుకే పశ్చిమ జర్మనీలో చిన్న వయస్సు నుండీ పిల్లలకు వ్యాయామములో ఆసక్తి, ఉత్సాహము కలిగిస్తారు. 5, 6 ఏండ్లలోపు వయస్సుగల పిల్లలకు, లయబద్ధమైన వాద్య సంగీతంతో వ్యాయామ శిక్షణనిచ్చే దృశ్యాన్ని, ఈ చిత్రంలో చూడవచ్చును. (యు. పి. ఎస్.)

చేస్తున్నారు. ఉద్యోగాలు చేస్తూ స్త్రీలు తమ జీవితాలను ఉజ్వలంగా తీర్చి దిద్దుకోడానికి కావలసిన వసతి, సదుపాయాలూ కల్పించ బడినవి.

మన ప్రభుత్వం కూడా సెకండరీ విద్య వరకూ ఉచిత సదుపాయాలూ ఏర్పాటు చేయటం ఎంతైనా ముదావహం. ఇప్పటికే మనదేశంలో స్త్రీలు ఎందరో డాక్టర్లుగానూ, లాయర్లుగానూ, టీచర్లు

# వనితాలోకం వ్యాసం

గానూ మంత్రులు గానూ సంక్షేమ కార్యకర్తలు గానూ ప్రశంసనీయమైన పాత్ర వహిస్తున్నారు. విశ్వ విఖ్యాత మయిన నానా జాతి సమితికి మన ప్రధాని శ్రీయుతుల సోదరి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ అధ్యక్షురాలై, ఆ స్థానాన్ని అలంకరించిన ప్రధమ మహిళయై గణుతికెక్కిన విషయం మనకందరకూ తెలిసినదే ! రాజకీయ రంగంలో ప్రముఖులై, ఈ నాడు రథ సారధ్యాన్ని వహిస్తూ ఒక రాష్ట్రానికి ముఖ్య మంత్రిణియై కార్య కలాపాలు నిర్వహించ గలుగుతున్నది మనసుచేతా కృపలానీ ! దుర్గాబాయి, ఇందిరాగాంధీ వంటి విదుషీ మణులు సంఘసేవకై తమ జీవితాలనే అంకితం చేసి అవిరళ కృషి సాగిస్తున్నారు. ఇంకెందరో లక్షల మంది కాలేజీల్లోనూ, వృత్తి కళాశాలల్లోనూ, పాలిటెక్నిక్‌లలోనూ చేరి విద్యనభ్యసిస్తున్నారు. ఇలా ఒక నవచైతన్యం, జాగృతి ఎల్లెడలా వెల్లి విరుస్తున్నది.





అయితే ఈ వెల్లువ సక్రమ మార్గంలో ప్రవహించాలి. భవిష్యత్తుకు బాటలు వేసేముందు ప్రతిబంధకాలను తొలగించుకోవాలి ! సమస్యలు లేవని కాదు. ఎన్నో ఉన్నవి. విద్యావంతురాలైన స్త్రీకి ఎన్నో సమస్యలు ! విద్యావంతురాలు కాని స్త్రీకి ఒక రకమైన సమస్యలైతే, విద్యావతికి మరొక రకమైన సమస్యలు ! విద్య, ఉద్యోగం, వైవాహిక జీవితం మూడూ స్త్రీ జీవితంలో ప్రధానమైనవే ! కాని ఈ మూడూ సాధ్యపడేటట్లు చూడాలన్నా ఎన్నో ఒడుదుడుకులు తప్పటం లేదు. మనధర్మం, కుటుంబసంప్రదాయాలు అంతరించి పోతున్నాయనే వదంతి తప్పటం లేదు. వాస్తవ దృష్టితో పరిశీలించితే, ఏది ఎంత వరకు నిజం అనేది తెలుసుకోవచ్చు ! ఏది ఏమైనప్పటికీ అనాదిగా వస్తున్న ఆచారాలలో విశ్వాసం సడలి పోతున్నది. దాదాపు వాటిని పాటించడం లేదన్నా పొరపాటు లేదేమో ! కాని వాటి స్థానే స్థిరమైన జీవితపు విలువలు ఏర్పడలేదు. అందుచేతనే ఈ సంధి యుగంలో ఇలాంటి అవ్యవస్థిత స్థితి ఏర్పడిందనవచ్చు ! మన సమాజంలో స్త్రీలను ఉద్యోగులుగా, సామాజిక వ్యక్తులుగా గౌరవించే "దృష్టి" ఇంకా ఏర్పడలేదు. నిజంగా స్త్రీల వల్ల సమాజంలో కొన్ని విలువలు అంతరించి పోతున్నాయా ? స్త్రీలకు నిజంగా విద్య అవసరమా ? అవసరమైతే ఎలాంటి విద్య అవసరం? ఆ విద్యను ఆమె ఎలా ఉపయోగిస్తే బాగుంటుంది? విద్యకు ధ్యేయం ఉద్యోగమేనా ? లేక మరేమైనానా ? విద్యావంతురాలైన స్త్రీ కుటుంబానికి సహాయ పడగలదా ? కుటుంబాన్ని సుఖవంతం చేయుగలదా ? నిజంగా స్త్రీలు విద్యావంతులు కావటంవల్ల మన 'సంస్కృతి' అభివృద్ధి చెందుతున్నదా ? స్త్రీలకు చదువు, సంస్కారం అబ్బినందువల్ల సమాజానికి అభ్యున్నతికి కలుగుతుంది అనే మాటలో ఎంత వరకు యదార్థం ఉన్నది ? నేటి విద్యావంతులు సామాజిక దృష్టితో ఆలోచించి, సమాజానికి ఉపయోగపడుతున్నారా ? అనే ప్రశ్నలకు ఆధునిక యువతి జవాబులు వెతకాల్సి ఉంటుంది. కాలూని నిలువబడి, ముందు వెనుకలు ఆలోచించి నిర్ణయించాలి. మన సంస్కృతి, సంప్రదాయం ఎలా అభివృద్ధి చెందుతాయి ? పాశ్చాత్య వ్యామోహంలో పడిపోయి "మనది" అనుకునే మన భారతీయ సంస్కృతిని మరచిపోతున్నామా ? 'లేదు' అని సగర్వంగా చెప్పుకునే విధంగా పాత

కొత్తలను మేళవింప జేయటం ఎలా సాధ్యం? అందుకు మార్గాలేమిటి? ఇవన్నీ సాలోచనగా ఆధునికులు, పూర్వీకులు, సంఘ సంస్కర్తలు పరిష్కరించాల్సి ఉంటుంది.

అన్నిటికీ మించిన మహత్తరమైన కార్య భారం స్త్రీలకు ఒకటున్నది. బిడ్డలను కని, పెంచి, పెద్దచేసి, వారి జీవితాలకు రూపురేఖలు ఇవ్వవలసిన బాధ్యత స్త్రీలదే !

"ఊయల ఊపే చెయ్యే రాజ్యాలను ఏలుతుంది." అనే మాట అక్షరాలా నిజం ! తల్లి ప్రభావం బిడ్డ మీద ఎంతగా ఉంటుందో అందరూ ఎరిగినదే ? తల్లి ఏం మాట్లాడితే, అది మాట్లాడటం తల్లి ఏ పని చేస్తే ఆ పని చేయుటం బిడ్డ పుట్టుక నుంచే అనుకరించి నేర్చుకుంటుంది. ఈ విశేషమైన బాధ్యత ఉన్నది కాబట్టే, దీనిని అనుసరించి స్త్రీ యొక్క మిగతా కార్యకలాపాలు ఉండాలి. మన ప్రాచీనులే కాదు— మనస్తత్వ శాస్త్రవేత్తలు కూడా సహేతుకంగా తల్లి బిడ్డకు ఎలా ఆదర్శమో నిరూపించ గలిగారు ! పసితనంలో బిడ్డల మస్తిష్కంలో పడిన భావాలు, బిడ్డ భావి జీవితంలో మొగ్గ తొడిగి, పుష్పించి, ఫలిస్తాయి. "హోం యూనివర్సిటీలో" నేర్చుకున్న విద్య బిడ్డకు ఇక ఏ యూనివర్సిటీ నేర్పలేదు అనేది శాస్త్రజ్ఞులు గుర్తించారు. కాబట్టే తల్లి విజ్ఞాన ఖని అయిన నాడు బిడ్డకు లోపం ఏముంటుంది ?

## విదేశాలలో

అయితే వివిధ దేశాలలో స్త్రీల పరిస్థితులెలా ఉన్నాయి ? ఆచారవ్యవహారాలు మనవాటికంటే భిన్నంగా ఉన్నవా? మనం ఆలోచించే విధంగా వాళ్లూ ఆలోచిస్తున్నారా? అనేవిషయాలు తెలుసుకోవాలి. అమెరికా, ఇంగ్లాండు, ఇటలీ మొదలైన దేశాలలో స్త్రీలు ఎలాంటి అభ్యున్నతి సాధించ గలిగారు ? వారికున్న అవరోధాలేమిటి ? సమస్యలు ఏరకమైనవి ? వాటిని అధిగ మించడానికి వాళ్లెలా కృషి చేస్తున్నారు అనే విషయాలు సాకల్యంగా పరిశీలించి మన దేశానికి అవి ఎంతవరకు మార్గదర్శక మవుతవి అనేది కూడా అంచనా వేసుకోవాలి. భౌగోళికంగా, రాజకీయంగా ఒక దేశానికీ, మరొక దేశానికీ ఎన్నో తేడాలు ఉండవచ్చు ! కాని 'సభ్యత'గల దేశాలన్నీ కొన్ని ఆదర్శాలకు అంటి పెట్టుకొని కృషి చేస్తున్నాయి. కావున మూల సూత్రాలలో పెద్దగా తేడా ఉండబోదు. ఏక కుటుంబ వ్యవస్థ వైపు, వసుధైక కుటుంబ నిర్మాణానికి అన్ని వైపుల నించీ ఆలోచనలు జరుగుతున్న ఈ రోజుల్లో తేడా లేమిటో కూడా తెలుసుకోవటం మంచిది. వారం వారం వచ్చే ఈ వ్యాస పరంపరలో వివిధ దేశాలలో స్త్రీల అభ్యున్నతి ఎలా సాధ్యమయింది. అనే విషయం వివరించ బడుతుంది. స్త్రీ జాతికై జరుగుతున్న సర్వతోముఖ కృషి విశదీకరించ బడుతుంది.

—

నాజీ నియంత హిట్లర్ ఒక సందర్భంలో 'నా జాతికి చెందిన స్త్రీలంతా మేల్కొంటే చాలు, విజయం దానంతటదే లభిస్తుంది' అన్నాడట. స్త్రీ జాతి నిజంగా నిద్రనుంచి మేల్కొన్నప్పుడే ఒక శకోదయం, ఒక నవోదయం, ఒక శుభోదయం వస్తుంది.

★

## పూలలో దాగిన పురుగులు: జాగ్రత్త!

రకరకాల మొక్కలు, రంగురంగుల పుష్పాలు! మందార చెట్టుకి అయిదారు పూవులుంటాయి. అవి శివునికి అత్యంత ప్రీతికరమయినవని ప్రతీతి. పూజానంతరం పుష్పాలను జాగ్రత్తగా ఉంచుతాము. వారానికో, పది రోజులకో ఒకసారి మందార పువ్వులతో తలనూనె తయారు చేసుకుంటాము.

ఎరువు, పసుపు కనకాంబరాలు విరగబూసాయి. సన్నజాజి పందిర మీద నుంచి రెండుమూడు పూలు తొంగిచూస్తున్నాయి. గోడకి కలసి మెలసి ప్రాకిన శంఖం పాదు నుంచి ఎరుపు తెలుపు పూలు గాలికి కదలాడుతున్నాయి. ఇంకా ఎరుపు, తెలుపు నిత్యమల్లి, గరుడ వర్ధనం, సెంటు మల్లి, నక్షత్ర చామంతి, కాశీ వర్ధనం, రెండు రంగుల చంద్రకాంతలు ముళ్లగోరింట...ఎన్నెన్నో...!అవన్నీచూస్తుంటే సర్వత్రా వినూత్నత విలసిల్లే 'సృష్టి'పై ఆశ్చర్యమూ ఆనందమూ కలుగుతూ ఉంటాయి. ఆ విశ్వ శిల్పి ఎంతటి మేధావియో...? పుష్పాలకి రంగులు ఎన్నుకోవటంలో, అమర్చటంలో. . . ఎందులోనూ పొరబడలేదు— ఇంకా ఏవేమిటో ఆలోచించుకొంటూ పెరట్లోకి నడిచాను. ఒక గులాబి మొక్కకు మూడు పువ్వులు పూసాయి. ప్రక్క నున్న మరో మొక్కని ఒకటే పువ్వు ఉంది. రెండు మొక్కల పూల రంగులకీ ఎంతో వైరుధ్యం ఉంది. మొదటి మొక్క నున్న పువ్వులు మూడూ చక్కగా వికసించి, కమనీయంగా కనిపిస్తున్నాయి. ఆ గులాబి పువ్వులను చూడగానే నాన్నగారు జ్ఞాపకం వచ్చారు. ఆరోజుల్లో మా వూళ్లో, మా పెరట్లో రోజుకొక గులాబి పువ్వు పూసేది. ఆ గులాబి పువ్వు మీద రోజుకొక చిన్న యుద్ధం జరిగేది మా ఇంటిలో. అది తలలో పెట్టుకోవాలంటుంది అమ్మ. గులాబిపువ్వు తలలో పెట్టుకోవటానికి కాదంటారు నాన్నగారు. మరెందుకంటారేమో— అది మేహశాంతికి చాలా మంచిదిట. ఆయన ప్రాతఃకాలాన అయితే గులాబి రేకులను తేనెలో యుంచుకొని, మధ్యాహ్నం వేళలో పంచదారతో అద్దుకొని తినేవారు. అప్పుడప్పుడు గులాబి రేకుల కషాయం చేయించేవారు. నీళ్లు కాగుతుంటే రేకులు వేయాలి. కొంతసేపటి రేకుల రంగంతా నీళ్లకి దిగుతుంది. అప్పుడు రేకులు తెల్లగా అవుతాయి. గులాబి కషాయంలో ఒక చెంచాడు పంచదార కలుపుకొని త్రాగేవారు. అది గుండె జబ్బులకి, గుండె నీరసాలకి చాలా మంచిదట. స్వర్గీయ నెహ్రూ గారికి గులాబి పూవులంటే ఎంతో ప్రీతన్న సంగతి అందరికీ తెలిసినదే. సుప్రభాత సమయానే గులాబిపువ్వు కోటుకు అలంకరించుకోవటం ఆయన నిత్యకృత్యమట. దీనినిబట్టి గులాబిపువ్వు అందరి హృదయాలనీ ఆకర్షిస్తుందనటంలో సందేహం లేదు. కోసిన మూడు పువ్వులలో రెండు తలలో పెట్టుకోవాలని, ఒకటి తినాలని నిశ్చయించుకొని ముందుకు నడిచాను. ఏపుగా ఎదిగిన నంది వర్ధనం మొక్కనిండా వెన్నముద్దల్లా ఉన్నాయి పూచిన పూలు. ఆ పువ్వులు చూడగానే స్ఫురించింది ప్రొద్దుటి నుంచీ కళ్లు మండుతున్న సంగతి. నందివర్ధనం పువ్వులు కళ్లకి అద్దుకుంటే మసకలు, మంట, కళ్ల ఎరుపులు మొదలయిన కళ్లజబ్బులు తగ్గుతాయిట. నేను కూడా చాలాసార్లు అద్దుకొన్నాను. రెండు నందివర్ధనం పువ్వులు కోసి సజ్జలో వేశాను. మల్లె పువ్వులు ఎన్నో లేవు. విచ్చిన ఆ కొద్ది సుమాలు సౌరభాలని చుట్టూ విరజిమ్ముతున్నాయి. ఇంకా చాలా పువ్వులున్నాయి. అందమయినవి. . . అందహీనమయినవి. . .! పరిమళ భరితాలు. . . పరిమళాలకి నోచుకోనివి. పూజా పుష్పాలు కొన్ని. ఆ పూజకే నోచుకోనివి. . . ఎన్నో. అత్తయ్యగారు అవిసి చెట్టు క్రింద రాలిన పూలన్నీ పోగుజేశారు. అవిసిపూల పచ్చడి వంటికి చాలా మంచిదని చెప్పారు. పూలసజ్జ తీసుకొని లోనికి నడిచాను. నందివర్ధనం పువ్వు కళ్లకి అదుము కొందామని తీశాను. ఆ పుష్పాన్ని అలాగే చూస్తూ నిలబడి పోయాను. సన్నటి పురుగు. నల్లగా నువ్వు గింజలో పదవ వంతు ఉంటుంది. చత్వారం గలవారి దృష్టిని చిటికలో తప్పించుకొంటుంది. జాగ్రత్తగా పరిశీలించాను పుష్పాన్ని. అలాంటి పురుగులు చాలా ఉన్నా యందులో. అవే కాదు. . . . ఆ నూదిరి పురుగులే గచ్చకాయ రంగులో చాలా ఉన్నాయి. చాలాసేపు ప్రయత్నించిన మీదట వాటిని తొలగించగలిగేను. తరువాత గులాబిపువ్వు తీశాను. ఆశ్చర్యం. . .! అందులోనూ పురుగులున్నాయి. అంతకంటే చిన్నవి. అసంఖ్యాకంగా ఉన్నాయి. ఇంత చిన్న పురుగులుంటాయని, అవి పుష్పాలలో దాగి ఉంటాయని ఈ నాటి వరకూ నాకు తెలియదు. నాలాగే ఇంతవరకూ తెలియనివాళ్లు కొందరుంటారనుకుంటాను. ఎందుకంటే— స్త్రీలకి పుష్పాలంటే విపరీతమయిన మోజు. వాటిని త్రుంచి, క్షణాలలో తలలో ఉంచుకొనే వరకూ తీరదా మోజు. తలలో ఉంచుకోవలసిన పుష్పాలలో తగు జాగ్రత్త తీసుకోకపోయినా, ఆరగింవాలనుకొనే గులాబి పువ్వుని, కళ్లకి అదుముకోవాలనుకొనే నందివర్ధనాలని జాగ్రత్తగా పరిశీలించటం ఎంతయినా అవసరం. ఇంకా పువ్వుల వలన రకరకాల ఉపయోగాలుంటాయి. వాటిలోని పురుగుల వలన రకరకాల అపాయాలూ ఉంటాయి. ఏ పుష్పానికయినా, ఏ ప్రయోజనానికయినా పరిశీలన అవసరమని నా అభిప్రాయం. మొగలి డొంకలని మిన్నాగులు, సంపెంగ పొదల ఛాయలని త్రాచుపాములు ఆశ్రయించుకొంటాయని చాల మందికి తెలుసు.

శ్రీమతి కె. వరలక్ష్మి

**అర్ధరాత్రి దాటాక తెలివి వచ్చినా ఆలోచనలనుంచి బయటపడి ప్రయాణం అయ్యేసరికి మూడు గంట లయ్యింది. వెన్నెలరాత్రి!**

నూరు మైళ్ల దూరంలో నున్న పట్టణానికి ఉదయం యెనిమిది కల్లా చేరాలి. ఏకాంతంగా స్వంత కారు మీద ప్రయాణం. రావు ఆ పట్టణంలో కాలేజీ ఆవరణలో పెద్దల, పిన్నల సమక్షంలో గంభీరమైన ఉపన్యాసం ఇవ్వాలి.

రావుకు ఒంటిగా ప్రయాణం చెయ్యటమంటే సరదా! అందులో నోట సిగరెట్ కాల్తుండగా తన కొత్త ఫియట్‌కారు తనే నడుపుకుంటూ పోతుంటే వచ్చే ఆలోచనలకూ ఆనందానికీ కొదవ లేదు. తనకు జీవితం మీద గానీ, మనిషికి సంబంధించిన యే విషయంలో గానీ నిశ్చితాభిప్రాయాలు లేవు. అందుకే యే విషయం మాట్లాడుదామన్నా యేదో ఒక సందేహం కలుగుతోంది. వారం రోజులైనా ఈ నాటికీ మాటాడే విషయం ఏదో తెముల్చుకోలేక పోయాడు. కారులో పోతూ మాటాడేది నిశ్చయించుకుంటా ననుకున్నాడు. పెట్రోలు బంకు దగ్గర కారు టాంకులో పెట్రోలు పోస్తుంటే జీవితం అంటే పెట్రోలు పోసుకోవటం, ప్రయాణం చెయ్యటం, అది కాస్త లేకపోతే ఆగి పోవటమే అనిపించింది.

కారు ముందుకు పోతూనే ఒక రైల్వే లెవెల్ క్రాసింగు దగ్గర ఆగిపోయింది. బలం ఉన్నా రెక్కవాలక పోవటం చేత రైలెలా ఆగిపోయిందో జీవితంలో అన్ని హంగులున్నా అదృష్టం లేకపోతే మనిషి ఆగిపోవలసిందేమో నన్న ఆలోచన కలిగింది. పది మైళ్ల దూరంలో ఆకసంలోనికి చొచ్చుకున్న రేడియో ట్రాన్సిమిటింగ్ స్టేషను స్తంభంపై యెర్ర రంగు దీపాలు వెలుగుతున్నాయ్. ఆకసంలో వెలిగే మిలమిలలాడే చుక్కలను వెక్కిరిస్తున్నట్లున్నయ్. కోరికలు కొల్లలైతే ప్రమాదానికి దారి తీయవచ్చునని ఆ యెర్రదీపాలు యెత్తిపాడుస్తున్నట్లున్నయ్. తల్చుకుంటే తీసుకుంటే ఈ జగంలో గడ్డి పూచ మొదలు గజం వరకూ యేదో ఒక అర్ధాన్ని సందేశాన్ని ఇస్తుంది. యేదో ఒక ఉద్దేశంతోనూ, యేదో ఒకటి సాధించటం కోసం, ఒక ఉపయోగం కోసం ప్రతి ప్రాణీ యేదో పని చేస్తుంది. తన ప్రయాణం కూడా తన కుపయోగగిస్తే యెంత బాగున్ను!

రెక్కవాలింది. రైలుతో పాటు కారూ కదిలి పోయింది. కారు కదలించిన గాలి ప్రాణం పోసుకుని హాయిగా వీస్తోంది. వెన్నెల వర్షిస్తూ ఆ వెలుగుతో ప్రకృతిని తడుపుతోంది. ఆకలితో నీలమైన ఆకాశం కోటి కళ్లతో మబ్బులు దొరికితే మింగాలని కలయ జూస్తోంది. తన చుట్టూ కామదృష్టులతో కదిలే ఈ శక్తులను చూసి ముగ్ధయైన ప్రకృతి ముడుచుక పోయి మెల్లగా గీమంటూ రోదిస్తోంది. ఆ రోదనలోని సంగీతం అతని ఆత్మను మేల్కొలిపి ఆలోచించే మనసును దరిచేర్చింది.

ఇది వరకు ఆలోచనలకు ఇప్పటి ఆలోచనలకూ తేడా కనిపిస్తోంది. అతను రాసింది తక్కువే. చదివింది అంత కంటే తక్కువ. ఉద్యోగరీత్యా పెరిగిన బాధ్యతలు ఒక్క ఆదివారాలే అతని చేత సాహిత్య ప్రక్రియ చెయ్యిస్తాయి. ఆలోచించి వ్రాసింది తక్కువ. జీవితం మీద ఒక అభిప్రాయం ఈయటానికి ఇంకా అనుభవం లేదూ, వయసూ లేదు. ప్రజలకు నచ్చాలని ఒకో ఋతువులో ఒకోరకం కథలు రాసాడు. "ఫలానా కథ నాకు నచ్చింది. రచయితకు నా ధన్యవాదాలని, ఈ కథ అమోఘంగా ఉందని, ఈ కథ నాకు బ్రహ్మానంద పరచిందని" ఇలా సామాన్య పాఠకుని దగ్గరనించి అభినందనలు పుచ్చుకోడానికై రంగులు మార్చే వూసరవిల్లి రచయిత అయ్యాడు. తన ఉద్యోగం హోదా చూసే ఉపన్యాసానికి పిలిచి ఉంటారనే అనుమానం ఇప్పటి ఆలోచనలో కలిగింది. ఇప్పుడే తను రచయితనా కాదానన్న అనుమానం కలిగింది.

మనిషి జీవిత కాలం తపస్సు చేస్తేగానీ రచయితగా నిలువలేడు. తను, కన్నవీ విన్నవీ ఎముకల గూడులైతే అతను బ్రహ్మయై రక్తమాంసాలతో అందమైన విగ్రహాలను సృష్టించి ప్రాణం పోస్తాడు. ఆ కదిలే ప్రాణులు, బ్రతికే బ్రతుకుల సంఘటనల నుంచి విశ్వజననీన మైనదీ, సాంఘిక ప్రయోజనాన్ని సాధించినదీ, పూర్తి నిజంతో కూడుకున్న కళా ఖండాన్నే సృష్టిస్తాడు. ఇది చెయ్యాలంటే రచయితలో యేదో ఉండాలి. ఆ యేదో యెంత సేపు ఆలోచించినా అతనికి పట్టుబడలేదు.

గమ్యం చేరడానికి ఇంకా యెన్నో మైళ్ళ ప్రయాణం చెయ్యవలసి నట్లే ఆ యేదో తెలుసుకోడానికి తను రచయితగా ఇంకా జీవితంలో ప్రయాణం చెయ్యాలేమో?

ఒక బళ్ల వరస ఒక దాని వెంట ఒకటి కదలి పోతోంది. ఇంచుమించు అందరు బండీ వాళ్ళు పడుకున్నారు. ముందునున్న బండివాడు కూడా మత్తుగా నిద్దర పోతున్నాడు. గట్టిగా హారను వాయించినా యెడ్లు తొణకలేదు బెణకలేదు. బండివాడు లేవనూ లేదు. అతని కారుకు త్రోవనిస్తూ ప్రతి బండీ సారథి నిద్రపోతుండగానే కదలి పోతోంది.

కొంత దూరం వరకూ యెవ్వరూ యెదురు కాలేదు. చప్పున కారు ముందు మంచి నక్క పరుగెత్తింది. కాస్సేపయ్యాక కారు శబ్దం— యెగిరే ధూళి, పెట్రోలు వాసన. . . కొంత దూరం కదిలాక రోడ్డు మీద గేదెలు పడుకున్నాయ్. కారు హారను యెంత సేపో గట్టిగా నొక్కగా కదలని గేదెలు, ఒక మనిషి కర్ర దెబ్బతో కదిలాయ్. ఆ మనిషి వెనక ఒక ఆడమనిషి నెత్తిన పేడతట్ట పెట్టుకొని కదులుతోంది. రోడ్డుకు రెండు వేపులా నున్న పాకలపై పొగమంచు వ్రాలి వెన్నెలను మింగేస్తోంది. మంచులో తడిసిన గాలి ముక్కు నలుపుకుంటోంది. తూరుపు వేపు కామపు కళ్లతో కన్నెర్ర జేసుకొని వచ్చే మగ పురుగుని చూసి మగువ వెన్నెల పడమటి కొండ గుహలో దాగుండిపోయింది.

రావు తెల్లవారినా యేమిమాటాడాలో తేల్చుకోలేక పోయాడు. ఒక సారి తనెందుకు రాస్తున్నాడో మాటాడాలను కున్నాడు? ఎవడైనా యెందుకు రాస్తాడు? మనిషి యెందుకు పెళ్లి చేసుకున్నాడో రచయితా అందుకే రాస్తాడు. కొంత సేపయ్యాక రచయిత బాధ్యతలు గూర్చి మాట్లాడాలను కున్నాడు. సంసారికి ఉన్న బాధ్యతలే రచయితకూ ఉంటాయ్. రచయిత ఈ సాంఘిక నావకు చుక్కాని లాంటి వాడు. అతను గతం తాలూకు విత్తనం, యిప్పుడు పండించి ముందు తరాలకు విత్తనాలను వదలిపోవాలి.

ఉపన్యాసం ఈయవలసిన కాలం సమీపిస్తున్న కొద్దీ మాటాడ వలసిన విషయాలు చిందరవందరై పోతున్నాయ్. ఆ చెత్త కాగితాల కుప్పలాంటి ఆలోచనలలో యే కాగితం పదిమంది పెద్దల దగ్గర ప్రదర్శింప తగ్గదో తను నిర్ధారించుకోలేక పోయాడు.

వెళ్తూనే దూరం నించే ఒక కొండను చూసాడు. కొండ మీద ఆలయం అగుపిస్తోంది. ఇంకా దగ్గరగా చేరేసరికి ఒక పెద్ద చెరువు కన్పించింది. ఎందరో ఆ చెరువులో స్నానం చేస్తున్నారు. తడిచిన చీరలు పలచని తెరపై ఆడంగుల అపురూప సౌందర్యాలను బయట పెట్టుతున్నాయ్. దొంగచాటు నుంచి దివకరుడు తొంగిచూస్తున్నాడు. భక్తిలోనూ మోహం ఉంటే గానీ ముక్తి రాదని రావుకు తట్టింది. అందుకే దేవుడి ప్రక్కనే దేవిని సృష్టించారు. దేవుని మోహన రూపుని చేసారు. భక్తునికి ముగ్ధ మనసును ప్రసాదించారు. భక్తికి కళ్ళు లేవని, మనిషి గ్రుడ్డివాడు కాకపోతే భక్తుడు కాలేడని తన నమ్మకం. ఇక మోహం— అది మనిషికి ఉన్నవికారాల్లో ప్రప్రథమ మైనదని తన వూహ!

కోవెల మెట్లు మొదట్లో ఇంజను చల్లారుతుందని కారు నాపాడు. బయట కారునాపుకుని నిల్చొని సిగరెట్టు కాలుస్తూ కొండమీదకు పోయే ప్రజవేపు చూస్తున్నాడు. ఇంతవరకూ తెగని దారంలా ఉన్న వూహలు ఒక్కసారి తెగాయ్. అలా తెంపింది. ఆమెను చూడగానే అతని మనసులో రేగిన ఉద్రేకం! అతని ఉద్రేకం చల్లారనూ లేదు. తెగిన దారం అతకనూ లేదు.

ఇదివరకెప్పుడూ ఆడదానిని చూడగానే కథ వ్రాయాలనిపించలేదు. ఇప్పుడు అనిపించింది. కానీ ఆమె ఆకారాన్ని పాఠకుల యెదురుగా పెట్టలేనేమోనన్న అనుమానం, పిరికితనం ఆవరించినయ్. ఏ వంపు, ఏ సొంపు, ఏ పెంపు వదలినా ఆడదాని అందం, గుణం, అభిమానాలలో వెలితి కనిపిస్తుంది. అందుకే యే సాహిత్యంలోనూ ఆడదాన్ని యే రచయితా సంతుష్టిగా సృష్టించలేక పోయాడు. అంటే ఆడదాని వంపు, సొంపు, పెంపులను పూర్తిగా అవగాహన చేసుకోలేక పోయాడు.

ఒక్క చూపుతో మోహం రాజుతుంది గానీ ప్రేమ కలుగదు. ప్రేమ కలగటానికి ఒక్క మోహం, కామం సరిపోదు. ప్రేమ యెన్నో వస్తువులు కలిపి వండగా తయారైన పాయసంలాంటిది. అందుకే ఆమెను కనీసం తన కథలోని పాత్రగానైనా వెంటనే ప్రేమించలేక పోయాడు. రచయిత యేలాంటి పాత్రనైనా ప్రేమిస్తేగానీ పరిపూర్ణంగా పూర్తి నిజంతో సృష్టించలేడు. అలాంటి పాత్రలు లేని రచన యెంతకాలమో ఉండదు. అందుకే ఆమెతో కొంత సేపైనా ఉందామని రావుకు మనసు కలిగింది.

అతను వెంట బట్ట వేసివి ఉన్నాడు. ఈ మధ్యే జబ్బు పడి లేచినట్లుంది. తల ముప్పాతిక వంతు నెరసి పోయింది. కళ్ళు ఇంకా లోతుగా నీరసంగానే ఉన్నాయ్. కొద్దిగా కుంటుతున్నాడు. బహుశః పక్షవాతం నుంచి తేరుకొని ఉంటాడు. అతను ఆమె అన్నయ్యో లేక తండ్రైనా కావచ్చు. అన్ని మెట్లు యెక్కలేడన్న నిర్ధారణకు వచ్చాడు రావు. అరటి పళ్ళూ కొబ్బరి కాయలు తన కారు యెదురుగా ఉన్న దుకాణంలోనే కొంటున్నారు. అతను కొంటుండగా ఆమె ప్రక్కన నిల్చింది. లేతనీలి రంగు పట్టు చీర కట్టుకుంది. ముఖాన యెర్రటి బొట్టు. చేతుల నిండా గాజులు గలగలలాడుతున్నాయ్. తీవిగా నున్న ముక్కులో ఒక ప్రక్కఒంటి తెల్లరాడి పుడక వజ్రంలా మెరుస్తోంది. తలలోని పూల గుత్తులు నల్లని తుమ్మెదల కుప్పనుకుని జుత్తుని పట్టుకుని ఉన్నయ్. గాలికి తెనెటీగల్లా కదులుతున్న ముంగురులు గులాబి రెక్కలనుకొనిమూతి మీదకు వ్రాలుతున్నయ్. చీర ఒంటిని కప్పినా ఒంపులను కప్పలేక పోయింది. విచారం నయ్యూ రాన్ని మ్రింగలేక పోయిందీ, వయసునూ మార్చలేక పోయింది. ఆవేదన కన్నీరు కార్చించి కళ్లను శుభ్రం చేసి తేర్చింది. కారుమేఘాలు అల్లుకొన్నప్పుడు రేగిన రాపిడికి ఉద్భవించిన మెరుపులా ఆమె ముఖం ఉండీ ఉడిగి తళుక్కుమని మెరుస్తోంది.

అలా వెళ్ళిపోబోతున్న అతనితో ?

"కారులో కొండమీదకు దిగబెట్టేదా ?" అన్నాడు.

"వద్దండీ !"

"ఎక్కగలరా ?"

"ఆరోగ్యం కుదుట బడితే – మెట్లెక్కి దర్శనం చేసుకుంటానని మొక్కుకున్నాను."

"సరే. . . మీ ఇష్టం."

ఆమె అతనిని పట్టుకొని మెట్లెక్కించటం కనపడేవరకూ చూసాడు. ఇంకా తను ఆ స్థానం చేరడానికి ముప్పయిమైళ్ళుంది. తనూ కొండ

# ప్రయాణం

మీదకు వెళ్లిపై నుంచి వాళ్ల రాకను చూస్తే ? తను ఆమె పాత్రను సృష్టించాలంటే ఆమెతో ఒక సారైనా మాటాడవద్దా ? వాళ్ల మంచి చెడ్డలూ తెలుసుకోవద్దా ? ఎలాగూ తను మాటలు అప్పుడే కలిపాడు. ఇంతసేపు తను మ్రింగివేసినట్లు చూసినా ఆమె తనవేపే చూడలేదు. కొందరు ఆడవాళ్లు కోరికలను రెప్పలు వాల్చే అణచుకుంటారు. బాహాటంగా చూసినా, మాటాడినా ఆడవాళ్లకు మగవాని యందు ఒక విధమైన జాలి కలిగి, దారి తప్పడానికి ప్రయత్నించే మగవాళ్లను సరిచేస్తారు. అలా సరిచేయులేని ఆడది జీవిత కాలం సుఖపడక బాధ పడుతుంది. ఆ బాధ తన శీలం విషయంలో కాదు తన చాతకాని తనం గురించే !

రూపాయి గేటు దగ్గర చెల్లించి యేడు మలుపులున్న కొండ రోడ్డుపై కారును ప్రాకించాడు. అక్కడక్కడా కొండపై జనం ఉన్నారు గాని యెవరూ ఇంకా దేవదర్శనం కోసం సంసిద్ధులుగా లేరు. రావు సరాసరి మండపాలు దాటి స్వామి ఆలయం వెండి తలుపులు వద్ద నిల్చున్నాడు. ఇంకెవ్వరూ రాలేదు. 'క్యూ' కోసం వేసిన ఇనప గొట్టాలకు ఆనుకొని యెదురుగా నగ్నంగా కనపడుతున్న ప్రకృతి వేపు చూసాడు.

మనోహరమైన దృశ్యాలు మనసులో ముద్ర వేసుకున్నాయ్. తను వచ్చేటప్పుడు బుగ్గితో నిండిన రోడ్డు, రోడ్డుకు ఇరువేపుల నున్న చిందర వందర తుప్పలు, చెట్లు, గుట్టలు, బీటలు నేరిన పొలాలు, బురదను బుక్కుతున్న కాలవలు, కంపుతో కుళ్ళిపోతున్న మురికి గుంటలు— ఇవన్నీ ఇంత దూరం నించి చూస్తుంటే యెంతో అందంగా ఉన్నాయ్. ఇంత వరకూ బహుశః అతను వాటియొక్క బాహ్యాందాన్ని చూసి అసహ్యించుకున్నాడు. ఇప్పుడు అతనికి కనిపించేది లోపలి అందమేమో ! ఈఎత్తు ప్రదేశం నించి చూస్తుంటే తను ప్రకృతిని స్వర్గ

భూమి నించి తిలకిస్తున్నట్లుంది. మనిషికళ్ళే అసలు అందాన్ని దూరం నించే గుర్తించ గలవేమో ?

దగ్గరగా పడమటి వేపు ఆలయం ప్రక్కనే ఆకులన్నీ రాల్చి తెల్లని పూల గుత్తులతో నిండిన నూరు వరహాల చెట్లవనం. ఎదరగా చేటంత గులాబులతో వంగి పోతున్న ముళ్ళ మొక్కలు. మూడు రంగుల పూలు ముద్దులొలికేట్లు విరబోసుకున్న బోగన్‌విల్లా తీవలు ! లిప్‌స్టిక్ రాసిన దొరసాని నోరు ఆవలించినట్లున్న మందారాలు. ఎగురుతున్న పెంచిన తెల్లపావురాల్లో ఒకటే నోటిలో ఆహారం పట్టుకొని గేటుపై నున్న గూడు చేరింది. ఆమె బాస విని గొంతుక మీద మచ్చ ఉన్న పావురం కుంటుకుంటూ ముందుకొచ్చి ఆమె నోటిలోనిది అందుకుంది. ఆ గేటు క్రిందకు చూస్తే— ఆమె అతనిని పట్టుకొని మెల్లగా యెగ బ్రాకుతోంది.

ఈ యెత్తు నుంచి చూస్తే ఆమె యెగిరే పావురంలా అగుపించింది. ఆ ముందుగా నున్న పూల గుత్తులన్నీ ఆమెకు దీటనిపించాయ్. ఆమె అతని దృష్టిలో రాలని పూవు. తెంపినా వాడని పుష్పం! అతను కోరినట్లు కావాలంటే ఆమెను ఆయౌవ్వనంతో సృష్టించాలి. తరతరాల పాఠకులకు ఆమె పూర్వశిలా యౌవ్వనంగానే కనిపిస్తుంది.

ఈలోగా పూజారి వచ్చాడు. తాళాలు తీసి లోపలికి వెళ్లి గడియ వేసుకున్నాడు. రావు మళ్ళీ చుట్టూ కలియ చూసాడు. దూరాన సముద్రం ఒక పెద్ద చెరువులా ఉంది. దగ్గరలో పొగలు గక్కుకుంటూ రైలు పోతోంది. అలసిపోతూ అతను తన దగ్గరకే చేరాడు. ఆమె నీలి చీరతో నిశ్చలంగా కనిపిస్తున్న సముద్రంలా ఉంది. దగ్గరగా నున్నా ఆమె లోని పాటు పోటులను తిలకించలేక పోయాడు. ఉత్సాహంతో ఉండీ ఉడిగి ఆమెను ఆకర్షించాలనీ కళ్ళలోనికి చూడ ప్రయత్నిస్తున్నాడు. ఆమె కళ్ళు దించినా బెదురుతున్నాయ్. అతని మనసు గాలికి కదలుతున్న ఆమె చీరలా అల్లలాడుతోంది. ఒక సారి యెత్తిన ముఖం మళ్ళీ దిగింది.

రావు యెంతో ఆలోచించాడు. ఈ జగమంతా ఆకర్షణలతో కదలుతుంది. అందులో నున్న ఒక మనిషికీ ఇంకో మనిషి సంబంధం ఒకరిని ఇంకొకరు ఆకర్షించటం వలనే కలుగుతుంది. భూమి సూర్యుని ఆకర్షణ వలన కదలి ఒక్కొక్క ఋతువుతో ఒక్కోలా సింగారించ గలుగుతోంది. చెట్లూ, చేమలూ, ప్రాణులూ మనుగడ కోసం సూర్యరశ్మిపై ఆధార పడుతోంది. ఈ ఆధార పడటం మనిషి ప్రకృతిలోనే ఇమిడి పోయింది. పేదవాడు ధనవంతుని చూస్తే చేయి చాప బుద్ధి పుడుతుంది. భార్య బ్రతుకు తెరువు కోసం భర్త మీద, భక్తుడు కోరికలు తీర్చుకోడానికో, మనో నిశ్చలతకో దేవుని మీద యేదో ఒక విధంగా ఇలా మనుష్యులు ఆధార పడ్డారు.

ఈమె, అతనూ దేని మీదనో ఆధారపడే ఉన్నారు. ఆకర్షించలేని వ్యక్తుల చేష్టలే ఎదుటి వారి మనసులు కష్ట పెడ్తాయ్. రావు చూస్తున్న చూపులతో ఆమె జంకి పోయింది. అతనూ కించ పడ్డాడు.

48 వ పేజీ చూడండి



**14-8-1964 శుక్రవారము మొదలు 20-8-1964 గురువారము వరకు.**

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | | గు | శు శ రా |
| కు | వారఫలం | | ర |
| | మహేష్ | | బు |
| కే | | చం | |

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉన్నా ఏదో ఒక కారణంవలన వారం మధ్యలో ఆందోళనకరమైన పరిస్థితులు ఏర్పడే సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో కూడా వారం మధ్యలో కొన్ని మార్పులు రావచ్చును కాని వాటి వల్ల మీకు విశేషమైన ప్రయోజనం ఉండదు. ఉద్యోగంలో మీ పరిస్థితి గడచిన కొద్ది వారాల కంటె బాగా ఉంటుంది. ఇంతవరకు చికాకులతో నిండిన ఆర్థిక వ్యవహారాల్లో అనుకూల పరిణామాలు ఏర్పడతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. 16, 17 తేదీలు మంచివికావు. మిగిలినవి సాధారణం.

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)**

ఈ వారం మధ్య నుంచి వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యాపారాలు ప్రారంభించడానికి అవకాశం ఉంది. వృత్తిలో మీరు ఇదివరకు నిర్లక్ష్యంచేసిన వ్యవహారాలకు యిప్పుడు ప్రాముఖ్యత రావడంవలన పొందవలసిన లాభాన్ని మీరు పొందలేకపోవచ్చును. ఉద్యోగంలో అధికారుల ఆదరణ లభిస్తుంది. అనుకూలమైన మార్పులు కూడా వచ్చే సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని వారాంతంలో జాగ్రత్తగా ఉండడం అవసరం. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో మీరు స్వయం ప్రయాణాలకు గురి కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. బంధువులకు సహాయం చేస్తారు. శుభమూలంగా వ్యయంజరుగుతుంది. 16, 17 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

## మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)**

ఈ వారం గడచిన కొద్ది వారాలకంటె బాగా ఉంటుంది. మీరు ఇదివరకు ప్రయత్నంచేసి ప్రయోజనం లేదనుకొన్న వ్యవహారాలు కూడా యిప్పుడు నెరవేరవచ్చును. వర్షాకాలానికి ఫలితాన్ని యిచ్చే వ్యాపారాలు ప్రారంభించడానికి మంచి సమయం. వృత్తి ఉద్యోగాల్లో ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో మాత్రం ఇంకా అనుకూలత లభించక పోవచ్చును. కొంతమంది మిత్రులకు సకాలంలో సహాయం చేయగల్గుతారు. స్వల్ప అనారోగ్యం చేయవచ్చును కాని దానివల్ల మీ కార్యక్రమానికి భంగం కలుగదు.

స్త్రీలకు — రక్తసంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

14, 15 తేదీలు మంచివి. 16, 17 తేదీలు మంచివికావు.

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ఈ వారం మీరు విశేషమైన ప్రయోజనాన్ని సాధించలేకపోయినా, అన్ని వ్యవహారాలూ ఒడుదుడుకులు లేకుండా నెరవేరడంవలన సంతృప్తికరంగా ఉంటుంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనడం వలన మీ వ్యవహారాలను పూర్తిచేయడంలో ఆలస్యం జరగవచ్చును. వృత్తి ఉద్యోగాల్లో మొగమాటం కోసం వ్యయప్రయాసలకు గురికాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సులభంగా నెరవేరతాయి. అలంకార వస్తువులు కొంటారు.

16, 17 తేదీలు మంచివి. 18, 19, 20 తేదీలు మంచివికావు.

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ఆర్థిక వ్యవహారాలకంటే ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. వృత్తి వ్యాపారాల్లో అన్ని వ్యవహారాలూ విశేషమైన శ్రమ లేకుండా నెరవేరతాయి. భారీయెత్తున చేసే వ్యాపారాల్లో నష్టం రాకపోయినా, ఫలితం అంతగా ఉండదు. వృత్తిలో ఆకస్మికంగా వ్యయప్రయాసలతో కూడిన వ్యవహారాల్లో చిక్కుకొంటారు. గాని తగిన ప్రయోజనాన్ని కూడా పొందగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగం సామాన్యంగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో శ్రమ పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలు అనుకొన్నట్టుగా నెరవేరతాయి.

**సూచన**

నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కావి తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. బంధు వ్యవహారాల్లో గౌరవం లభిస్తుంది.

18, 19 తేదీలు మంచివి. 20 వ తేదీ మంచిదికాదు.

## కన్య :

**(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

గత వారంలో అనుకూలంగా కన్పించిన వ్యవహారాల్లో కూడా యిప్పుడు చికాకులు రావచ్చును. వృత్తి వ్యాపారాల్లో ప్రయోజనంలేని ప్రయాస కలుగుతుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలను భాగస్వాములు అపార్థం చేసికొనే ప్రమాదం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఉద్యోగంలో మార్పులు రావు. మీరు యిదివరకు చేసిన వాగ్దానాలవల్ల ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. ఆరోగ్యం అంత బాగా ఉండదు. బంధువుల వ్యవహారాల్లో ఎంత శ్రమ పడినా నిష్ఫలం వస్తుంది. పెద్దల సహవాసం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్య విషయంలో జాగ్రత్త చాలా అవసరం. కుటుంబ వ్యవహారాల్లో శ్రమ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

14, 15, 20 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పా.)**

వారం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా వారం మధ్యనుంచి అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో నూతన మార్గాలద్వారా ఆదాయం పెరుగుతుంది. ఇంతవరకు మీరు రాదనుకొన్న డబ్బు కూడా చేతికి రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరణా, గౌరవం లభిస్తాయి. ఇదివరకు మీరు జరిపిన ఆర్థిక వ్యవహారాల్లో కొన్ని చిక్కులు రావచ్చును. కాని, మిత్రుల సహాయంవలన తప్పించుకొనే అవకాశం ఉంది. ప్రయాణం ద్వారా కార్యసాధన జరుగుతుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు—అనారోగ్య సూచనలు ఉన్నాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. శుభవార్తలను వింటారు.

14, 15 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

**వృశ్చికం :**

**(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఈ వారం మీరు తలపెట్టిన వ్యవహారాల్లో ఏవో ఆటంకాలు వస్తూ ఉన్నా మీరు దృఢనిశ్చయంతో వ్యవహరించడంవలన వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధిని సాధించగల అవకాశం ఉంది. దీర్ఘకాలానికి ఫలితాన్నిచ్చే వ్యాపారాలు ప్రారంభించడానికి తగిన సమయం. అధికారులవలన జరుగవలసిన పనులు సులువుగా నెరవేరడంవలన ఆదాయం పెరగవచ్చును. వృత్తిలో నూతన విషయాలను తెల్సుకొంటారు. ఉద్యోగంలో చెప్పతగిన మార్పులు రావు. ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో బాధ్యత పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

18, 19, 20 తేదీలు మంచివి. 14, 15 తేదీలు మంచివికావు.

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ వారం గడచిన వారంకంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు ఏర్పడిన విషమ పరిస్థితులు క్రమంగా తగ్గుముఖం పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు తలపెట్టడానికి ఇది సమయంకాదు. వృత్తిలో ప్రయోజనం లేని ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో సాటివారిలో గౌరవం పెరుగుతుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును. కొంతమంది మిత్రుల ఒత్తిడివలన మీకు ఇష్టంకాని వ్యవహారాల్లో చిక్కుకొంటారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇంకా ఒకదారికి రాకపోవచ్చును. విలాస వస్తువులు కొంటారు.

16, 17 తేదీలు మంచివికావు మిగిలినవి మంచివి.

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)**

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు తలపెట్టిన కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేర్చగలరు గాని మీకు ఇంతవరకు సన్నిహితంగా ఉన్నవారితోనే భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటె భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో ఇదివరకటికంటె అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో ఉన్న ఇబ్బందులు ఇంకా తొలగకపోవచ్చును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం.

స్త్రీలకు—వారం మధ్యలో అనారోగ్య సూచనలు ఉన్నాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

16, 17 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)**

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ మాటకు విలువ పెరుగుతుంది. ఆదాయం పెరగకపోయినా, మీరు తలపెట్టిన పనులు సులువుగా నెరవేరడం వలన పరిస్థితి సంతృప్తికరంగా కన్పిస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనంగల పరిచయాలు లభిస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సాధారణంగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో మీకు అనుకూలమైన మార్పులు రావచ్చును. ఆరోగ్యం వారం మధ్యలో అంత బాగా ఉండకపోవచ్చును. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది.

స్త్రీలకు—బంధువులకు సహాయం చేస్తారు. సంతానానికి స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. పుణ్యకార్యాలు చేస్తారు.

18, 19 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

వారం ప్రారంభంలోనే కొన్ని ఒడుదుడుకులు వచ్చినా వారం మధ్యనుంచి అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉంటాయి. మీరు చాలా వారాల నుంచి ప్రయత్నంచేస్తున్న వ్యవహారాలు ఫలించగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభించడంవలన ఆదాయం పెరుగుతుంది వృత్తి ఉద్యోగాల్లో మీరు కోరే మార్పులకోసం ప్రయత్నం చేయడానికి తగిన సమయం. అధికారులవలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులతో కలహ ప్రసంగాలు రావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది సాహిత్యకళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

16, 17 తేదీలు మంచివి. 14, 15 తేదీలు మంచివికావు.

★

## జన్మదిన ఫలం

### ఆగస్టు-14

ఈ సంవత్సరం మీ జీవితంలో చాలా ముఖ్యమైనది. ఈ సంవత్సరంలో జరిగే సంఘటనల ప్రభావం మీ జీవితంపై చాలావరకు ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ధైర్యంగా ముందుకు వెళ్లవలసిన సమయం. వ్యాపారంలో సంవత్సరం మధ్యలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆదాయం మీరు సంవత్సరం ప్రారంభంలో వూహించిన దానికంటే బాగా ఉంటుంది. వృత్తిలో ప్రధానమైన మార్పులు వచ్చే సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించవచ్చును. ఉద్యోగానికి సంబంధించిన విద్యలో ఉత్తీర్ణులు కాగలరు. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు ఆందోళన కలుగుతూ ఉంటుంది. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

### ఆగస్టు-15

ఈ సంవత్సరం మీరు ఘన విజయాలను సాధించలేకపోవచ్చును. కాని నిరుత్సాహపడవలసిన అవసరం కూడా ఉండదు. వృత్తి వ్యాపారాల్లో శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధిస్తారు. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని వ్యవహారాలు నిలిచిపోవచ్చును. వ్యాపారంలో నష్టం రాకపోయినా, రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన కొంత ఇబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో మీ అభిప్రాయాలు అమలుజరపడానికి అవకాశం ఉంటుంది. అధికారుల ఆదరణ లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యంగా ప్రవర్తించరాదు. కాలడం, జారిపడడం వంటి ప్రమాదాలు జరుగవచ్చును. కుటుంబ వ్యవహారములు యధాతథంగా ఉంటాయి. శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉండవచ్చును.

### ఆగస్టు-16

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. వ్యాపారంలో సామాన్యంగా జరిగే వ్యవహారాలకు కూడా ఏవో ఆటంకాలు వస్తూ ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. భారీయెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో ఆకస్మికంగా పోటీ పెరగడంవలన మీ అంచనాల కార్యక్రమాలు తలక్రిందులు కాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో ఇతరులు చేసిన పొరపాటులకు కూడా మీరే బాధ్యత వహించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అననుకూలమైన స్థానమునకు మార్పబడే సూచనలు ఉన్నాయి. సంవత్సరం పొడవునా ఏదో ఒక అనారోగ్యం చేస్తుంది. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. ప్రేమ వ్యవహారాల్లో వ్యతిరేకత రావచ్చును. మీ తాలూకు వస్తువులు దొంగిలింపబడే ప్రమాదం ఉంది.

### ఆగస్టు-17

ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే బాగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు. వ్యాపారాలలో మీరు అనుకోకుండా కొన్ని వ్యవహారాలు చేయడం తటస్థిస్తుంది. తద్వారా ధనలాభం కలుగుతుంది. ఇంతవరకు భాగస్వాములతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగి

త్వరలో వనితాలోకంలో!

## 6000 మైళ్లు సైకిలు మీద అబల సాహసయాత్ర

పోయి అన్ని వ్యవహారాలు చురుకుగా సాగుతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. స్థానచలనం కలిగే సూచనలు ఉన్నాయి కాని మారబోయే స్థానం కూడా అనుకూలంగా ఉండడంవలన ఆందోళన పొందవలసిన అవసరం ఉండదు. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. గృహనిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## ఆగస్టు-18

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఎన్నో అవకాశాలు కన్పిస్తాయి గాని అవి కార్యరూపం ధరించడానికి మీరు ఎన్నో వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. అందువే ఫలితం అంత సంతృప్తికరంగా ఉండదు. కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు చేతికి అందడంవలన ఆర్థికంగా ఈ సంవత్సరం ఇబ్బంది కన్పించకపోవచ్చును. వృత్తిలో కూడా శ్రమకు తగిన ప్రయోజనం ఉండదు. ఉద్యోగం అనుకూలంగానే ఉంటుంది గాని విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి సమయం కాదు. కోర్టు వ్యవహారాల్లో సంవత్సరాంతంలో విజయం లభించగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును. విలువైన వస్తువులు కొంటారు. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

## ఆగస్టు-19

జీవితంలో చాలా ముఖ్యమైన సంవత్సరాల్లో ఒకటిగా ఈ సంవత్సరం పరిగణింపబడవచ్చును. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారాల ఫలితం మీ జీవిత మార్గాన్నే మార్చివేయవచ్చును. వృత్తి వ్యాపారాల్లో మీకు ప్రాబల్యంగల వ్యక్తుల అండదండలు లభిస్తాయి. మీ భవిష్యత్తుకు సంబంధించిన ప్రణాళికలు అమలుపరచడానికి అనువైన సమయం. మీరు ఇంతవరకు వూహించని వ్యవహారాల్లో ధనలాభం కలుగుతుంది. వృత్తి ఉద్యోగాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీరు కోరే మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. బంధువుల వ్యవహారాల్లో కూడా విజయాన్ని సాధిస్తారు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విద్యార్థులకు క్లాసు రాగల అవకాశం ఉంది.

## ఆగస్టు-20

ఈ సంవత్సరం మొత్తంమీద సామాన్యంగా ఉన్నా చిత్రమైన సంఘటనలు జరిగే అవకాశం ఉంది. ఏ వ్యవహారంలోను స్థిరత్వం ఉండదు. అనుకూలంగా కన్పించిన వ్యవహారాలు ప్రతికూలంగాను, ప్రతికూలంగా కన్పించిన వ్యవహారాలు

## జన్మదినఫలం

అనుకూలంగాను మారుతూ ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో ఏర్పడే అనిశ్చిత పరిస్థితివల్ల చెప్పతగిన అభివృద్ధిని సాధించగల అవకాశంలేదు. వృత్తిలో ఇంతవరకు మీకు తోడ్పడుతున్న వ్యక్తులు దూరంకాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో వ్యవహారాలు రావడంవల్లనే మీకు ఇష్టంలేని పరిస్థితుల్లో మీరు వ్యవహరించవలసి వస్తుంది. ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాల్లో అభిప్రాయభేదాలు రావచ్చును గాని వాటివల్ల ఏ వ్యవహారమూ ఆగిపోదు. రాజకీయాల్లో బలాబలాలు తారుమారు కావచ్చును. విద్యార్థులు మొదటనుంచీ శ్రద్ధగా చదవడం మంచిది. ★

# కొత్తసీరియల్ ప్రారంభం!

"అక్కయ్యను చూట్టానికి ఆ రోజున పెళ్లివారొస్తారని ఇంట్లో అంతా ఎంతో హడావుడిగా ఉన్నారు. అక్కయ్యకు అంతవరకూ రెండుమూడు సంబంధాలు నాన్నగారు లోగడ చూశారు. కాని పిల్లనుచూసే పరిస్థితి రాకమునుపే ఆ సంబంధాలు తప్పిపోయినయ్యి. కనుక అక్కయ్యను చూట్టానికొచ్చే సంబంధాలలో ఇదే మొదటిది.

ఆ రోజున నేను కూడా స్కూలుకి శలవు పెట్టాను. "పెళ్లివారు మీఅక్కయ్యను చూట్టానికి వస్తున్నారు గాని నిన్ను చూట్టానికికాదు గదుటే సీతా, నువ్వు శలవు పెట్టటం ఎందుకు?" అని ఒకళ్లిద్దరు స్నేహితులు అన్నా నేను పట్టించుకోలేదు. పెళ్లి క్కొడుకు ఎట్లా ఉంటాడో చూడాలి. అక్కయ్య పెళ్లి చూపులకు ఎట్లా కూర్చుంటుందో, పెళ్లికొడుకును ఎట్లా చూస్తుందో, పెళ్లికొడుకు అక్కయ్యను ఏం ప్రశ్నలు వేస్తారో, అక్కయ్య అతనితో ఎట్లా మాట్లాడుతుందో ఆ వేడుక అంతా చూడాలనిపించింది. శలవు పెట్టి ఇంట్లోనే ఉన్నాను.

ఆ రోజున అక్కయ్య ఆందోళన చూస్తుంటే నాకు నవ్వు ఆగింది కాదు. సామాన్య పరిస్థితుల్లో ఒక పురుషుణ్ని ఒక స్త్రీ చూసినా, ఒక స్త్రీని ఒక పురుషుడు చూసినా, ఏ విధమైన భావాలూ, అనుభూతులూ కలగవు. మన దృష్టికి బాగుంటే ఒక్క క్షణం చూసి ఎంత బావున్నారో అనుకుంటాము. బావుండక పోతే చూడనే చూడము. అంతకు మించి ఆలోచించే అవసరమే ఉండదు. పెళ్లి చూపులనంగానే ఏమిటో ఆందోళన. ఏమిటో ఆలోచనలు. ఏదో దిగులు. ఆలోచనకు అంతు పట్టని వాంఛలు. మనసులో ఏదో ఆందోళనతో కూడిన తృప్తి. తెలియని తహ తహ. వ్యక్తపరచలేని అభిప్రాయాలు మనసులో మెదులుతూ ఉంటే సిగ్గు విడిచి చెప్పలేని ఆందోళనతో కూడిన అనుభూతులు.

అక్కయ్య మనస్సు అరిటాకు లాంటిది. అతి సున్నితమైన భావాలు. చెప్పలేని ఆలోచనలు.

సాయంత్రం నాలుగ్గంటలకు పెళ్లి వారొస్తారంటే మధ్యాహ్నం నుంచే గంటన్నర సేపు తల దువ్వి జడలు వేసుకుంది. మొదటిసారి జడ బిర్రుగా వేసుకుంది. తోచలేదు. మళ్లీ జడంతా విప్పి మళ్లీ దువ్వుకుని వదులుగా వేసుకుంది. ఈసారి






పౌడర్ సరిగ్గా రాలేదు. తిత్తులు, తిత్తులుగా ఉంది. మళ్ళా విప్పి మళ్ళా వేసుకుంది. ఈసారి నచ్చింది. ఏ చీర కట్టుకోవాలి.? ఏ జాకెట్టు తొడుక్కోవాలి ? అనే సమస్య తెగటానికి అరగంట పట్టింది. పెట్టెలో ఉన్న చీరలన్నీ తీసింది. అమ్మ నడిగింది. అమ్మ చెప్పిన చీర నచ్చలేదు. నన్నడిగింది. నేను ఎగతాళి చేస్తానని తెల్సు. అయినా అడిగింది. చెప్పాను. నచ్చలేదు. ఆఖరికి ఒక నిశ్చయానికొచ్చి ఒక చీర తీసుకుని మిగతావి పెట్లో పెట్టేసింది. ఎట్లాగయితేనేం మూడువ్వరకు ముస్తాబు పూర్తయింది. దాన్ని ఏడిపించటానికి " జానకీ, ఆ బొట్టు మరీ అంత కనుబొమ్మల మధ్య పెట్టుకున్నావేం? కొంత అద్దంలో చూసుకో " అన్నాను. నిజమేననుకొని అద్దంలో చూసుకుంది. బాగానే ఉన్నట్లుగా తోచింది. అమ్మనడిగింది. అమ్మ నిక్షేపంలా ఉంది. ఏ వంకా రాలేదు. సీత నడిగితే "ఇంక ఇప్పాళ తెలిసింది వక్కో " అన్నది. దాన్ని చూస్తుంటే నాకు నవ్వు ఆగలేదు.

" ఏమే, జానకీ ముస్తాబు పూర్తయిందా? అయినా ఎందుకే నీకీ ఆందోళన. వస్తారు. చూసి పోతారు. నచ్చితే చేసుకుంటారు. దీనికింత రాద్ధాంతమూ, రిహార్సల్సూ ఎందుకే. ఒకవేళ వాళ్ళు చేసుకోనంటారనుకో. అప్పుడు నీమనస్సు ఎట్లా ఉంటుంది? సహజ సౌందర్యాన్ని చూసి పెళ్ళి కూతుర్ని ఎంచుకోవాలి గాని, ఇంత మేకప్ చేసుకుని, ముస్తాబయి కూర్చుంటే, తీరా పెళ్ళైయ్యాక బావగారు " ఏం జానకీ పెళ్ళి చూపు లప్పుడు చూసినట్లుగా లేవేం " అంటే ఏం సమాధానం చెప్తుతావే? " అన్నాను.

అక్కయ్య నా మాటలకి నవ్వింది. అది నాకన్న తెలివి కలది. దానికి ఆత్మ సౌందర్యం బాహ్య సౌందర్యం కన్న ఎన్నోరెట్లు ఎక్కువ. అభిమానానికీ, గౌరవ మర్యాదలకీ పడిచస్తుంది. నా ఎగతాళి మాటలన్నీ విని చిరునవ్వుతో ఒక్కటే సమాధానం చెప్పింది.

"ఎవళ్ళదాకా వస్తే వాళ్ళకే తెలుస్తుందే సీతా. పెళ్ళివార్ని మోసం చెయ్యటానిక్కాదు నేను ముస్తాబయింది. నా సంతృప్తికోసం. అమ్మ, నాన్న సంతృప్తికోసం. నేను మామూలుగానే ఉంటాననుకో, జానక్కి ఈ సంబంధం ఇష్టంలేదు కామాలు అది సరిగ్గా జడన్నా వేసుకోకుండా కూర్చుంది. అనుకుంటారు. వాళ్ళ మనస్సును అనవసరంగా కష్టపెట్టిందాన్నవుతాను." అన్నది జానకి. నేనేం మాటాడలేక పోయాను.

సాయంత్రం నాలుగ్గంటలకు పెళ్ళివారొచ్చారు. పెళ్ళికొడుకు, తల్లి, తండ్రి, పెళ్ళికొడుకు చెల్లెలు— బండిదిగి వాళ్ళు గుమ్మంలోకి రాగానే నాన్నగారు ఎదురేగి వాళ్ళను సాదరంగా ఆహ్వానించి ఇంట్లోకి తీసుకొచ్చారు. మగవాళ్ళంతా కుర్చీల్లో కూర్చున్నారు. పెళ్ళికొడుకు తల్లి, చెల్లెలూ, మా అమ్మతో మాట్లాడుతూ తివాసీ మీద కూర్చున్నారు. పెళ్ళికొడుకు చెల్లెలు నా ఈడుదే. నా వైపు ఎగా, దిగా చూస్తూ కూర్చుంది. సన్నగా, పూచిక పుల్లలా, పొడుగ్గా ఉంది. ఎంత దర్పంగా, డాబు సరిగ్గా కూర్చుందో తల్చుకుంటే, నాకు నవ్వూ, కోపమూ రెండూ వచ్చినయ్యి. తనూ ఒక ఇంటి కోడలు కాబోయేదే. తనను చూట్టానికీ పెళ్ళివాళ్ళొస్తారు. ఈ జీవన్నాటకంలో ఎప్పుడో ఒక

ప్పుడు ఈ పెళ్ళి తారకను చేస్తుంది. తరత తీసి, భర్తా గర్వమూ ఎందుకు ఉండాలో నాకూ అర్థం కాలేదు.

నావైపు చూసి కళ్ళజోడు సవరించుకుని "మిమ్మల్ని ఎక్కడో చూసినట్లు గుర్తు. ఎందాకా చదువుకున్నారు.?" అన్నది పెద్ద స్టైలిష్‌గా మాట్లాడుతూ. "చదువు మానేశానండీ. ఏదో పోనాకాలపు చదువు. మీరేం చదువుతున్నారు" అన్నాను. అమ్మ నా వైపు చూసింది. నేను మెల్లిగా నవ్వి వూరుకున్నాను. అమ్మాయి సమాధానం చెప్పలేదు. తల్లి వైపు చూసింది.

"మొన్ననే యస్. యల్. సి. పరీక్షయిచ్చింది" అన్నది తల్లి. మనస్సులోనే నవ్వుకుని "ఎవరి కిచ్చిందో పరీక్ష" అనుకున్నాను.

"అమ్మాయిని తీసుకురండి" అన్నది తల్లి మా అమ్మతో. అమ్మ జానకిని పిల్చింది.

గది గుమ్మానికి ఎదురుగా వేసిన తివాసీ మీద కూర్చుంది అక్కయ్య. పెళ్ళికొడుకు అక్కయ్యను చూశారు. జేబు రుమాలుతో మూతి తుడ్చుకున్నాడు. ఎందుకో నాకు అర్థం కాలేదు. పెళ్ళికొడుకు తండ్రితో నాన్న ఏదో మాట్లాడు తున్నారు.

"మీ పేరేమిటి?" అన్నాడు పెళ్ళికొడుకు.

"జానకి" అక్కయ్య సమాధానం.

"ఏం చదివారు?"

"ఇంటర్ పాసయాను"

"సంగీతం వచ్చా"

"రాదు"

# హృదయ కుసుమాలు

"పోనీ పాడగలరా"

"కొద్దిగా"

"ఇంటరులో మీ గ్రూప్"

"బై. పి. సి."

"డాక్టరు కోర్సు చదువుదామనుకున్నారా?" నవ్వుతూ అడిగారు.

"చదివిస్తే చదవాలనే ఉంది"

నవ్వి వూరుకున్నాడు. ఇంక వేసే ప్రశ్నలు ఏమీ లేనట్లుగా తండ్రివైపు చూశాడు.

ఇంటర్వ్యూ పూర్తయింది. అక్కయ్య లోపలికి వెళ్ళింది.

"ఏమండీ మీరేం ప్రశ్నలు వెయ్యలేదేం" అన్నాను ఆ అమ్మాయితో.

"పెళ్ళి చేసుకునేది మా అన్నయ్య. నేకాదు" అన్నది.

"అట్లాగా. అవుననుకోండి. అయినా ఆడబిడ్డ అర్ధభర్తతో సమానం. ఆడబిడ్డ పోస్టు మంచి హోదా గల ఉద్యోగం. జిల్లా బోర్డు ప్రెసిడెంటు లాంటిది" అన్నాను.

అమ్మాయి పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వింది.

"చాలా బాగా సరదాగా మాట్లాడతారండీ మీరు. మీరు గనక మా వదినయితేనా, నా ప్రెసిడెంటు గిరీ చెలాయిద్దును. ఛాన్సు పోయింది. ఏం చేస్తాం. మీ పేరు." అన్నది.

"నా పేరండీ సీత. అక్కయ్య పేరు జానకి. తమ నామధేయం."

"సుభద్ర"

"చాలా బావుంది"

కాసేపు కూర్చుని వెళ్ళారు. పిల్ల నచ్చిందీ లేందీ ఉత్తరం రాస్తానన్నారు. నాన్నగారు వాళ్ళని స్టేషను వరకూ పంపించి వచ్చారు. వాళ్ళని పంపించి వచ్చాక అమ్మ అడిగింది నాన్నని. "వాళ్ళ అభిప్రాయం ఎట్లా ఉందో?"

"వాళ్ళ మాటల ధోరణిచూస్తే పిల్ల నచ్చినట్లు గానే ఉంది. కట్నంకానుకలు మాట్లాడుకోవాలిగా" అన్నారు.

నేను మెల్లిగా అక్కయ్య గదిలోకి వెళ్ళాను. కిటికీలోంచి బయటికి చూస్తూ ఏదో ఆలోచిస్తూ పడుకుంది. అక్కయ్య మనస్సు ఎవ్వరికీ అర్థం కాదు, ఒక్క నాకు తప్ప.

"అక్కయ్యా" అని పిల్చాను.

ఉలిక్కిపడి లేచి కూర్చుంది.

"ఎందుకే జానకీ అంత దిగులూ, ఖంగారూను. ఏమిటమ్మా అంత ఆలోచన. ఆ అబ్బాయిని చేసుకుందామా, వద్దా అనేగా. చేసుకోవే జానకీ. బానే ఉన్నాడు. కాలేజీలో లెక్చరరు. ఎమ్. కాం. ప్యాసయాడు. సింపుల్‌గా, చక్కగా ఉన్నాడు. ఏమో నమ్మా నాకు మాత్రం నచ్చాడు. తరువాత నీఇష్టం" అన్నాను.

"పోనీ నువ్వు చేసుకోరాదుటే సీతా" అన్నది అక్కయ్య.

"పెళ్ళంటే అంత ఇష్టం లేనిదానివి ఇంత వరకూ ఎందుకు రానిచ్చావ్. ముందే చెపితే పోయేదిగా. నేనయితేనా వాళ్ళతోనే చెప్పేదాన్ని, "ఏమండీ! నాకు పెళ్ళంటే ఇష్టం లేదు. నామాటలు వినకుండా ఈ పెళ్ళి చూపులకి కూర్చో పెట్టారు. దయచేసి మా వాళ్ళతో మీ అమ్మాయి బాగుండ లేదని చెపుదురూ," అనేదాన్ని, అప్పుడేమో అట్లా ముస్తాబయావ్. ఇప్పుడేమో ఇట్లా అంటున్నావ్" అన్నాను అక్కయ్యను కేకలేసినట్లుగా మాట్లాడుతూ.

"కాదే సీతా"

"ఏమిటి మరి"

"మనకి ఈ పేర్లు ఎందుగ్గాను పెట్టినట్లు చెప్పు. నా పేరు జానకి. నీ పేరు సీత. అనకూడదు గాని సీతాదేవి పేరు పెట్టుకుంటే కష్టాలు పడతారంటారు. ఏమిటోనే సీతా, నాక్కు పెళ్ళంటే ఏమిటో దిగులుగానే ఉంది"

అక్కయ్య అట్లా అంటుందని నే నెప్పుడూ అనుకోలేదు.

"పెళ్ళంటే దిగులెందుకే జానకీ. కష్టాలు పేర్లని బట్టి రావు. మన మనస్సును బట్టి, మన హృదయాన్ని బట్టి, మన చేష్టలు, చేతల్ని బట్టి వస్తాయి. అయినా నీకు కష్టాలు వస్తాయంటే నేను నమ్మను. ఈ సంబంధమే గనక అయితే కష్టాలు రావు. అతను ఎంతో మంచివాడులా ఉన్నాడు. చదువుకున్నవాడు. యోగ్యుడు. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాడు. ఎంతో జాగ్రత్తగా ఎదుటి వారి మనస్సుని అర్థం చేసుకుని మాట్లాడే దానివి నువ్వు. నాకింకా నోటి దురుసు జాస్తి. నిమిషంలోకి అనుకోకుండా నోరు జారాను. కాలు జారినా తీసుకోవచ్చును గాని, నోరు జారితే తీసుకో

## క్రమశిక్షణ

సైమన్ కమిషన్ వచ్చినప్పుడు ప్రదర్శనలో లక్నో స్టేషన్‌దగ్గరికి నెహ్రూజీ బ్రహ్మాండమైన అహింసాత్మక ప్రదర్శనం తీసుకువెళ్లాడు. అరమైలు చదరంగావున్న మైదానంలో పోలీసులు వీళ్ళను ఆపేశారు. గుర్రాలమీద, కాళ్ళమీదా వందల సంఖ్యలో పోలీసులు, వాలెంటీర్లు- అదో యుద్ధభూమిలా వుందిట. పైగా ఆశ్వికదళాలు, ఇతర సైన్యాలు వచ్చాయి. ఆశ్వికదళాలు టకటకా ప్రదర్శకుల మీదకు వచ్చేశాయి. ప్రదర్శకులు కదలలేదు. ఆశ్వికులు గుర్రాల నాపుచేద్దా మనుకున్నప్పుడు- అవి వెనకాళ్ళమీద లేచి, వాటి ముందరి కాళ్ళను గాలిలోకెత్తినప్పుడు సరిగ్గా ఆ డెక్కల కాళ్ళ క్రింద నెహ్రూజీ కూడా వున్నాడు! పోలీసులు పొడుగైన బెత్తాలతో ప్రదర్శకులను చితక బాదేస్తున్నా సరే, తాను 'నాయకునిగా తన జాగా వదలకూడద'నే పట్టుదలతో నెహ్రూ మొహం తప్ప మరేశరీర భాగమూ దాచుకోకండా దెబ్బలు తింటూన్నప్పుడు ఒక్కసారి అనుకున్నాడుట - "గుర్రం మీదినించి ఆ బెత్తంతో కొట్టే సైనికాధికారిని క్రిందకులాగి తానా గుర్రం ఎక్కి..." కాని అలాంటి ఆలోచనలు, తమ ఉద్యమ సూత్రానికే వ్యతిరేకమే... "మానేశా"నని పూర్తిగా రక్తసిక్తమయ్యేలా వాలంటీర్లు; ప్రజలు కిమ్మనక దెబ్బలు తిన్నామని పేర్కొన్నారు నెహ్రూజీ "తన కథ"లో....

శీమన్న సంగతి తెల్సు. అయినా నేను తొందర పడ తాను. నువ్వు అట్లాకాదు. కట్నం కానుకలనేవి ఈ పవిత్ర భారత దేశంలో తప్పవు. కట్నం పుచ్చు కుంటే గాని ఆ వివాహం సవ్యంగా జరిగినట్లు కాదు. ఈ సంబంధమైనా కట్నం ఇవ్వాల్సిందే. మరో సంబంధమైనా ఇవ్వాల్సిందే. ఆ బరువు బాధ్యత లన్నీ మనల్ని కన్నందుకు నాన్నే చూసుకుంటారు. ఈ సంబంధం కాదనకు. జీవితం వడ్డించిన విస్తరి కాదు. విస్తరి వేసుకుని అన్నీ మనమే వడ్డించుకోవాలి. విస్తట్లో తింటున్నప్పుడు పుల్లలు రావచ్చు. వాటిని తీసివేసి గొంతుకు అడ్డు పడ కుండా తినాలి.'' అన్నాను.

అక్కయ్య ఆశ్చర్యంగా నా వైపు చూసింది. దాని కళ్లల్లో వెయ్యి దీపాల కాంతి నాకు కనిపిం చింది· నా బుగ్గలుని నిమిరి ముద్దు పెట్టుకుంది. నా చెంపల మీద వేడికన్నీళ్ళు పడ్డయ్యి.

"నువ్వు చెప్పినట్లుగానే వింటానే సీతా. ఈ సంబంధం చేసుకోటానికి నాకు అభ్యంతరం లేదు.'' అన్నది అక్కయ్య.

నాలుగు రోజుల్లో ఉత్తరం వచ్చింది. పిల్ల నచ్చిందనీ, అక్కడికి వచ్చి కట్న కానుకల విషయం మాట్లాడి తాంబూలాలు పుచ్చుకోవచ్చుననీ.

ఆ రోజున అమ్మ సంతోషానికి హద్దులేదు. నాన్నగారు కూడా "జానకి అదృష్టవంతురాలే" అన్నారు.

నాలుగు రోజుల్లో వెళ్ళి కట్నకానుకలు మాట్లాడి తాంబూలాలు పుచ్చుకున్నారు. కట్నం అయిదు వేలు. ఉన్న ఎకరన్నరా అమ్మేసి డబ్బంతా బ్యాంకులో వేశారు నాన్న ఇది వరకే.

మరో పదిహేను రోజుల వ్యవధిలో ముహూ ర్తాలు పెట్టుకున్నారు. పెళ్ళి పీటల మీద ఎంతో సంతోషంగా కూర్చుంది అక్కయ్య. మంగళ వాద్యాలు మారుమ్రోగగా, వేదోక్తంగా మంత్రాలు చదువుతూంటే బావగారు మంగళ సూత్రం మెళ్ళో కడుతుంటే సంతోషంగా ఒక్కసారి నా వైపు చూసి తల వంచుకుంది అక్కయ్య. ఆ మంగళ సూత్రం ఖరీదు అయిదు వేలన్నమాట. అది మెళ్ళోపట్టానికి ఇంకో రెండు వేలవ్వా అయింది. అక్కయ్య చూపులో వెయ్యి భావాలు నాకు కలిగినయ్యి.

అక్కయ్య పరాధీన. ఇప్పుడు కుమారి జానకి కాదు. శ్రీమతి సు॥ జానకి. ఇంకా చక్కగా పిలవాలంటే శ్రీమతి జానకీ రామారావు. దాని మెళ్ళో ధగధగ లాడే రాళ్ళ నెక్లెసు, మంగళ సూత్రాలూ, నల్లపూసలూ, పలకసర్లూ, చేతు లకు బంగారు నగిషీ గాజులూ చూసేసరికి నాకూ కళ్ళు చెమర్చినయ్యి, అక్కయ్య అపర లక్ష్మి దేవిలా ఉంది. ఒక్కసారిగా పదిపొన్లు పెరిగినట్లుగా కనిపించింది. నాలుగేళ్ళు పైబడినట్లుగా కనిపిం చింది. నాకు దూరమైపోతున్నట్లుగా అనిపిం చింది. యధావిధిగా పెళ్ళయిపోయింది.

మూణ్ణిద్రలకు గుంటూరు వెళ్లారు. అక్కయ్యతో బాటుగా నేనూ వెళ్లాను. సుభద్రతో కబుర్లు చెప్పవచ్చనీ, అసలు బావగారిల్లు ఎట్లా ఉంటుందో చూద్దామనీ వెళ్లాను. గుంటూరు లోనే మా చిన్న మామయ్య, అంటే మా అమ్మ పెద్ద తండ్రి కొడుకు ఉన్నాడు. అతనుడాక్టరు. అతనికీ మా బావగారికీ కూడా బాగా పరిచయమే. అక్కడున్న మూడు రోజులూ అతను బావగారింటి కొచ్చి బావతోనూ, నాతోనూ, అక్కయ్యతోనూ ఒకటే కబుర్లు చెప్పేవాడు. చాలా కలుపుగోలు తనంగా ఉండే వాడు. అక్కయ్యంటే ఆయనకు ఎంతో అభిమానం, ఎంతో గౌరవం, పెళ్లి కూడా అవటం నుంచీ, ఇంకా అభిమానమూ, గౌరవమూ ఎక్కువయినయ్యి. పెళ్లిలో అతను అంటే చిన్న మావయ్య అక్కయ్యకు రిస్టువాచి ప్రెజెంటుగా చదివించాడు. వాళ్ళు బాగా ఆస్థిపరులు. ఆ మూడు రోజుల్లోనూ చిన్న మావయ్య బావగార్ని పోరి అందర్నీ తీసుకుని సినిమాకు తీసుక వెళ్లారు. సినిమాకు బావ, అక్కయ్య, నేనూ, చిన్న మామయ్య, అత్తయ్య పిల్లలూ, సుభద్ర అంతా వెళ్లాము. చిన్న మామ య్యకు ఒక్క కొడుకూ ఒక్క కూతురూ. కొడుకు నాలుగేళ్ళు. కూతురికి రెండేళ్లు. మావయ్య పెళ్ళయి కూడా ఆరేళ్లయింది. మావయ్య ఎంతో సహృదయుడు. సరళ స్వభావం కలవాడు. ఆస్పత్రి కొచ్చేవాళ్లని కూడా ఎక్కువగా డబ్బుకు వత్తిడి చెయ్యడు. ఇచ్చిందేదో పుచ్చుకుంటాడు. కాక పోయినా ఆస్తి పరుడు. ఆ రోజున చిన్న మావయ్య నవ్వించే కబుర్లు ఎన్నో చెప్పాడు. బావకూడా పాటు

# హృదయ కుసుమాలు

వెక్కలయ్యేటట్లుగా నవ్వేవారు. అక్కయ్యతో ఎగతాళిగా ఎన్నో మాట్లాడాడు. బావను సరిగ్గా చూసుకోమన్నాడు. "రామారావుగారూ, మీరు నిజంగా శ్రీరామచంద్రులే. మా జానకి సుగుణాల రాణి. ఆ సీతాదేవిని మరిపిస్తుంది. అంత ఉత్తమురాలు: ఇదుగో ఈ సీతాదేవి ఉన్నది. దీంతో వేగటం కష్టమే. జానకి మాత్రం నిజంగా ఆనాటి జనక మహారాజా కూతురే" అన్నాడు బావతో. అంత మంచి వాడు చిన్న మావయ్య.

అంత సంతోషంతో ఆ మూడు రోజులూ గడిచినయ్యి.

జీవితంలో కొన్నికొన్ని సంఘటనలు తాత్కాలిక మైనవే అయినా మన మనస్సులో శాశ్వతంగా ముద్ర వేసుకు పోతాయి. అవి ఏ నాటికీ మన హృదయ ఫలకం మీది నుంచి చెరిగి పోవు.

మరో వారం రోజుల్లోనే దారుణమైన వార్త విన్నాము. చిన్న మావయ్య కారులో వస్తూ ప్రమాదవశాత్తూ లారీకి గుద్దుకుని అక్కడికక్కడనే ఈ లోకాన్ని విడిచి పోయాడు. ఈ దారుణ వార్త వింటామని కల్లోనయినా అనుకోలేదు. రత్నం లాంటి భార్యనూ, మాణిక్యాల్లాంటి బిడ్డలిద్దర్నీ వదిలి శాశ్వతంగా కన్ను మూశారు చిన్నమావయ్య.

నాన్న, అమ్మా, గుంటూరు వెళ్లారు. ఈదారుణ వార్త విని అక్కయ్య ఏడ్చింది. శవాన్ని చూట్టానికి తనూ గుంటూరు వస్తానన్నది. పెళ్లయి పదహారు రోజుల పండగయినా కాలేదు. పోగాయిత్యంగా నువ్వు వెళ్ళటమేమిటన్నారు అంతా. అంచేత అక్కయ్య వెళ్ళలేదు. నేను అక్కయ్యా ఇంట్లో ఉన్నాము. నాన్న, అమ్మ వెళ్ళి కర్మకాండలు పూర్తయ్యాక వచ్చారు. అక్కయ్య విచారానికి అంతు లేదు. తనంటే ఎంతో అభిమానం చూపేవాడు. ఆ రోజున సినిమాకు అందర్నీ తీసుకు వెళ్ళాడు. అంత ఆదరాభిమానాన్ని చూపించిన చిన్న మామయ్య పోయాడు. దారుణంగా కన్ను మూశాడు. అంటూ విచారించేది అక్కయ్య.—

*  *  *

ఒక్కసారి నిట్టూర్చి కళ్ళు తుడ్చుకుని రాధ వైపు చూసింది సీత.

"బాగుంది సీతా, మీ అక్కయ్య అంత సున్నిత హృదయురాలన్న మాట. ఉత్తమ ఇల్లాలు. ఈ కథంతా వినాలని ఉంది. ఏమీ మర్చిపోకుండా పూర్తిగా చెప్పాలి సీతా" అన్నది రాధ.

"అట్లాగే రాధా. నీకు ఆస్పత్రికి టైమైందేమో వెళ్ళిరా సాయంత్రం మాట్లాడుకుందాం" అన్నది సీత.

రాధ వెళ్ళిపోయింది. సీతకూడా దుస్తులు వేసుకుని తన డిస్పెన్సరీకి వెళ్ళింది.

సీత, రాధ ఇద్దరూ గుంటూరులో డాక్టర్లు. సీత ప్రైవేటుగా నర్సింగ్‌హోం పెట్టింది. రాధ గవర్నమెంటు ఆస్పత్రిలో డాక్టరు. ఇద్దరూ యం. బి. బి. ఎస్. ప్యాసయారు. ప్రాణ స్నేహితులు. వైద్య రంగంలో పేరు తెచ్చుకున్నవాళ్ళు. ఏదో మాటల సందర్భంలో తన జీవిత చరిత్ర చెప్పమంది రాధ సీతని. సీత ఎంతో బలవంతం మీద తన జీవిత గాథ చెప్పసాగింది— (ఇంకా ఉంది.)

# అమరజీవి జవహర్‌లాల్ చాచా



పిల్లల సమావేశంలో మాట్లాడుతున్న జవహర్‌లాల్ బాబాయి!



పండిట్ నెహ్రూ, మనుమలు సంజయగాంధీ, రాజీవగాంధీ, కుమార్తె ఇందిరా గాంధీలతో 1952 లో యిలా వున్నారు. యీ అపురూప దృశ్యం ఆయన బాలలతో ఎక్కడున్నా అగుపించుతునే వుండేది! ఆయన లేకపోయినా స్మృతి చెరగదు!

మనలో కొందరు 'నెహ్రూ చాచా'ను చూచినవారు కూడా ఉన్నారు. కొందరం పుస్తకాలలో ఆయననుగురించి చదువుకున్నాం.

అంతటి పెద్ద నాయకుడు కదా, మన దేశానికంతా ఆయన గొప్పవాడు కదా, మనకు 'చాచా' ఎలా అవుతాడు?- అన్న సందేహం మీలో తెలియని వారికి ఉండవచ్చును. అదే అసలు చిత్రం! దేశాని కంతటికీ ఎంత గొప్పవాడో పిల్లలందరికీ అంత మంచివాడు ఆయన.

## గొప్పవారిలో ఆయన గొప్ప

గొప్పవారిలో ఆయన గొప్పవాడు. నాయకులలో పెద్ద నాయకుడు. అంతేగాదు, పసిపిల్లలలో కూడా తానూ ఒకడు. అందువల్లనే కాబోలు, మనందరికీ ఆయనంటే ఎంతో ఇష్టం.

మన వూళ్ళో గాని, మరో వూళ్ళోగాని ఎంత పెద్ద సభ అయినా జరగనీయండి—ఎంతటి గొప్పవారయినా రానీయండి. వాళ్ళందరూ వచ్చారుకదా అని 'నెహ్రూ చాచా' మనల్ని చూడకుండా వెళ్ళేవాడు కాదు. మనమూ, మన తమ్ముళ్ళూ, చెల్లాయిలూ ఎంత పెద్ద గుంపులో ఇరుక్కుపోయినా ఆయనే ఆ గుంపునంతా దాటుకొంటూ మన దగ్గరికి సరాసరి వచ్చి పలుకరించి పోయేవాడు. కొందరిని ఎత్తుకొని ముద్దాడేవాడు. అందుకే—ఆయనకు పిల్లలంటే ఎంత ఇష్టమో, పిల్లలకూ ఆయనంటే అంతే ఇష్టం. పిల్లలు కూడా నెహ్రూ చిన్నాన్న వూళ్ళోకి వస్తున్నాడని తెలియగానే జట్లు జట్లుగా వెళ్ళి, చాచాను చూచి, 'నమస్తే' చెప్పి వచ్చేవారు.

మనతో మన ఇంట్లో ఉండే చిన్నన్నలు ఎంత సరదాగా ఉంటారో, నెహ్రూకూడా అలానే ఉండేవారు. పిల్లలను దగ్గరకు తీసుకొని చుట్టూ కూర్చోబెట్టుకుని ఎన్నెన్నో మాటలు మాటాడేవారు. కథలు చెప్పేవారు. ఇంకా, తమాషా తమాషాగా గమ్మత్తులు చేసేవారు. మనందరినీ నవ్వించి, తానూ నవ్వేవారు.

అందుకే కాబోలు, నవంబరు 14 వ తేదీ, అంటే నెహ్రూబాబాయి పుట్టిన రోజున బాలల దినోత్సవం జరుపుతారు. దేశమంతటా, స్కూళ్ళలోను, ఇళ్ళలోను ఆ రోజున ఎన్నో వేడుకలు చేసుకొనేవారు. కొందరు పిల్లలేమో—అంటే ఢిల్లీలో ఉండేవారన్నమాట — నెహ్రూగారింటికి వెళ్ళి, కొంతసేపు సరదాగా గడిపేవారు. కొందరు చిన్నాన్నకు ఇష్టమైన గులాబీపూలను తీసికొని వెళ్ళి, ఆయనకు ఇచ్చి వచ్చేవారు. ఆరోజున ఆయన కూడా తనకు వేరే ఎంత పెద్ద

సినిమలున్నా, వా టన్నిటిని తవుకొని, ఈ చిన్నారి పిల్లలతో సరదాగా ఆడుకొనేవారు. పిల్ల లందరిని తీసికెళ్లి తోటలో పావురాళ్లను ఎగరేసేవారు. పిల్లలతో ఆయన కూడా వూయలమీద వూగటం, ఆటలు పాటలు లాంటివి చేసేవారు. అందు వల్లనే నెహ్రూబాబాయి జన్మదినోత్సవంనాడు బాలబాలికలంతా వేడుక జరుపుకొంటారు.

మన దేశం విడిచి, విదేశాలు వెళ్లినప్పుడు కూడా నెహ్రూ చాచాకు 'స్వాగతం' చెప్పేది పిల్లలే నట. కొన్నిచోట్ల పెద్దవాళ్లు ఎందరు వస్తే, పిల్లలూ అంతేమంది వచ్చేవారట. నెహ్రూగారు అక్కడ కూడా పిల్లలను దగ్గరకు తీసికొని, సరదాగా వాళ్లాడి పంపేవారట.

మనల్ని మన తమ్ముళ్లను, చెల్లాయిలను అంతగా ఆదరించిన బాబాయి నెహ్రూ ఈనాడు మన మధ్యన లేరు. మనల్ని ఎంతగానో ప్రేమించిన చాచా మనల్ని విడిచిపెట్టి ఎక్కడికో వెళ్లి పోయాడు! మళ్లీ తిరిగి మన మధ్యలోకి రాడు.

ఆరోజున నెహ్రూజీ ఎక్కడికో వెళ్లిపోయా డని మన పెద్దవాళ్లందరూ కళ్ల నీళ్లు పెట్టుకొన్న రోజున, మనం కూడా బాధపడ్డాం. ఆయన ఇంకా మనకు కనుపించడు, ఇక మనల్ని పలక రించడు'' అని మనస్సులో అనుకొన్నాం. అదీనిజమే!

మరి, ఆయన మన మధ్య ఉండేరోజుల్లో — మనమంటే అంతగా ప్రేమించాడుకదా! .... మనం ఆయనకు తిరిగి ఏం చేయకలుగుతాం ?

ఆయనకు మనం చేయగలిగింది ఏముంటుంది? పైగా, ఏమయినా చేద్దామని ఒకవేళ అనుకొన్నా ఆయన ఇక్కడ లేరు. కాని మనం చేయగలిగింది మరొకటి ఉంది .... ఆయన కొన్ని మంచి మాటలు చెప్పాడు. మనకూ, మన పెద్దవాళ్లకూ కూడా చెప్పాడు. అభివృద్ధి సాధించాలని ఇతరులకు అపకారం చేయరాదనీ .... ఇలాంటివి. ఆయన చెప్పినదాన్నే మనము కూడా ఆచరిస్తే, అంతకన్నా కావలసింది వేరే ఏముంటుంది ?

## ఇవాళ పండుగ

ఆగస్టు 15 వ .... స్వాతంత్ర్యదినోత్సవం వేడు కగా జరుపుకొంటున్నాం. నెహ్రూ చాచా చెప్పినట్లు, స్వాతంత్ర్యం ప్రతి దేశానికీ ఎంతో ముఖ్యం. పైగా, ఈ స్వాతంత్ర్యం రావటానికి ఆయన ఎన్ని కష్టాలు పడ్డారో, ఎన్నిమార్లు జైలుకు వెళ్లారో లెక్కేలేదు. అందువల్ల ఈ స్వాతంత్ర్యాన్ని మనం కాపాడుకోవటం కూడా నెహ్రూ చాచా చెప్పిన మాటల్లో ఒకటి ....!

''మేం పిల్లలం .... మేం ఏం చేయగలుగుతాం?'' అని అడగవచ్చు మీరు. మీరంతా తుపాకులు పట్టు కొని సరిహద్దులలో కాపలా కాయలేకపోవచ్చును. కానీ, ఇప్పటినుంచీ బుద్ధిగా చదువుకొని, ఇంట్లో అమ్మా, నాన్నా చెప్పినమాట విని, మంచి పౌరు లుగా తయారయితే .... మీలో అందరూ అలాంటి వారయిననాడు మన దేశానికి అంతకన్నా ఏంకావాలి?

ఏమయినా,—

ఇవ్వాళే దీక్ష బూనండి. నెహ్రూ బాబా లాగా చక్కగా చదువుకుంటామని, మంచి అల వాట్లు నేర్చుకొంటామని, దేశాన్ని ప్రాణంతో సమానంగా చూసుకొంటామని .... దీక్ష బూనండి!

''విప్ర''






'కారకూష్' కైరోలో న్యాయాధి పతిగా పనిచేసేవాడు. ఇది చాలాకాలం కిందమాట. అతను అధికారంలో ఉండగా ఒకరోజు — నిజానికి రాత్రిపూట అనుకోండి! — ఒకరి ఇంట్లో దొంగపడ్డాడు. కిటికీ లోంచి గదిలోపలికి ప్రవేశించ పోతూ, కిటికీ ఊచలు కొన్ని విరిగి పోవటం చేత, కింద పడ్డాడు. పడి కాలు విరక్కొట్టుకున్నాడు. అయితే తప్పించుకుని పోగలిగాడు. తప్పించు కున్నవాడు ఊరికే ఉండకుండా కుంటుకుంటూ కారకూష్ దగ్గరి కెళ్లాడు. "ప్రభువుగారూ!" అన్నాడు. "నా వృత్తి దొంగతనం నిన్న ఒక ఇంట్లోకి జొరబడ్డాను. కిటికీ తెరవపోతూ ఉండగా ఊచలు విరిగి లోపలికి పడ్డాను. కాలు విరి గింది. ఇదీ సంగతి!"

కారకూష్‌కి కోపం వచ్చింది. ఇంటియజమానిని రప్పించాడు. ''ఇదుగో ఇంటాయనా! ఏమిటి దంతా? దొంగ కాలు విరిగేటంత బలహీనంగా కట్టించావేమిటి కిటికీని?" అని కోప్పడ్డాడు.

కారకూష్‌తో వాదిస్తే ఏ మవు తుందోనని ఇంటి యజమాని ఇలా అన్నాడు. "ప్రభూ! ఇది నా తప్పు కాదు. అంతా ఆ వడ్రంగి చేసిన పని కూలి సరిగ్గా ఇచ్చినా కిటికీ గట్టిగా కట్టలేదు చూశారా?"

"అయితే వడ్రంగిని రప్పిం చండి!" అని గర్జించారు కార

వడ్రంగి రానేవచ్చాడు. ఆరోపణ విన్నాడు. విని ఇలా విన్నవించుకున్నాడు: ఊచలు బిగిస్తూ ఉండగా

## ఈ జిప్త కథ

దారిలో ఒక అందమయిన అమ్మాయి, ఒక అందమయిన ఎర్ర వస్త్రం వేసుకుని వెడుతోందిట. దానితో





...

కారకూష్ ఆ అమ్మాయి కోసం వెతికించి, తెప్పించాడు. అ అమ్మాయి ఇలా చెప్పుకుంది:

"కారకూష్ ప్రభువుగారూ! నా అందం, నేను ధరించిన ఎర్ర వస్త్రం అందం ఈ ప్రమాదానికి కారక లంటున్నారు. నాకు అందం ప్రసాదించినది అల్లా! ఈ వస్త్రానికి ఎర్ర రంగు వేసినవాడు మా చాకలి. అంతకన్నా నేనేమీ ఎరగను!"

సరే, రంగు వేసిన చాకలిని పిలుచుకువచ్చారు;

"దుర్మార్గుడా నీ ఎర్రరంగువల్లనే కదా, ఈపడ ధరించిన వస్త్రం చూసి సరిగ్గా పనిచెయ్యలేని వడ్రంగి కిటికీ ఊచలు ఊడి దొంగ కాలు విరిగింది!" అని ఉరిమారు కారకూష్‌గారు.

చాకలివాడికి నోటిమాట రాక నుంచుండిపోయాడు. "తీసుకుపోయి ఉరితియ్యండి ఊ!" అని అరిచారు న్యాయాధిపతిగారు,

భటులు అతన్ని ఉరిస్తంభం దగ్గరికి తీసుకుపోయారు. కానీ అతన్ను అతి పొడగరి అవటంచేత వేళ్లాడతీయటం కష్టం అని తేలింది. కారకూష్ దగ్గరికి వెళ్లి తమని ఎదుర్కొన్న సమస్యని వివరించారు.

"ఛీ! ఛీ! దీనికా ఇంత ఆర్భాటం? పొట్టిగా ఉండే ఓ చాకలివాడిని తెచ్చి ఉరితియ్యండి!" అన్నారు కారకూష్ ప్రభువుగారు చిరాగ్గా!

రక్షకభటులు అలాగే వీధులు వెతికి పొట్టిగా ఉన్న చాకలిని తెచ్చి ఉరితీశారు.

ఇప్పటికీ కారకూష్ తీర్పుల్ని గురించి ఈ జిప్తులో తరచుగా చెప్పుకుంటూ ఉంటారు.



# నమ్మతారా? వినారు?



రుక్మ, కృష్ణ ... ఇవి రెండు పులిపిల్లలు. అందంగా, తెల్లగా వుంటాయి. ఢిల్లీలో వుండే యివి, ఒక ఆడమేక, మరో మేకపిల్ల, ఒక మానవునితో కలిసి మెలిసి వుంటున్నాయి! ఎంత చిత్రమైన కుటుంబం ఇది! ఆ మానవుడు కూడా ఎవరో కాదు; ఢిల్లీలోని 'జూ' అధిపతి ఆయన. పేరు డాక్టర్ హుస్సేన్

★

ఈఫొటోలో కనుపించే డాక్టర్ హుస్సేన్ యీ విచిత్ర కుటుంబంయొక్క అధిపతులు. పులిపిల్లలనూ, మేకపిల్లనూ ఒకచోట పెంచుతున్న ఘనత ఆయనకే దక్కాలి!





'జూ'లోని ఆపరేషన్ థియేటర్ లోనే యీ కుటుంబం నివాసం. మేకపిల్ల, పులిపిల్ల కలసి మేకదగ్గర పాలు తాగుతున్న దృశ్యం. అంతే కాదు, ఇవన్నీ కలిసి ఆడుకుంటాయి, నవ్వుకొంటాయి, పాడుకొంటాయి ప్రతిరోజూ ఆశ్చర్యంగా లేదూ. ★



## జరిగిన కథ

అదృష్టం వున్నా, ఆనందానికి నోచుకోని వృద్ధ మూర్తి సుబ్బయ్య. బదిలీ అయిన వ్యవసాయ డెమాన్‌స్ట్రేటర్ రామారావుకు వాళ్ళింట్లో గది అద్దెకు దొరుకుతుంది. విపరీత పరిస్థితుల్లో తారసపడిన ప్రసాద్‌ని దుర్గయ్య ఆదరిస్తాడు. అనుకోకుండా అటవికి విమల, కమలలతో పరిచయమౌతుంది. రామారావు గీసిన చిత్రాలను విమల మెచ్చుకొంటుంది. కమలను చూచిన ప్రసాద్ ఆమెమీదనే తన దృష్టిని లగ్నం చేస్తాడు. రామారావుకు హిందీ నేర్పటానికి సుబ్బయ్యగారు, విమలను నియోగిస్తారు. కమల, ప్రసాద్‌లు సన్నిహితులవుతారు. కాని, ఆమాట విని, సుబ్బయ్యగారు మండిపడ్తారు—కమల మనస్సును మార్చటానికి ఆయన ప్రయత్నం ప్రారంభిస్తాడు. ప్రసాద్ సాహసంచేసి గోడదూకి కమలను కలిసికొన్నా, ఇంతలో రవికుమార్ రావటంవల్ల, మాయోపాయంతో వీధిలోకి రాగలిగాడు. రామారావు విమలను వివాహం చేసికొంటానంటాడు. సుబ్బయ్యగారింట్లో జరిగిన దొంగతనానికి—కమల ప్రసాద్‌ను అనుమానిస్తుంది. దొంగ ఆచూకీ తీయాలని ప్రసాద్ ప్రయత్నాలను ప్రారంభిస్తాడు. దొంగ ఆచూకీ తెలుస్తుంది. కమల, తాను ప్రసాద్‌ను అపార్థం చేసికొన్నందుకు విచారిస్తుంది.

## 18

దుర్గయ్య గదిలో గాఢ నిద్రలో వున్న ప్రసాద్‌ని బుచ్చిశాస్త్రి, దుర్గయ్య ఎంత లేపినా మెలుకువ రాలేదు. అప్పటికి మధ్యాహ్నం రెండు గంటలయింది. తెల్లవార్లూ, దొంగని పట్టుకోడం, కార్లో రామారావు గారితో రామనగరం రావడం, పోలీసు స్టేషనులో రిపోర్టివ్వడం మొదలైన పన్లతో నిద్ర లేక పోవడం వలన, పొద్దున్న ఎనిమిది గంటలకు, దుర్గయ్య గారి గదిలో ప్రక్క మీదకు శరీరం వాల్చిన ప్రసాద్ అప్పటి నుంచి ఈ ప్రపంచాన్ని పూర్తిగా మర్చిపోయాడనడంలో అతిశయోక్తి లేదు.

పది గంటల బండి వచ్చే సరికి రామనగరం స్టేషనంతా కల కలలాడుతూండడం, స్టేషన్‌కి సుబ్బయ్యగారు, బుచ్చిశాస్త్రితోసహా వచ్చి, రైలులో వచ్చిన ప్రముఖ వ్యక్తులు, రామయ్య గార్ని, ఆయన భార్యనీ, ఆయన పుత్ర రత్నాన్ని ఆహ్లాదంతో, ఆనందంతో తమ ఇంటికి తీసుకు వెళ్ళి, వాళ్ళకు బ్రహ్మాండంగా మర్యాదలు చెయ్యడం, బుచ్చిశాస్త్రి రామయ్య గారి పుత్ర రత్నాన్ని చూశాక దుర్గయ్య చెవులో పది నిముషాలు రహస్యంగా మాట్లాడడం తరువాత దుర్గయ్య "ఇదిగో ఇప్పుడే పంపిస్తా" ననడం, తరువాత బుచ్చిశాస్త్రి పెళ్ళి వారితో సుబ్బయ్య గారింటికి వెళ్ళడం, ప్రసాద్‌కు తెలిసే అవకాశం ఎంత మాత్రమూ లేకుండా చేసింది నిద్ర.

తరువాత మళ్ళీ రెండు గంటలకు, బుచ్చిశాస్త్రి దుర్గయ్య వద్దకు వచ్చి, పెళ్ళి కూతుర్ని చూసుకోడానికి నాలుగు గంటల తర్వాత డావుందని, అంత

వరకూ పెళ్ళివారు విశ్రాంతి తీసుకుంటారని చెప్పాడు. దుర్గయ్య బుచ్చిశాస్త్రితో తను చెయ్య వలసిన ఏర్పాట్లన్నీ చేశా నన్నాడు.

"తమ్ముణ్ణి లేపాలంటారా ?" అనడిగారు దుర్గయ్య.

"లేపితే మంచిదే. అతను కూడా జరగబోయే దంతా చూడాలి."

"సరే అయితే పదండి లేపుదాం."

అని ఇద్దరూ వెళ్ళి, ఒక అరగంట కష్టపడి ప్రసాద్‌ని లేపారు.

"లేవోయ్, తమ్ముడూ. మంచి వింతొకటి జరుగబోతోంది. చూడ్డవు గాని." అన్నాడు దుర్గయ్య. ప్రసాద్, "ఉ, హు, హూ," అని ఇంకా ముడుచుకు పడుకున్నాడు.

"లేవయ్యా. నువ్వు దొంగల్ని పట్టుకున్నావని, ప్రభుత్వము వారు నీకు పరమ వీర చక్రాన్ని బహు కరిస్తారట." అన్నాడు బుచ్చిశాస్త్రి.

"ఊహూ ! నాకక్కర లేదు. నన్ను నిద్ర పోనివ్వండి," అని కాస్త ఒత్తిగిల్లి పడుకున్నాడు ప్రసాద్.

"పోనీ, కమల వుత్తరం రాసింది. అదీ అక్కర్లేదా ?"

"ఆ !" అంటూ లేచి, ప్రసాద్, "ఏదీ ?" అని అడిగాడు.

"ఇదిగో !" అని బుచ్చిశాస్త్రి, మడతలు పెట్టిన కాగితాన్నిచ్చాడు ప్రసాద్ చేతికి. ప్రసాద్, అది విప్పి చదువుకుని, "ఛా ! ఇదేమిటండీ, ఏదో ఏదో జాతకం కాగితం ఇచ్చారూ ?" అన్నాడు.

"ఆ ! జాతకం కాగితమా ?" అని ఖంగారుగా బుచ్చిశాస్త్రి ఆ కాగితం తీసుకుని చూశాడు. చూడగానే, "అరెరె ఎంత పొరపాటయింది. కాగితాలు తారుమారు అయ్యాయి. ఈ కాగితం ఇస్తున్నా ననుకొని, కమల వుత్తరం ఇచ్చేశాను." అన్నాడు.

"ఎవరికి ?" అని అడిగాడు దుర్గయ్య.

"సుబ్బయ్య గారికి." అన్నాడు బుచ్చిశాస్త్రి.

"ఆ !" "కొంప మునిగింది" అన్నారు దుర్గయ్యా, ప్రసాద్. "ఆయనది చూసి ఏమీ అనలేదూ ?" అనడిగారు. బుచ్చిశాస్త్రి జ్ఞాపకం తెచ్చుకుంటూ, "ఆ కాగితం విప్పనైనా విప్పకుండా అలాగే పంచాంగంలో పెట్టేశారు. ఆ పంచాంగం టేబిలు మీద వుంచి అందరూ భోజనాలకి లేచారు." అని, "సరే నేను వెళ్ళి మెల్లిగా ఆ పంచాంగం, ఎక్కడ వుందో చూసి, వాళ్ళకనుమానం లేకుండా ఆ కాగితం బదులు ఈ కాగితం పెట్టి వస్తాను." అని బుచ్చిశాస్త్రి సుబ్బయ్య గారింటికి బయల్దేరాడు. ప్రసాద్, "హు !" అనుకుంటూ లేచి దుర్గయ్యతో కలిసి హోటలులోకి వెళ్ళాడు.

బుచ్చిశాస్త్రి, సుబ్బయ్య గారింటికి వెళ్ళి, పంచాంగం కోసం వెదుక నారంభించాడు. కానీ ఎక్కడా కన్పించ లేదు. చివరికి సుబ్బయ్య గార్ని అడుగగా, "ఇందాక రామయ్య గారడిగి తీసుకున్నారు. హాలు ప్రక్క గదిలో నిద్రపోతున్నారు. అక్కడికి వెళ్ళి వెదకండి" అన్నారు. బుచ్చిశాస్త్రికి ముచ్చెమటలు పోశాయి. రామయ్య గారి చేతిలో ఆ వుత్తరం పడితే ఇంకేమన్నా వుందా ? ఏమైనా ఇప్పుడింక జడిసి లాభం లేదని, రామయ్య గారు పడుకున్న గదిలోకి వెళ్ళాడు, ఎలాగో ధైర్యం చేసి.

మంచం మీద రామయ్య గారు కూర్చున్నారు. ఆయనకు ఏభై అయిదేళ్ళుంటాయి. పల్లగా, లావుగా వుంటారు. తలంతా నెరిసింది. ఆయన చేతిలో ఏదో పుస్తకం వుంది. గదిలో వేరు వేరు మంచాల మీద ఆయన భార్యా, కొడుకూ నిద్రిస్తున్నారు. బుచ్చిశాస్త్రి ఆయనకు దగ్గరగా వెళ్ళే సరికి, ఆయన చదువు తున్నది, పంచాంగమేనని గ్రహించాడు. అతనికి గుండెల్లో దడ పుట్టింది. ఒకసారి కళ్ళు మూసుకుని, మళ్ళా తెరచాడు.

"ఒకసారి ప — ప్పంచాంగం ఇస్తారా ?"

"ఏమిటి ?"

"ప్ప—ప్ప—ప్పంచాంగం ?"

"ఇదిగో తీసుకోండి !" అని రామయ్య గారు తన చేతిలోవి పంచాంగం ఆయన కిచ్చారు. అది తీసుకుని ఒక్క అంగలో బయట పడ్డారు బుచ్చిశాస్త్రిగారు. ప్రక్కగదిలోకి తీసుకు వెళ్ళి, పేజీ పేజీ కూడా తిప్పి వెదికారు. కాని ఆ పంచాంగంలో కమల ప్రేమలేఖ లేదు. బుచ్చిశాస్త్రి గారికి రామయ్య గారు తీసారేమోనని భయమేసింది. ఇంతలో సుబ్బయ్యగారేదో పని మీద పిలవడం వల్ల శాస్త్రి గారాయన వద్దకు వెళ్ళి పోయారు.

కమల ఉత్తరం మీద ఆశతో లేచిన ప్రసాద్, మరి పడుకోలేదు. మెల్లిగా అతను మొహం కడుక్కుని బయల్దేరి దుర్గయ్య హోటలు లోకి వెళ్ళి, కొద్దిగా టిఫిన్ చేసి కాఫీ తాగబోతూండే సరికి మూడు గంటలైంది. కాఫీ త్రాగుతూ దుర్గయ్యను "అయితే ఇంతకీ కమల పెళ్ళి కొడుకు సంగతేం చేశారూ ?" అని అడిగాడు.

"అదే ఆలోచిస్తున్నాం. కాళ్ళూ, చేతులు విరగ్గొట్టే చాలా ? గాడిద మీద వూరేగింపు కూడా అవసరమా ? అని చూస్తున్నాం."

"నా మట్టుకు నాకు, వాడి పీక అందియ్యండి చాలు."

"అలాగే. అంతే గాని వూరికే వదిలి పెట్టంలే. నువ్వు ప్రేమించిన పిల్ల ఇంకొకణ్ణెలా వివాహం చేసుకుంటుందిలే ?" అని, రోడ్డు వైపు చూస్తూ "ఎవరు చెప్మా ఈ సూట్కూ, బూటూ ?" అను అనుకున్నాడు దుర్గయ్య. ప్రసాద్ కూడా అటు వైపు చూశాడు. వస్తున్న వ్యక్తి, అప్పుడే పట్టాలు దాటి ప్లాటుఫారం ఎక్కబోతున్నాడు. అతనివి చూడగానే ప్రసాద్, గభాలున లేచి నిలబడ్డాడు; ఒక్క అంగలో హోటలు లోపలికి వెళ్ళాడు. అతని ప్రవర్తన అర్థం కాక దుర్గయ్య కూడా అతనితో లోపలికి వెళ్ళి, "ఏం, తమ్ముడూ, ఎవరది ?" అని అడిగాడు. ప్రసాద్ మెల్లిగా జారుకుంటూ, "మా అన్నయ్య ! ఏమైనా అడిగితే మీకేమీ తెలియదని చెప్పండి. నన్నెరుగనట్టే మాట్లాడండి. నేను గదిలోకి వెళ్ళి పోతాను." అని వెళ్ళి పోయాడు.

దుర్గయ్య మళ్ళీ హోటలు లోకి వచ్చే సరికి, ప్రసాద్ అన్న సుధాకర్ వచ్చి ఒక కుర్చీలో కూచొని, కాఫీకి ఆర్డరిచ్చాడు. దుర్గయ్య అతని వైపు చూసి అందంగానే వున్నాడను కొన్నాడు. అతనిని తనే పలకరిద్దామని వుంది గాని, ప్రసాద్ గురించి అడుగుతాడేమో ? అని భయం వేసి మానేశాడు. ప్రసాద్ తన గురించి ఏమీ చెప్పద్దు అని అన్నాడు గాబట్టి, దుర్గయ్య ఏమీ చెప్పదల్చుకోలేదు.

సుధాకర్, "దుర్గయ్య గారంటే మీరేనా ?" అని అడిగాడు.

"అవును" అన్నాడు దుర్గయ్య, తన పేరెలా తెలిసిందా ? అని ఆశ్చర్యపోతూ.

"ప్రసాద్‌తో చెప్పండి. వాడిష్ట ప్రకారమే చెయ్యడానికి సిద్ధంగా వున్నానని చెప్పండి. అమ్మ, వాడి కోసం బెంగ పెట్టుకుంటోందని, ఇక్కడికి వచ్చిందనీ చెప్పండి. సాయంకాలం అమ్మని తీసుకొస్తాను."

"ప్రసాదా ?" అన్నాడు దుర్గయ్య — ఒక వైపు సుధాకర్ మాటలకు కరిగి పోతూ — మరొక వైపు ప్రసాదిచ్చిన హెచ్చరిక జ్ఞాపకం తెచ్చుకుంటూ.

"అవును ప్రసాదే ! రామారావు గారు నాతో అంతా చెప్పారు. మీ మేలు మర్చిపోలేం. తక్కిన మాటలు అమ్మ చెప్తుంది." అన్నాడు సుధాకర్ నవ్వుతూ.

"సరే !" అన్నాడు దుర్గయ్య ఇంకేమీ అనలేక తనూ నవ్వుతూ. తరువాత దుర్గయ్యా, సుధాకర్ చాలాసేపు మాట్లాడు కున్నారు.

## 19

నాలుగు గంటలు కొట్టింది సుబ్బయ్య గారి హాల్లో గడియారం.

రామయ్య గారూ, వారబ్బాయి, వచ్చి సోఫాలో కూర్చున్నారు. సుబ్బయ్య గారు వారి కెదురుగా కూర్చొని మాట్లాడ సాగారు.

"అయితే ఇహ రాహుకాలం దాటిపోయి నట్టేనా ?" అని బుచ్చిశాస్త్రి నడిగారు సుబ్బయ్య గారు.

"ఓ ! నిస్సందేహంగా." అన్నాడు బుచ్చిశాస్త్రి.

"సరే. అమ్మాయిని తీసుకు రమ్మనండి" అన్నారు సుబ్బయ్య గారు.

"అలాగే" అని లోపలికి వెళ్ళాడు బుచ్చిశాస్త్రి. లోపల ఆడ వాళ్ళంతా మాట్లాడు కుంటూంటే, బుచ్చిశాస్త్రి వెళ్ళి, "అమ్మాయిని తీసుకు రమ్మంటున్నారు." అని చెప్పాడు.

ఆడ వాళ్ళంతా కొంచెం ఆశ్చర్యం కనపర్చారు. విమల, "అదేమిటండీ ? నాలుగున్నర దాకా రాహుకాలం వుందన్నారు ?" అంది.

"అబ్బే రాహుకాలం నాలుగింటి వరకేనమ్మా."

"అరెరె ! అయితే మేము పొరపాటున విప్పట్లేదు. అయితే జడా అదీ వేసి ముస్తాబు చేస్తాం. వుండండి." అన్నారు విమలా, జగదాంబ గారు.

బుచ్చిశాస్త్రి గారు హాల్లోకి వచ్చి ఆ విషయం చెప్పారు.

ఈ లోపల కాఫీ, టిఫిన్ తీసుకుని విమల వచ్చింది.

రామయ్య గారు, "మీ చిన్నమ్మాయి బాగా పాడుతుందట ?" అన్నారు.

"అవునండి." అన్నారు సుబ్బయ్య గారు.

"మావాడు మీ అమ్మాయిని, ఇక్కడ చూసిన తరువాత చాలా పొగుడ్తూ చెప్పాడు. చాలా తెలివైనదని కూడా చెప్పాడు."

"ఏమిటీ ? మీ అబ్బాయి, మా అమ్మాయిని, ఇక్కడ చూశారా ?"

"అవును. మీకు తెలిసుండదు లెండి. మావాడు

# మనసున మల్లెలు

ఈ ప్రాంతాల్లో సేల్సుమాన్‌గా పని చేశాడు. ఆరు నెలలు. తరువాతే బ్రాంచి మేనేజరుగా దక్షిణాది పంపించాను. ఈ విషయం నేను మీతో చెప్పలేదు, అందుకని మీకు తెలియదు.'' అన్నారు రామయ్యగారు.

"అలాగా ? ఆ సంగతి నాకు తెలియదు సుమండీ. మీ అబ్బాయిని ఎక్కడో చూసినట్లుందని అనుకుంటున్నాను గాని, ఇక్కడ పని చేశారని నేనను కోలేదు.'' అన్నారు సుబ్బయ్య గారు. "తమాషాగా వుంది.'' అని కూడా అన్నారు.

"నా సంగతి మీకు తెలుసుగా ? వ్యాపారం వాడి కప్ప చెప్పే ముందు, గుమస్తా పని మొదలు, జనరల్ మానేజర్ పని దాకా అన్నీ తెలిసి వుండ వలసినవే నని అన్నిట్లోనూ, తర్ఫీదు ఇస్తున్నాను. విశాఖ పట్టణం 'హెడ్ క్వార్టర్సు' చేసుకుని ఈ ప్రాంతా లన్ని తిరుగుతూ వ్యాపారం చేశాడు.''

సుబ్బయ్య గారు, రామయ్య గారి అబ్బాయి వైపు తిరిగి, "అయితే మా ఇంటికి ఒక్కసారైనా రాలేదేమండీ ? '' అని అడిగారు.

రామయ్య గారబ్బాయికి వయస్సు పాతికేళ్లుం టాయి. కొద్దిగా పొట్టిగా, వుంటాడు., ఉంగరాలు తిరిగిన జుట్టు, కోల మొహం; కళ్లు కొంచెం పెద్దవిగానూ అమాయకంగా వున్నట్లు కన్పించినా ఆ అమాయకత నిజమైనదేనా ? అన్న అనుమానం కన్పిస్తుంది అతని చూపూ, నవ్వులోనూ. తనకి ఈ సంభాషణ అంతగా రుచించి నట్టులేదు. "పని వత్తిడిలో రాలేక పోయానండీ.'' అన్నాడు.

సుబ్బయ్య గారు, "అవునవును. పోనీలెండి ఇంక ఆ చింత వుండదు.'' అన్నారు నవ్వుతూ. అప్పటికి కాఫీలు, టిఫిన్లూ, పూర్తయ్యాయి. తాంబూలం తెచ్చిఇస్తున్న విమలతో, "చిన్నను తీసుకురావమ్మా!'' అన్నారు సుబ్బయ్య గారు.

"ఇదిగో పిలుస్తున్నా నాన్నా '' అని విమల లోపలికి వెళ్లింది.

ఇంతలో బయట నుండి, "సుబ్బయ్య గారూ !'' అన్న పిలుపు విన్పించింది.

ఎవరా ? అని సుబ్బయ్య గారు వీధిలోకి వెళ్లే సరికి, తన ఇంటి ముందు సుమారు పది మంది పెద్ద మనుషులు నిల్చొని వుండడం కన్పించింది. అందులో రాజుపేటలో రామావతారం గారూ, ఇంకా రాజుపేటకు చెందిన లక్ష్మయ్యా, శివరావూ, కష్ణంరాజు మొదలైన సంపన్నులూ, రామనగరం లోని కొందరు పెద్ద మనుషులూ, దుర్గయ్యా, వామన మూర్తి, నాగలింగం మొదలైన వారంతా వున్నారు. అందరిలోకి పెద్దయిన కష్ణంరాజు గారు "సుబ్బయ్య గారూ ఇలా రండి '' అని పిల్చారు. వీరంతా తన వద్దకు ఏదో వ్యవహార విషయంలో వచ్చారనుకొని, సుబ్బయ్య గారు, "ఓహో ! కృష్ణంరాజు గారా ! మా అమ్మాయికి పెళ్లివారు వచ్చారు. ఒక గంట తరువాత నాకు వీలవుతుంది.'' అన్నారు.

"మేమూ పెళ్లి వారి గురించే వచ్చాము. మీరు అల్లుణ్ణి చేసుకోవాలనుకుంటున్న వ్యక్తి, మా రామావతారం గారమ్మాయిని మోసం చేసిన మనిషి ఒక్కరేనని మా కనుమానంగా వుంది. ఒకసారి వారిని బయటకు పిలిపించండి.''

"అబ్బే ఏది పొరపాటు. మా ఇంటికి వచ్చింది,

రామయ్య గారని గొప్ప వ్యాపారస్తులు. వారి అబ్బాయి మీరనుకున్న వ్యక్తి కాదు. కావలిస్తే వచ్చి చూడండి" అన్నారు సుబ్బయ్య గారు.

కృష్ణంరాజు గారూ, రామావతారం గారూ, సుబ్బయ్య గారితో లోపలికి వెళ్లారు. తక్కిన వారంతా బయట నిలబడ్డారు. హాలులో సోఫా మీద కూర్చున్న రామయ్య గారి అబ్బాయిని చూస్తూ "అతనే నండీ, సందేహం లేదు." అన్నారు రామావతారం గారు. ఆయన్ని చూడగానే, ఆ యువకుని మొహం పాలి పోయింది. రామయ్య గారి వ్యక్తుల్ని చూసి, "ఏమిటిది ?" అని అడిగారు.

"అయ్యా ! పెద్దలు. క్షమించాలి. మీ అబ్బాయి రెండు నెలలు క్రితం ఈ ప్రాంతాల్లో తరుచూ తిరుగుతూన్నప్పుడు, మా ఇంటికి వస్తూండేవాడు. మాకొక పద్దెనిమిదేళ్ల అమ్మాయుంది. ఆ అమ్మాయిని వివాహ మాడుతానని నమ్మించాడు... పిల్లిద్దరూ చాలా ప్రేమ లేఖలు రాసు కున్నారు. అతని తల్లి దండ్రుల వివరాలు మాకు సరిగా చెప్ప లేదు. తీరా మేము అతన్ని గట్టిగా అడిగి మీకు వుత్తరం రాద్దామనుకునే సరికి అతను మరి కన్పించ లేదు. మేము అప్పటి నుండి ఇతను గురించి ప్రయత్నిస్తున్నాం కానీ, మాకేమీ అంతు చిక్కలేదు. ఇవాళ ప్రొద్దున్న ఇతను వచ్చాడని, మా నగరం మనుషులు మాకు వచ్చి చెప్పేసరికి పరిగెత్తుక వచ్చాం. మేము చెప్పేది నిజమౌనో కాదో అతని నడగండి." అని రామావతారం గారు చెప్పే సరికి, రామయ్యగారూ, సుబ్బయ్యగారూ విభ్రాంతు లయ్యారు. గది గుమ్మందాకా వచ్చిన కమల, విమలా, కూడా ఈ మాటలు విన్నారు. రామయ్య గారబ్బాయి తల వంచుకుని కూర్చున్నాడు.

"మీరు చెప్పేది నాకు సరిగ్గా బోధ పడలేదు' మా అబ్బాయి, మీ అమ్మాయిని వివాహం చేసు కుంటా నన్నాడా ? " అని అడిగారు రామయ్య గారు మెల్లగా.

"అవును. అతను రాసిన లేఖలు మా వద్ద వున్నాయి. మీ అబ్బాయినే అడగండి." అన్నారు రామావతారం గారు. ఆయనకు ఏభై ఏళ్లుంటాయి. పంచె లాల్చీ, వేశారు. లావుగా, ఎర్రగా వుండి మున్సని గుండు మీద పిలకా, నుదుట నామం ఛాందసంగా కన్పిస్తారు.

రామయ్యం గారు కొడుకు వైపు తిరిగారు. "నువ్వే మంటావ్ !" అని అడిగారు.

ముందు అతనేమీ మాట్లాడ లేదు. తరువాత "నిజమే !" అన్నాడు.

రామావతారం గారు, సుబ్బయ్య గారి వైపు, రామయ్య గారి వైపూ చూశారు.

రామయ్య గారు ఒక్క నిముషం ఆలోచించారు. మరు క్షణంలో, "అయ్యా ! మీ అమ్మాయి, మా వాడికి నచ్చి, వివాహం చేసుకుంటానంటే మాకేమీ అభ్యంతరం లేదు. మావాడు అనవసరంగా నాదగ్గర భయపడి, విషయం దాచాడు. సరే ! ఇప్పుడే మీ ఇంటికి వెళ్దాం పదండి ఈ తాంబూలాలు అక్కడే పుచ్చు కుంటాం సుబ్బయ్య గార్ని క్షమాపణ వేడుకుంటాం." అన్నారు రామయ్య గారు. అందరూ ఆయన్ని మెచ్చు కున్నారు.

"మీరింత సహృదయులనుకోలేదు. ఇంటి సిద్ధంగా వుంచి, మా ఇంటికి దయచెయ్యండి." అన్నారు రామావతారం గారు.

వెంటనే సుబ్బయ్య గారి వద్ద సెలవు తీసుకుని రామయ్య గారూ, ఆయన భార్యా, వారబ్బాయీ, రాజాపేట వెళ్లి పోయారు. సుబ్బయ గారింటికి వచ్చిన, దుర్గయ్యా మొదలైనవారు అంతా, పెద్ద దెబ్బలాట జరుగుతుందనుకొన్న వారంతా ఈ విషయం త్వరితంగా తేలి పోయినందుకు సంతోషంగా వెళ్లి పోయారు. రామయ్య గారి కుటుంబం వెళ్లి పోయాక సుబ్బయ్యగా రొక్కరే ఆలోచిస్తూ కూచున్నారు. ఆయన చాలా విచారంగా వున్నారు. తను కమల గురించి వేసిన పథకమంతా భగ్నమై పోయింది.

ఆ సమయంలో హాలులోకి జగదాంబగారు వచ్చింది.

"జరిగిన దానికి విచారిస్తున్నారా ? " అని ఆమె అడిగింది.

"అబ్బే! కమలకు మళ్లీ ఇంకొక సంబంధం చూడా లని ఆలోచిస్తున్నాను" సుబ్బయ్యగారు.

"మీనాక్షమ్మగారి రెండో అబ్బాయి, ప్రసాద్, బి.ఏ. పాసయ్యాడు. కమల అతన్ని ప్రేమించింది. అతను కమలను ప్రేమించాడు"

"ఏమిటి మీరు అంటున్నది నిజమేనా?"

"అక్షరాలా నిజం"

"మరి కమల ఇంతకు పూర్వం ఎవరో పూరూ, పేరూ లేనివాణ్ణి ప్రేమించానంది?" అన్నారు ప్రశ్నార్థకంగా.

"ఆ ప్రసాదే, ఈ ప్రసాద్! అంతే కాకుండా మీ ఇంట్లో దొంగతనం జరిగినతరువాత, ఆ దొంగల్ని ఎంతో కష్టపడి పట్టుకున్నది కూడా ఇతనే" అని ఆమె జరిగినదంతా చెప్పింది. రామారావుగారు చెప్పినదానికీ ఆమె చెప్పినదానికీ సరిపోయింది. జగదాంబగారికి ఈ విషయమంతా వదిని చెప్పింది. ఆ రోజు ప్రొద్దున్నే ఇంట్లో ఆడవాళ్లకే విషయం తెలుసు.

ఇంతలో రవికుమార్, చిన్న పెట్టెతో ప్రవేశించాడు. అతను విశాఖ పట్నంనుంచి రైలులో అప్పుడే దిగాడు.

"నాన్నగారూ! రామయ్యగారూ వాళ్లూ వచ్చా రనుకుంటాను. ఏరీ వాళ్లు? కమలకు కాబోయే వరుడెలా ఉన్నాడు." అని హడావుడిగా అడుగ సాగాడు.

సుబ్బయ్యగారు సోఫాలో వెనక్కివాలి, కళ్లుమూసుకుని, "ఒరేయ్! మరి రామయ్యగారి వూసు నా వద్ద ఎత్తకు. కమలకు కాబోయే వరుడెలా ఉంటాడో సరిగా, చెప్పలేను గాని, అతని పేరు ప్రసాద్." అన్నారు.

రవికుమార్ ఆశ్చర్యంగా, "ఆ" అన్నాడు.

## 20

ఆరోజు సాయంకాలం చీకటి పడ్డాక, మీనాక్షమ్మగారూ, జగదాంబగారూ, వూళ్లోకి వెళ్లి వస్తామని ఇంట్లో చెప్పి కమలను తమతో తీసుకుని స్టేషను వైపు బయల్దేరారు. రామారావు విమలను వివాహం చేసుకుంటాననడం సుబ్బయ్యగారికి చాలా సంతోష ప్రదమైంది, అందువల్ల ఆ సమయంలో విమల రామారావుతో మాట్లాడుతూ మేడమీద ఉండి పోయింది కాబట్టి వీరు ముగ్గురూ వెళ్తూంటే వారితో బయల్దేరలేదు.

ముగ్గురూ దుర్గయ్యగారి హొటలు వద్దకు వెళ్లారు. వీరిని చూసి దుర్గయ్యగారు తబ్బిబ్బై పోయి, "దయ చెయ్యండమ్మా." అని ఆహ్వానించారు. హొటలులో ఎవరూ మగవాళ్లు లేరు. ఆయన దుర్గయ్య అని తెలిసాక జగదాంబగారు, "ప్రసాద్ ఎక్కడ?" అని అడిగారు.

"హొటలు వెనుక గదిలో ఉన్నాడు. వస్తారా చూపిస్తాను" అన్నాడు దుర్గయ్య.

జగదాంబగారు, "కమలా, నువ్వెళ్లి ప్రసాద్‌ని పిల్చుకురా. మీరు వెళ్లకండి దుర్గయ్యగారూ మీతో మాట్లాడాలి." అంది.

కమల , "నేనా!" అంది, కొంచెం బెరుకుగా.

"అవును. నువ్వే. వెళ్లమ్మా చాలా మంచి దానివి కదూ!"

కమల మెల్లగా బయల్దేరి, హొటలు వెనకాల ఉన్న గదివద్దకు వెళ్లి తలుపు తోసింది. జగదాంబ గారూ, మీనాక్షమ్మ దుర్గయ్యతో మాట్లాడ సాగారు.

పక్కమీద పడుకుని, సిగరెట్టు మీద సిగరెట్టు

1929 లో శ్రీ నెహ్రూ కాంగ్రెసు కార్యదర్శిగా ఉండగా శ్రీ శ్రీ ప్రకాశ ఆయన్ని చూడటానికి వెళ్లారుట. ఇవీ అవీ మాట్లాడుతూ శ్రీ నెహ్రూ అన్నారుట, "ఇంకొక పాతికరూపాయలు ఎక్కువ ఉంటే విదేశ ప్రముఖులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపగలిగి ఉంటాను కదా! వారి సానుభూతి మనకి లభిస్తుందికదా!" అని అప్పుడు వారితో గణేశ్ శంకర్ విద్యార్థి కూడా ఉన్నారు.

జవహర్‌లాల్ నెహ్రూ వద్ద సెలవు పుచ్చుకుని వచ్చేసినతర్వాత శ్రీ విద్యార్థి అన్నారుట: "జవహర్‌లాల్ తమాషాకి అనలేదుకదా! ఆయనకి నిజంగా పాతికరూపాయలు అవసరమా? నమ్మటానికి కష్టంగా ఉందే! బీదవాడిని నేనే ఏర్పాటు చెయ్యగలనే!"

కాని ఇద్దరికీ జవహర్‌లాల్ నెహ్రూకి సహాయం చేస్తామని చెప్పటానికి బెరుకుగా ఉండి అంత పని చెయ్యలేదు... ★




మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే
# టీ

సాటిలేని టీ!

### తాజా టీ
తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ
అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ
టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

## టాటా-ఫిన్లే టీ త్రాగండి;
## ఆనందము అందుకోండి!




ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్-సుందరమైన టిన్
లలిత్-బంగారు రంగు ప్యాకెట్
మిలాప్-వెండి రంగు ప్యాకెట్
షాన్-నీలి రంగు ప్యాకెట్




BI-TFN-5-TEL

కొలుస్తున్న ప్రసాద్, నైలాన్ చీరలో నిగనిగమెరుస్తూ, ఎర్రగా, సన్నగా మెరుపు తీగలా, విచ్చిన గులాబీలా, రెండు జడలతో, సిగ్గు పడుతున్న చెక్కిళ్లతో, కమల లోపలికి వచ్చే సరికి, గబుక్కున లేచి కూచుని, ఆమె వంక చూశాడు.

కమల తలవంచుకుని నిల్చుంది.

రెండు నిముషాలాగి, ప్రసాద్, "అబ్బ! ఎంత మంచి కల!" అనుకున్నాడు పైకి వినిపించేట్టు మాటాడుతూ.

"కల కాదు నిజమే." అంది కమల.

"అరే ! స్వప్నసుందరి మాట్లాడుతుందే?"

"నేను స్వప్న సుందరిని కాను, కమలను"

"ఇది స్వప్నం! నిజం అని నన్ను నమ్మించాలని చూస్తున్నావ్"

"స్వప్నం కాదు. కావాలంటే గట్టిగా గిల్లుకోండి"

"అయితే ఇలా రా!"

కమల కొంచెం ముందుకు వచ్చింది.

"నా ప్రక్కన కూచో!" కమల తల అడ్డంగా ఊపింది.

"ఏం?" అని అడిగాడు ప్రసాద్. కమల చెప్ప బోయింది.

"సార్!" అంటూ రామం కాఫీ కప్పులతో ప్రవేశించాడు.

"ఛ" అని కోపంతో రామంవైపు చూసాడు. "నిన్నెవరు రమ్మన్నారిక్కడికి?" అని కోపంగా అడిగాడు.

"మీరే కద సార్, ఇందాక కాఫీ తెమ్మన్నారు. అందుకని తెచ్చాను"

ప్రసాద్‌కు ఒళ్ళు మండింది. మంచి రసవత్తర కావ్యంలో రామాయణంలో పిడకల వేటలా, ఈ సమయంలో ఈ విఘాతం ఏమిటి? అయినా వచ్చినవాడు వెంటనే గ్రహించుకొని వెళ్లిపోవద్దూ. రామానికి బొత్తిగా బుద్ధి లేదు. అక్కడే నిలబడ్డాడు.

"రామం" అని పిలాడు ప్రసాద్.

"ఓయస్! యస్ సార్!"

"నీకోసం నళిని ఎదురు చూస్తూంటుందని తెలుసా?"

"ఎక్కడ సార్?"

"ప్లాట్‌ఫారంకి ఫర్లాంగు దూరంలో రైలు పట్టాలమీద కూచొని 'రామం నన్ను పెళ్లి చేసుకుంటాడా? చేసుకోడా? అని ఆలోచిస్తూ, 'చేసుకోక పోతే రైల్ళక్రింద తల పెట్టేస్తారు' అనుకుంటుంది"

"అరెరె! ఎలాసార్?"

"అందుకే తొందరగా పరిగెత్తి వెళ్ళు"

"సరే సార్!" అని పరిగెత్తాడు, రామం.

"లేకపోతే కాఫీట! కాఫీ! వీడి మొహం!" అన్నాడు ప్రసాద్.

కమల నవ్వుతూ, "కాఫీ త్రాగండి" అంది.

"కాఫీ సరే అనుకో. నీ కోపం పోయిందా?"

"నా ఉత్తరం చదివారుకా?"

"అప్పట్నుంచి నీ ఉత్తరం ఏమైందో తెలుసా?"

"చింపేశారా?" అంది చిరుకోపంతో కమల.

"చేతులు రాలేదు"

"పాపం! అంత జాలి కాబోలు"

"నేనప్పుడు, అసలు నా చేతిలోకి రాలేదని"

"అయితే ఏమయింది?"

"మా నాన్నగారి చేతిలో పడింది"

"ఆ!"

"అని బుచ్చి శాస్త్రి చెప్పాడు" అని ప్రసాద్ లేచి మెల్లగా ఆమె వద్దకు వచ్చి "ఇంకా భయమేనా?" అన్నాడు ఆమె గడ్డం, తన చేతితో పైకెత్తి.

"అదికాదు——"అని ఆమె ఏదో అనబోతూంటే "అయ్యగారూ!" అంటూ నళిని గదిలోకి ప్రవేశించింది. ఇద్దరూ గతుక్కుమన్నారు.

"ఎందుకొచ్చావు?" అని గద్దించాడు ప్రసాద్.

"ఏటీ లేదండి బాబూ. రామం గోరూ...."

"రామం, ప్లాటుఫారంకు ఫర్లాంగు దూరంలో రైలు పట్టాల దగ్గర నీకోసం ఎదురు చూస్తున్నాడు. ఆలస్యమైతే రైలు క్రింద తల పెట్టేస్తాడు"

"ఓ లమ్మో!" అని కేకేసింది నళిని.

"అందుకే పరిగెత్తి వెళ్ళు."

నళిని ఒక్క దూకులో పరిగెత్తి బయటకువెళ్ళి పోయింది.

"అబ్బబ్బ! ఏం లోకం ఈ పాడులోకం. ఇద్దరు ప్రేమికుల్ని మనసారా మాట్లాడుకోనియ్యదుకదా! అన్నీ విఘాతాలే! అసలు మనం కూడా అలా ఎక్కడి కైనా పోదాం పద!"

"ఎక్కడికి? ప్లాటుఫారంకి ఫర్లాంగు దూరం లోనా?" అంది కమల నవ్వుతూ.

"రైట్! అక్కడికే పోదాం."

"మరి వాళ్ళు"

"వాళ్ళు తూర్పుగా వెళ్తే, మనం పడమరగా వెళ్దాం"

"మరి వాళ్లకు ఎటో చెప్పారు కాదు. చెరోదిక్కూ వెళ్తే?"

"నిజం. మళ్ళీ వాళ్ళు ఒకరినొకరు కనబడక తిరిగి రావచ్చునిక్కడికే! తొందరగా పద"

బయట ఎవరోదగ్గినట్లయింది. ప్రసాద్ కోపంతో పిడికిళ్లు బిగించాడు, కళ్లెర్ర చేశాడు. కమల నవ్వ లేక నోటికి కొంగు అడ్డం పెట్టుకుంది.

సుధాకర్ ప్రవేశించాడు. ప్రసాద్ తెల్లబోయాడు.

సుధాకర్, "నీ ఉత్తరం పంచాంగంలో ఉంటే నేనే తీసాను. ఇదిగో" అని కమలకు ఉత్తరం ఇచ్చాడు. ప్రసాద్ వైపు చూసి , "మీ ఇద్దర్నీ అమ్మ రమ్మంటోంది." అని బయటకు వెళ్లి పోయాడు.

"అరెరె. అసలు మిమ్మల్ని పిలవడానికే వచ్చాను నేను" అంది కమల.

"అయితే పద! మనిద్దరం వెళ్ళి అమ్మకు నమస్కరిద్దాం" అని ఆమె చేతిని పట్టుకొని ప్రసాద్ దుర్గయ్య హొటలు వైపు వెళ్లాడు.

-అయిపోయింది




"ఈ నెల నుంచీ పొదుపు చేద్దాం అన్నావు కదా....ఇన్ని జాకెట్‌గుడ్డలు కొన్నావేమిటి!"

"పొదుపుచేద్దాం అన్నాను కాబట్టే.... ఇవి కొన్నాను! లేకపోతే, యీనెల మూడు చీరలు కొనుక్కుందామనుకున్నాను!...."

"మీకేం జబ్బు చేసింది ?"

"పక్షవాతం. ఈ స్వామి దయామయుడు. ప్రార్థనలు విన్నాడు."

"ఈవిడ మీకేమవుతుంది ?"

"మా ఆవిడ"

రావు వెంటనే మాటాడలేదు. పిల్లలెందరని అడగాలని అడగలేదు. కాస్సేపయ్యాక.

"మందులు పని చెయ్యలేదా ?"

"దాతా దైవం రెండూ ఉండాలి కదా ?"

"దేవుడే కుదిర్చాడని యెందుకనుకోవటం? మందు కుదిర్చిందని అనుకోకూడదూ ?"

"ఆలోచనలు అందరికీ అన్ని సమయాలలో లోనూ వస్తాయ్. మంచి ఆలోచనలు దేవుని దయలేక పోతే రావు. ఎన్నో మందులు వాడగా బాగుకాలేదు. దేవుని ప్రార్థించుకున్నాం. అదీ నేను అతనిని ముందు దూషించాకే ! నా భార్య గుడులను, గోపురాలను దర్శించింది. ఎన్నో వ్రతాలు చేస్తానని మొక్కుకుంది. వైద్యున్ని మార్చాలనే ఆలోచనా, ఫలాన దగ్గర మంచి వైద్యుడున్నాడనే కబురూ దేవుని దయలేకపోతే మాకందేది కాదు. క్రొత్త వైద్యునికి ఫలానా మందు వాడాలని ఆ దేవుడే ఆలోచన ఈయక పోతే నా జబ్బు నయమయ్యేది కాదు."

ఇంత పెద్ద సమాధానానికి రావు నవ్వుకున్నాడు. ఆమెతో మాట్లాడాలన్న అతని ప్రయత్నం వ్యర్థమైంది. ఆమెకు సిగ్గు మీద, పాతివ్రత్యం మీద ఇంకా చాలా గౌరవం ఉందనుకున్నాడు.

ఒక్కసారి ఆమె "ఇంకా తలుపు తీయలేదండీ!" అంది.

ఆ మాటలు తీరు కూడా అందంగా ఉంది.

"తొందరపడితే ఎలా — ఆరాధన కావద్దూ" అతను అన్నాడు.

సమాధానంగా ఆమె చిన్నగ కొరకొరా రావు వేపు చూసింది. తన చుట్టూ పట్టు మంచి కదలి పోవాలని ఆమె తాపత్రయమని వూహించుకున్నాడు. రావు వాచీ చూసే సరికి యేడు గంటలు దాటి పోయింది. తను యెనిమిది కల్లా ఆ పట్టణంలో ఉండాలి. ఇంతలో సన్నాయి స్వరం ఆలాపించగా ఇంకో పూజారి వెండిబిందెతో నీరు తీసుక వచ్చాడు.

తలుపులు తీస్తారని రావు ఆతృతగా తలుపు దగ్గరకు వెళ్ళాడు. లోన యేవో మంత్రాల గొణుగులు వినిపిస్తున్నాయ్. ఇంకో అరగంట వరకూ చూసాడు. యెనిమిది దగ్గరవుతోంది. తలుపులు తెరవలేదు. రావుకు అప్పుడే ఒక గంట ఆలస్యమైంది. గంట మ్రోగిస్తూ ఒక పూజారి ఆలయం చుట్టూ సన్నాయి స్వరంతో పాటు కదులుతున్నాడు.

ఇంకా తలుపు తీయటం లేదు. రావుకు ఆతృత హెచ్చిపోయింది. ఎందరో తన ఉపన్యాసం కోసం అప్పుడే ఒక గంట నుంచి యెదురు చూస్తూ తనను మనిషేనాటు అంటారని తోచగానే గబగబ తలుపు బాదాడు.

"దేవునికి ఆరాధన జరుగుతోంది. చదువుకున్న వారు మీరలా ప్రవర్తించవచ్చా ?"

అతను వేసిన ఈ సూటి ప్రశ్నకు యేమనగించుకుని "నేను తొందర పని మీద పట్నం వెళ్తున్నాను. అప్పుడే ఒక గంటపైగా ఆలస్యమైపోయింది.

"మీకు ఆలస్యం కావచ్చు. దేవునికింకా

# ప్రయాణం

26 వ పేజీ తరువాయి

సైనుంది"

"ఇంకా ఆలస్యం అవుతుందా ?"

"విన్నారా ఆ గంటలు. . . మూడు సార్లు ఆ గంటలు విన్నాక ఆరాధన పూర్తవుతుంది. అప్పటికి గాని మీకు దైవదర్శనం కాదు."

"అంటే ఇంకో గంట !"

"అయితే. . . కావచ్చు"

"ఇంత ఆలస్యమైతే వచ్చేవాడినే కాదు"

"దేవుని కోసం రాకపోతే. . . తిరిగి వెళ్లిపోవచ్చుగా. . . . . !"

రావుకు అతని వ్యంగం బాధించింది. ఏదో తనకే భక్తి ఉన్నట్లు యెదుటి వానికి లేనట్లు

> మేము స్వేచ్ఛను సంపాదించాలి. దాన్ని కాపాడుకోవాలి. మేము దురాక్రమణను నిరోధించగలగాలి. అందుకు తగినంతశక్తిని మాత్రమే ఆ సందర్భంలో వాడాలి. అంతే కాదు. దురాక్రమణ నెదుర్కొనే సమయంలో కూడా మాధ్యేయం మాత్రం శాంతి సామరస్య [రాజీ] లే! ఈ ఉద్దేశానికి మా మనస్ఫూర్తిగా అంకితం కావాలి. భయం లేదా ఈర్ష్యలూ ఆశయాన్ని క్రమ్ముకోనివ్వకుండా కాపాడుకొనే ప్రాతిపదిక మీదనే మా విదేశ విధానం వుంటుంది.
>
> —నెహ్రూ (అమెరికాలో)

అతని మాటలు యెత్తి పొడుస్తున్నాయ్. ఒకటి రెండుసార్లు వెళ్లిపోదామనుకున్నా మళ్లీ ఆగిపోయాడు. తలుపులు తెరవగానే ఒక పొడుగాటి జవాను కేకలు విని హడలిపోయాడు.

"మొక్కు బడులూ, ముడుపులూ ఈ డిబ్బీలో వేసెయ్యండి !"

ఆమె డిబ్బీలో ముడుపులు వేసింది. ఇద్దరూ కలసి విల్సోని కొబ్బరి కాయలూ, పళ్ళూ, పూలన్నీ పూజారి కందిచ్చారు, ఎలానూ ఆలస్యమైందని రావు వాళ్ల వేపే చూస్తున్నాడు.

"కారులో క్రిందకు దిగబెట్టేదా ?" అని అడిగాడు.

"ఇంకా మేం వ్రతం చెయ్యించాలి"

"అయితే వస్తానండీ" అంటూ ఇద్దరికీ నంభోదిస్తే, అతనే సమాధానం ఇచ్చాడు.

రావు సిగరెట్ ముట్టించి చాలా జోరుగా కారు నడుపుతున్నాడు. రోడ్డు చాలా ఇరుకుగా వుంది నడిచే మనుషులు, మధ్యనుంచి నడుస్తున్నారు. ఇప్పటికీ యేం మాటాడాలో ఆలోచించుకోలేక పోయాడు.

చిన్న పట్నాలు, పల్లెలూ దాటి పోతున్నాడు. ఇంకో ఆరుమైళ్ళ దూరమే ఉంది. కారు 40 మైళ్ళ వేగంతో పోతోంది. చప్పున ముందుగా ఒక కుక్క కనిపించింది. సడన్ బ్రేకు వేసినా కుక్క కారు క్రింద పడింది. కుయ్‌కుయ్ మని అరుస్తూ, గుంటుకుంటూ రోడ్డు దిగిపోయింది. "చావలేదు ! హమ్మయ్యా" అనుకున్నాడు. దిగడానికి సమయం కాదు. మళ్లీ కారు కదలిపోయింది. నడుపుతూ "అదేమనిషైతే. . . ఈ వేళ ఉపన్యాసం గతి. . ." ఈ ఆలోచనలు పూర్తి కాకుండానే గమ్యం చేరుకున్నాడు.

ఆలస్యానికి కారణం దేవుని మీద వేసేసాడు గంటల కొద్ది ఆరాధన చేసి యాత్రికులను కష్టపెట్టడం బాగులేదని దేవాలయ ధర్మాధికారితో తిరిగి వెళ్ళేప్పుడు చెప్పదలచానని చెప్పాడు. తను అనుకున్నట్లు ప్రజలు ఉపన్యాసానికి కానుకొని కూర్చోలేదు. వేదిక దగ్గరకు వెళ్లేసరికి పదికుండు గంటలైంది. చెవులు చిల్లులు చేసే లౌడ స్పీకర్లు ప్రేమ పాటలు దంచినా సభాస్థలి నిండ లేదు. ఆడవాళ్లు వేరే కూర్చున్నారు.

ముందు రోజు రావలసిన ఒక పెద్ద ఉపన్యాసకుడు ఈ రోజు వచ్చాడు. అది తన అదృష్టం అనుకున్నాడు రావు. ఆ ఉపన్యాసకుడు ఆధునిక సాహిత్యం మీద దెబ్బతీసి మాటాడుతుంటే ఆడవాళ్లలో ముందు కూర్చున్నావిడ ప్రతి మాటకూ తెగ నవ్వుతోంది. బహుశః చెవుడేమోనని అనుకున్నాడు. ఉపన్యాసం వింటున్నాడే గాని తనేం మాట్లాడాలో ఇంకా నిర్ధారించుకో లేదు. కాలానికి యెలా అంత్యం లేదో సాహిత్యానికీ లేదు. కాల గమనంలో గొప్ప విశేషాలు యెల్లప్పుడూ జరిగిపోవు— యెప్పుడో ఒక్కొక్కసారి జరుగుతుంటాయ్. అలాగే సాహిత్యంలోనూ ఉత్తమ సృష్టి యెల్లప్పుడూ జరిగిపోదు. యెప్పుడో ఒక్కొక్కసారి జరుగుతుంది. అలా జరగటానికి కాలం నడుస్తున్నట్లే సాహిత్యం నడుస్తుండాలి. ప్రస్తుతం దారం గట్టిది కాకపోవచ్చు. అలా అని దాన్ని తెంపేకూడదు. అతనికి సమాధానంగా ఇదే చెప్తామనుకున్నాడు. ఇంకా మనసు ప్రయాణంలో జరిగిన ఘట్టాలను వదిలించుకో లేక పోతోంది. మళ్లీ మళ్లీ అవే తలపులు ! రావు లేచి నిల్చొనే సరికి తల తిరిగి నట్లయింది. ఎదురుగా నున్న ప్రేక్షకులు గిరగిరా తిరుగుతున్నట్లనిపించారు. ఆ తిరుగుడులో ఒకే ఒక స్త్రీ మొహం కోపంగా భ్రమిస్తోంది. దెబ్బ తిన్న లేడిలాంటి కళ్లతో వణికిపోతోంది. తను మ్రింగివేసినట్లు చూసే చూపులకు యేమనగించుకున్న మనస్సు స్ఫుటంగా ఆ ముఖంలో ప్రత్యక్షమైంది. ఆ జబ్బు పడ్డ మనిషి కనికరంగా "నా యీ కురూపం చూసి నీ రూపంతో నా ఇల్లాలిని వశపరచుకోడానికి చూస్తున్నావా ? ఎదుటి వాడి బాధలకు జాలిపడే బదులు అతని బాధల్లో నీ సంతోషాన్ని వెతుక్కుంటున్నావా ? ఇదేనా నీ సంస్కారం ?"

ఉపన్యాసకుని నోట మాట పెగలక పోవటంతో కోలాహలం హెచ్చి పోయింది. ఎదురుగా కూర్చున్న యెర్రని స్త్రీ యెకాయెకి నవ్వుతోంది. వీటి మధ్య కుక్క అరుపు వినిపించింది. కాళ్లు విరిగిన ఆ కుక్క అరుపు అర్థాలను ఇప్పుడే మెదడు తెలుసుకుంది. "మనిషి జీవితం మీద ఉపన్యాసం ఈయటానికి వెళ్తున్నావ్— నువ్వు మనిషివేనా ? అంత వేగంగా పోతూ అనవసరంగా నా కాళ్లు నరికావ్ ? ఒక సారి తొంగి చూడకుండా కదలిపోయావ్ ? నోరులేని జంతువుని. నోరున్న నీకే ఇలా జరిగితే ?"

రావు కళ్లల్లో నీరు తిరిగింది. ఆ నీలి చీర కట్టుకున్న మగువ, దెబ్బతిన్న కుక్క తప్పించి ఇంకే ఆలోచనలు రాలేదు. ఉపన్యాసం గురించి ఆలోచనలు రాలేదు. ఉపన్యాసం గురించి ఆలోచనలన్నీ తలను పగుల్చుకొని బయటకు పోయాయేమో ?

రెండుసార్లు "అధ్యక్షులకు, సభాసదులకు నమస్కారాలి"న్నాడు.

కాలేజీ విద్యార్థి యూనియన్ ప్రెసిడెంటుకు వ్యతిరేకంగా వోటు వేసిన విద్యార్థుల అరుపులు పిల్లి అరుపుల్లా వినిపించినై. ప్రేక్షకులు వాళ్లలో వాళ్లే ఉపన్యాసా లిచ్చుకుంటున్నారు. రావు ఒక్కసారి "క్షమించండి" అన్నాడు. కళ్లొక్కసారి మూసి తెరిచాడు ఎంతో బెణుక్కుంటూ ఆగిఆగి "నేను సాహిత్యం గురించి మాటాడాలను కున్నాను.... రచయితగా నా జీవితంలోని సంఘటనలను చెప్దామనుకున్నాను— మీ యెదురుగా నిల్చోడానికి వస్తూ ప్రయాణం చేసాను. ఈ ప్రయాణంలోని అనుభవాలు సరిగ్గా నేను అర్థం చేసుకో గలిగితే ఇదే ఒక సాహిత్యం అవుతుంది. రచయిత అర్థం చేసుకోలేని అనుభవం సాహిత్యం కాలేదు. ఇంత కంటే ఈ పరిస్థితులలో నేను అధికం చెప్పలేను. మాటాడే అనుభవం లేని నేను మీకు ఆశాభంగం కలిగించినందుకు క్షమించండి"

ప్రేక్షకులలో కోలాహలం లేచింది. వాళ్లలో వేళాకోళంగా చూసే వాళ్లను చూసాడు. ఒక లెక్చరరు "మాటాడటం అలవాటు చేసుకోవాలండీ" అంటూ సలహా ఇచ్చాడు. "మాటాడలేని వాళ్లనెందుకు పిలవాలి ప్రెసిడెంటు" అంటూ వోడిన పార్టీ నాయకుడు తన సపోర్టర్సు మధ్య గొడవ చేస్తున్నాడు.

ఇవన్నీ కన్న, విన్న, రావు మనసు వికలమైంది. తన కథలూ, నవలలూ చదివి తనపై ఒక సదభిప్రాయం పెట్టుకున్న ఈ పట్టణ ప్రేక్షకులలో తనపై యెంత దురభిప్రాయం కలిగింది ? అసలు మాటాడటానికి ఒప్పుకోవటంలో తను పొరపాటు చేసాననుకుని బాధపడ్డాడు. ఏం మాటాడాలో ముందుగా అనుకోకుండా, రిహార్సల్ చెయ్యకుండా ఇక ముందెప్పుడూ ప్రేక్షకుల ముందర నిల్చో కూడ దనుకున్నాడు.

ఆ రోజుకు యెవరు ఉండమన్నా లెక్క చేయలేదు. నిర్వాహకులకు "తను ఉపన్యాసకుడను కానని ఏదో ఆదివారాలే రాసుకుంటానని. . . . లేని పోని సాకులు చెప్పి బయలుదేరి పోయాడు. ఎండ తీవ్రంగా ఉంది. ఆకలి కూడ వెయ్యలేదు. అవమానంతో మనసేకాదు కడుపు కూడా నిండి పోయింది. కారు సరిగ్గా నడపలేక పోతున్నాడు. ఇంత ఘోరం జరుగుతుందని అనుకోలేదు. ఇది వరకు తను అక్కడక్కడ మాటాడాడు. ఖాళీ ఈ సారి ప్రేక్షకులను చూడగానే మెదడంతా ఖాళీ అయిపోయింది. ఇంకో పెద్ద ఉపన్యాసకుడు ప్రక్కన ఉండి ఆధునిక సాహిత్యంపై చెణుకులు విసిరాడన్న బెణుకా ? లేక ఆరాధనకు అంతరాయం కలిగించిన దేవుని మహిమా ?

బహుశః రాత్రంతా మేల్కొని ఉండటం ఇంత దూరం డ్రైవ్ చేసుకొని రావడం వలన అలసి కామోసు మాటాడలేక పోయాడు. ప్రేక్షకులకు ఉపన్యాసకుని సాధక బాధకాలతో సమ్మంధం ఉండదు— అతను చెప్పిన దానితోనే ఉంటుంది.

చప్పున కారు ఆపాడు. ఇక్కడే తను కుక్కను మట్టించింది. దిగి చుట్టూ కలయ జూసాడు. రోడ్డు ప్రక్కన అంత దూరంలో పొలంలో గట్టు చాటున ఏదో ఉన్నట్టుంది. దిగి వెళ్లాడు. కాలునూ, అక్కడ చిముతున్న రక్తాన్ని నాలికతో నాకుతోంది. తన వేపు దీనంగా చూస్తోంది. కదల్లేదు. ఆ అమాయకమైన కళ్లు నీటితో మునిగినట్లున్నాయ్. కాస్సేపు గట్టు మీద కూర్చున్నాడు. ఓ క్షణం మనసు మరీ వికలమైంది. దగ్గరగా వెళ్తే కాస్త గొణిగింది. ఆ చూపూ, ఆ గొణుగూ అన్నిటిలోనూ తను అర్థం చేసుకునే బాసలున్నాయ్. ఇంకా దగ్గరకు వెళ్తే నన్ను ముట్టకన్నట్లు అరచింది.

మెల్లగా తిరిగి వచ్చాడు. కారు బండిలా కదులుతోంది. చిన్న పల్లెటూరు దాటాడు. వూరు దాటాక రోడ్డు ప్రక్కన పెద్ద మర్రిచెట్టు కనిపించింది. మొదలు చుట్టూ సిమెంటుతో దిమ్మ ఉంది. బహుశః ఆ పల్లెవాళ్లు అక్కడ కలుసుకుంటారు. నడపలేని కారు నాపి చెట్టు క్రిందకు పోయి కూర్చున్నాడు. మనసు మహాసముద్రమై పోతోంది ? ఈ ప్రయాణం అంతా వృధా అయిపోయింది— ఏమీ ఈయలేదు అనుకున్నాడు.

ఇంతలో నెత్తిమీద చిన్న మర్రిపండు రాలింది. పట్టుకుని మీదికి చూసాడు. చెట్టు మీద కాకులు కావు కావు మంటున్నాయ్. పండును చిదిమాడు. అందులో విత్తనాలు యెంత చిన్నవి ? ఇంత చిన్న విత్తనాలు ఇంత పెద్ద చెట్లు కాగలగుతున్నాయా ? ఈ లోకంలో యెవడూ చిన్నవాడు కాడు. కావాలంటే చిన్నవాడు పెద్దవాడు కాగలడు— పెద్ద కార్యాలు సాధించగలడు ? చిన్న రచయిత గానీ, ఉపన్యాసకుడు గానీ, యెవరు గానీ పెద్దవి సాధించగలరు. అలా సాధించడానికి కావలసిన 'ఇది' యేమిటి ?

తను ప్రయాణం మొదలు పెట్టిన నించీ దీని కోసమే ఆలోచిస్తున్నాడు. తను ప్రయాణంలో చూసిన దేమిటి ? బండిపై సారధి పడుకున్నా యెద్దులు కదలి పోతున్నాయ్. పక్షవాతంతో కాళ్లూ చేతులు పడినా ఒక మనిషి కొండ యెక్కిపోయాడు. జబ్బుపడి అందహీనమైన భర్తను అందమైన పడుచు అంటి పెట్టుకుని ఉంది, దెబ్బలు తగిలి కాలు విరిగినా, నాలికతో నాకుతూ ఒక కుక్క బతికే ఉంది— ఇలా జరిగిందంటే వాళ్లలో ఉన్న దేమిటి ? ఒక్క మెరుపులా ఆలోచన తట్టింది. సారధికి ఎద్దులపై, అతనికి దేవునిపై, ఆమెకు అతనిపై, కుక్కకు బతుకుపై విశ్వాసం ! తనకో ? తనపై తనకే విశ్వాసం లేదు. ఈ ఆత్మవిశ్వాసం లేక పోవటం తను కలకాలం నిల్చేది వ్రాయలేక పోయాడు— ఉపన్యాసం ఈయ లేక పోయాడు. మనిషి ఈ జీవితమార్గంలో ప్రయాణం సుఖంగా [illegible] యేదో సాధించాలన్నా తనపై తనకే విశ్వాసం ఉండాలి— ఆ విశ్వాసం అలవరచుకోడానికి దేవుని మీదో, మంచిమీదో— యేదో ఒక దాని మీద విశ్వాసం ఉండాలి. ఉపన్యాసం ఈయలేక నవ్వుల పాలైన తనలో ఆత్మవిశ్వాసం ఉండాలనే సూత్రాన్ని అందించింది ప్రయాణం ! ★



ముప్పాళ్ళ రంగనాయకమ్మ

### జ రి గి న క థ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకీభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మగారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికీ విశ్వనాథానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తుంది. తోటలో జరిగిన దొంగతనాలకు మధు బాధ్యుడవుతాడు. ఈవిషయాన్ని తెలిసికొన్న విశ్వనాథం మధును రక్తం కారేటట్లు కొడతాడు. దగ్గరి బంధువైన డాక్టర్ కేశవరావ్ పరిచయం మధులో కొత్త ఉత్సాహాన్ని కల్పిస్తుంది. ఉద్యోగంలో చేరిన సూర్యానికి ఆ ఇంటినుంచి విడిపోవటం తప్పనిసరి అవుతుంది. అనతికాలానికే సూర్యం గృహస్థుడవుతాడు. ఇందిర అతనికి తగిన భార్య. మధుకు ఇందిర వాత్సల్యం లభిస్తుంది. పై చదువులకు పట్నం వెళ్లిన మధు సెలవుల్లో ఇంటికి వస్తాడు. ఆయిష్టంగానే విశ్వనాథాన్ని చూడటానికి వెళ్తాడు. అక్కడ చిన్న ఘర్షణ జరుగుతుంది.

## -15

సంస్థానంలో వున్న నాలుగు రోజులూ నాలుగు ఘడియల్లా దాటి పోతాయ్. శ్యామసుందరీదేవికి కొడుకులు కావాలన్న కోరిక తీరనేలేదు. ఆవిడకు పుత్రవాత్సల్యం కలిగింది మధూ మీదనే.

శ్యామసుందరీ దేవిమాతృప్రేమలో సుశీల కూడా పాలు పంచుకొంది. కలకల లాడుతూ నిత్య సంతోషంతో గడిపే సుశీల మధూ హృదయంలో జ్యోతి వెలిగించింది. పరిశుభ్రమైన తెల్లని బట్టలతో పెద్ద వాలుజడతో సుశీల బొమ్మలా కన్పిస్తుంది. ధారాళంగా రాయను చదువను నేర్చుకొంది.

"సుశీలకు ఇంగ్లీషు బాగా వస్తోంది మధూ! ప్లే వెయ్యటం నేను ప్రత్యేకంగా నేర్పుతాను." అంది రాగిణి కుతూహలంగా జడకుచ్చులు గిరగిరా తిప్పుతూ. రాగిణి బస్తీ నుంచి ఇంటికొచ్చినప్పుడు వగలన్నీ సింగారించుకొని పావురంలా గంతులేస్తుంది.

మధు మదవ గోపాలం వాళ్ల ఊరుకూడా వెళ్లాడు. గోపాలం చదువు పీడ వదిలించుకొని బుద్ధిగా వ్యవసాయం చేయటంలో నేర్పు సంపాదిస్తున్నాడు.— "చక్కగా నువ్వు చదువుకో కూడదురా మదనా?" అంటే.

"పోరా! ఒంటబట్టని ఏడుపు—నాలాంటి రైతు లేకపోతే నీ చదువు గిదువు జాన్తానై."

గోపాలంతో కబుర్లకి దిగితే ఎక్కడెక్కడివీ తవ్వుకొస్తాడు. గోపాలం బామ్మ మధు వున్నన్నాళ్ళు ఉప్పిడి పిండి చేస్తుంది. దిబ్బ రొట్టెలు కాలుస్తుంది. సెనక్కాయలు వేయిస్తుంది. పాయసం వండి పెడుతుంది.

మజిలీలన్నీ పూర్తి చేసుకొని సెలవులు పూర్తయ్యే సరికి ఇంటికి చేరాడు మధు — కాలేజీకి వెళ్లేముందు కేశవ్ మామయ్య దగ్గరికి వెళ్లాడు చెప్పి రావటానికి. కేశవ్‌రావు గాఢమైన నిర్ణయం చేసుకున్నవాడిలా అన్నాడు — "మీ అత్తయ్యని తీసుకు రావాలి మధూ! నువ్వే వెళ్లి తీసుకురా! తర్వాత వెళ్దువుగాని కాలేజీకి."

"నేను వెళ్లనా?" ఆశ్చర్యంగా అడిగాడు మధు.

"ఏం? ఖాళీ లేదా?"

"కాదు మామయ్యా! నీకై నువ్వే పిలుస్తావా?"

"మరి? అదే అనుకొంటున్నాను."

మధు కాస్సేపు ఆలోచించిన వాడిలా మౌనంగా వుండి అన్నాడు — "నువ్వు కబురు పంపించద్దు మామయ్యా! అత్తయ్యే వస్తుంది. తన మూర్ఖత్వం తెలుసుకొని మరీ వస్తుంది."

"ఎప్పుడు?"

"నేను అత్తయ్యా వాళ్లవూళ్లో దిగి ఓరోజు వుండి మరీ వెళ్దామనుకొంటున్నాను. నువ్వు పంపించినట్టుగాక నాకై నేను అత్తయ్యతో మాటాడుతాను. నేను వెళ్లగానే అత్తయ్య నీ దగ్గరికి బయల్దేరుతుంది." కేశవరావు చిన్నగా నవ్వాడు — "మీ అత్తయ్యకి మంత్రమేదైనా వేస్తావేమిటి?"

"నీకు వేసిన మంత్రమే."

"చివాట్ల మంత్రం. అవునా?"

"ఎంతమాట మామయ్యా! మీకుచెప్పగలిగేంత వాడినా?"

"నిజం మధూ! నువ్వు చాలా ప్రయోజకుడివయ్యావు."

"అయితే అది నీ చలవే."

"రుక్మిణికీ నాకూ ఇదో మహత్తరమైన అనుభవంరా మధూ!"

"అత్తయ్య వచ్చినప్పుడు సలక్షణంగా ఆదరించు. అంతవరకే నీ డ్యూటీ! తర్వాత అత్తయ్యే పశ్చాత్తాపం వెల్లడించుకొంటుంది."

"సరే! నిన్నోమాట అడగనా?" కేశవరావు నవ్వుతూ మధూ మొహంలోకి చూశాడు.

మధు కలవరపడ్డాడు — "ఏమిటి మామయ్యా!

"ఏమీ అనుకోవు కదూ?"

"చిత్రంగా మాట్లాడుతున్నావు మామయ్యా".

"నేను ఇన్నాళ్లూ ఇంత పరిశీలనగా చూడలేదు నీ పెదాలు చూడు ఎలా నల్లబడి పోయాయో!"

మధు గతుక్కుమన్నాడు — "ఛ! లేదే!"

"అదుగో. అబద్ధం. నాదగ్గిరేనా నీదాపరికం? సిగరెట్లు జోరుగా కాలుస్తున్నావు కదూ?"

మధు ఇబ్బందిగా మొహం పెట్టాడు.

'మధూ! నీ తండ్రి వంటి వాణ్ణి అనుకో— మీ నాన్నే నిన్ని పరిస్థితిలో చూస్తే మందలించకుండా వూరుకుంటాడా? మా మురళినైతే నేను విడిచి పెడతానా? అడిగానని నీకు కష్టంగా ఉంది కదూ?"

మధు సిగ్గుపడ్డాడు— "లేదు మామయ్యా!"

"నీ వయస్సులో నేనూ ఎన్నో చిలిపి పనులు చేశానురా మధూ! ప్రతి వ్యక్తీ వయస్సు ప్రభావానికి లోబడి పోవటం సహజమే గాని ఆ వయస్సు దాటి పోయాక అనిపిస్తుంది ఏదైనా— దారి తప్పటం తేలిక— తిరిగి దారిలో పడటం కష్టం"

"లేదు మామయ్యా! నేనేమీ చెయ్యటం లేదు." తన నిర్దోషిత్వం వెల్లడించుకోబోయాడు మధు.

కేశవరావు నవ్వి అన్నాడు— ''సిగరెట్లు కాల్చటం ఏమంత మంచిపని కాదురా ! మనల్ని ఉత్తేజపరిచేవాటికి తేలిగ్గా లొంగిపోతాం— దాని ఫలితం భవిష్యత్తులో గాని అర్థం కాదు— సిగరెట్లు కాల్చి క్షయ దగ్గులు తెచ్చుకున్నవాళ్లు కొన్ని వందల మంది ఉన్నారు. నీకు తెలుసా ? మనం పశువులం కాము — మనకు ఆలోచించగలిగే శక్తి అర్థం చేసుకో గలిగే వివేకం ఉన్నాయి. ఇంత చిన్న విషయాన్ని రూపుమాపలేనప్పుడు మరే విషయానికైనా తేలిగా వశం కావచ్చు— మనలో శక్తి సామర్థ్యాలు నశించిపోవటానికి ఇటువంటి చిన్నచిన్న విషయాలే చాలా వరకు కారణం— ఇక ఆరోగ్యం మాట ? చెప్పుకో వలసింది కాదు— ఆర్థికంగా కూడా ఇటువంటి చిల్లర పనులు మనకు సరిపడవు— రోజూ రెండు పూటలా ఓ గ్లాసుడు పాలుతాగు— అది వృధా అనగలవా ? మనం ఆరోగ్యంగా ఉండటం మనకోసమే కాదు. మన మంచి బయల్దేరే సంతానం— మనతోనిండి ఉన్నదేశం అంతా ఆరోగ్యంగా ఉంటుంది— ఉపన్యాసం చదువుతున్నానని నీకు విసుగ్గా ఉందా ?''

''లేదు మామయ్యా !'' మధు కొంచెం నవ్వాడు. —''చెప్పు''

''చెప్పటానికేముంది ? అంతా నీకూ తెలిసిందే. కాకపోతే నన్ను నువ్వు మందలించటం నిన్ను నేను మందలించటం ఇదో అభిమానం. నువ్వు అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తావనేనుమా నాతాపత్రయం.

నీకో చక్కని కథ చెప్పనా ? విను.

నీలాగే— వయస్సులో కాలుమోపుతాన్న ఓ ఆకతాయి. వాడికెలాగో సిగరెట్లు కాల్చటం అలవాటైంది. సిగరెట్ కేస్‌మీద ఓ అడ్వర్టయిజ్‌మెంటు కన్పించింది — ''మహరాణీ కార్డుతో ఆడి చూడండి. మిమ్మల్ని జయలక్ష్మి వరిస్తుంది. అది పేక కంపెనీవాళ్ల ప్రకటన. చూడగా చూడగా ఆకతాయికి ఆ పేక కట్టలు కొనాలనిపించింది— అనిపించటమేమిటి ? నాలుగు పెట్టెలు కొన్నాడు— పేకాటకి బాగా అలవాటు పడ్డాడు—

మరోరోజు పేకపెట్టె మీద ఇంకో అడ్వర్టయిజ్‌మెంటు చూశాడు— నిగనిగలాడే బ్రాందీ సీసా ! దాని క్రింద— ''ఉమర్ బ్రాందీ విస్కీలు సేవించండి. మీరు వూహాలోకాలలో విహరిస్తారు.''— ఇంకేముంది ? ఆకతాయికి బ్రాందీ తాగటం కూడా అలవాటైంది. చిత్తుగా తాగి తూలుతూ జట్కాలో కూలబడ్డాడు.

''మంజువాణి ఇంటికి దయచేయండి. మీకు స్వర్గం చూపిస్తుంది.'' జట్కావాలా ఆకతాయిని ఓ వేశ్య గుమ్మంలో దిగవిడిచి చక్కా పోయాడు ఆకతాయి విసిరేసిన ఐదు రూపాయల నోటు అందుకొని — మన ఆకతాయి మంజువాణీ భక్తుడై కూర్చున్నాడు. ''నాకో నక్షత్రాల కంఠహారం కొనిపెట్టరూ !'' అంది మంజువాణి గోముగా. ఆకతాయి కరిగి నీరై పోయాడు. తలైనా అమ్మేసి ప్రేయసి కోరిక చెల్లిస్తానని కంకణం కట్టుకున్నాడు— ఆ రాత్రి మంజువాణి మరి కొందరు స్నేహితులతో ఆకతాయిని కూడా పంపింది. ఎక్కడికి ? దొంగతనానికి ! ఆకతాయి తెలిసే బయల్దేరాడు— డబ్బుకోసం.

తీరా ఇనపెట్టె తెరుస్తారంటే షావుకారు లేచి పోయి— ''దొంగలు ! దొంగలు !'' అంటూ గావు కేక పెట్టాడు. అంతేగాదు. ఆకతాయిని బలంగా వాటేసుకున్నాడు. జట్టుగాళ్లంతా పారిపోతే ఆకతాయి ఒక్కడే మిగిలాడు— ప్రాణ భయం ఆకతాయిని మరేమీ ఆలోచించ నివ్వకుండా చేసింది. పళ్లతో షావుకార్ని కండలూడేలా కొరికి చేతిలో సుత్తితో నెత్తిమీద ''ఠకేలుమని'' ఒక్కటి పెట్టి పిక్కబలం చూపించాడు— అయినా ఆకతాయి పోలీసులకు దొరికిపోక తప్పలేదు.

''వింటున్నావా మధూ ?— సిగరెట్లు—జూదం త్రాగుడు—వ్యభిచారం— దొంగతనం — హత్య ఒక దాని తర్వాత ఒకటి ఆకతాయికి తప్పనిసరే అయ్యాయి.

''నీకు నేనోకథ చెప్పాను. ఇందులో నీతిమాత్రమే గ్రహించు అంతేగాని నిన్ను నేను ఆకతాయిగా వూహించటం లేదు.''

మధుమాటిగా విరభిమానంగా కేశవరావు కళ్లలోకి చూశాడు— ''నేను సిగరెట్లు కాల్చను మామయ్యా !''

''ఏమిట్రా మరీ డ్రామా ఫక్కీతో మాట్లాడుతున్నావ్. అప్పుడే ఇంత పశ్చాత్తాపమా ?''

''పశ్చాత్తాపం కాదు మామయ్యా ! నువ్వు చెప్పినట్టు వినాలని ఎప్పుడూ అనిపిస్తుంది.''

''సడెన్‌గా మానలేవు. క్రమంగా ప్రయత్నం చెయ్యి రోజురోజుకీ తగ్గించేస్తూ ఉండు.''

''కాదులే మామయ్యా ! పూర్తిగా మానేస్తాను'

కేశవరావు నవ్వాడు— ''నీ పట్టుదలే నీదిరా ! సరే ! నువ్వు మానగలవంటే నాకుమరీ సంతోషం —చూడుమధూ! ఉన్నత శిఖరాల మీదికి ఎక్కాలంటే ఒక్కో మెట్టు ఎక్కతీరాలి కాని క్రిందికి పడిపోవాలంటే ఒక్క దూకు దూకితే చాలు— బాగుపడటం కష్టంగానీ పాడైపోవటం తేలిక మధూ ! తల్లీ దండ్రీ లేని నువ్వు మురళికన్నా ఎక్కువనాకు. ''కేశవరావు కంఠం వణికింది. మధు మనస్సు ఆర్ద్రమైపోయింది— ''క్షమించు మామయ్యా ! ఎప్పుడూ చెడ్డపనులు చేయను.'' అప్రయత్నంగా అన్నాడు.

* * *

మధు పక్క చుట్టుకుంటూ ఇందిరను పిలిచాడు: ''వదినా ! నీ కిచ్చిన పుస్తకాలు చదివేశావా ? ఇలా తీసుకురా ! సర్దుకోవాలి.''

ఇందిర పెట్టె తీసి పుస్తకాలన్నీ తెచ్చి పడేసింది—''తొందరగా తీసికెళ్లు బాబూ ! అర్థం పర్థం లేని రాతలూ నువ్వూను.'' మధు దుప్పటి



## క్లియరన్స్ అమ్మకం



ఆకర్షణీయమైన రంగులలో మిక్కిలి అందమైన నవీన డిజైనులలో చేనేత చీరలు. ఒక్కొక్కటి ధర రు. 7/50. 2 చీరలు రు. 14. 3 చీరలు రు. 20. డీలక్సురకం ఒక చీర రు. 11. 2 చీరలు రు. 21. 3 చీరలు రు. 30. స్పెషల్ రకం చీరలు 1కి రు. 15. 2 చీరలు రు. 28/-. 3 చీరలు రు. 39/-. అన్నిటికిపోస్టేజి ప్యాకింగు ఉచితం. 2 చీరలు కొనువారికి ఒక జత ఇయర్ టాప్స్, 3 చీరలు కొనువారికి ఒక బ్రూచ్, ఒక జత ఇయర్ టాప్స్, ఉచితముగా పంపబడును. కొద్ది స్టాకుగలదు. మీ ఆర్డరును వెంటనే పంపండి. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

THE ROYAL STORES (APM2)
Post Box No. 1774. Delhi 6.

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో శాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపటం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

## CALENDARS for 1965

Wanted agents throughout India and abroad to secure orders for our attractive & new style Calendars. Over 300 designs.

Ask for Agency Terms:
ORIENTAL CALENDARS Mfg. Co.
Sec. (22) P. B. No. 11212,
CALCUTTA-14.

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెంగ్గ, వేళ్ళ పాలుకుపోయి పాదము నేలపై పెట్టలేక రాళ్ళు తగిలినట్లు బాధపడ వారు పైపూతగా వాడిన వేళ్ళతోసహా మాయంచేయ గల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4-25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1-50
దాంపత్య రహస్యములు ... రు. 3-00
తెలుగు హిందీ స్వయంబోధిని రు. 4-50

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో.
3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.

## కాల్గేట్ బేబీ పౌడరు
## ఉత్కృష్టమైనది...మరియు ఇపుడు పెద్ద డబ్బాలో కూడా




ఎక్కువ పౌడరు • తక్కువ ఖర్చు



ఐటెక్స్ కాటుక
ఐటెక్స్ బిందీ







శాస్త్రీయముగా తయారైనది

అరవింద్ లేబరేటరీస్
పి. బి. నెం. 1415, మద్రాసు-17.

...ఎట్టి౯ లేని ఆశ్చర్యంగా చూశాడు—

"ఏమిటి ? నీకీ పుస్తకాలు నచ్చనే లేదూ ?"

"అధునాతన సాహిత్యం అంటూ ఏది తోస్తే అది రాయటమే గాని ఏదీ పది సంవత్సరాలపాటు నిలవగలిగేది కాదు. నాగరికత వెర్రి తలలు వేసిన ఫలితం మాత్రమే ఇవి."

"ఎంత తేలిగ్గా తీసిపారేశావు వదినా ! నిత్యమూ మనం అనుభవిస్తూన్న జీవితాలనూ మనకు ఎదురవుతూన్న సమస్యలనూ యధా తధంగా చిత్రించటం తప్పంటావా ?"

"నువ్వు చెప్తూన్న సహజత్వం ఈ పుస్తకాల్లో లేదయ్యా. ఊహాలోకాల్లో విహరిస్తూన్నారీ అభ్యు దయ రచయితలు. చదివేవాళ్ళని విశేషంగా ఆక ర్షించాలని చేసే ప్రయత్నం తప్పితే మరేం కన్పించదు."

"నువ్వు చెప్పింది కాదనను. కాని నువ్వు మొత్తంగా అభ్యుదయ రచనల్ని నిరసించుకోవటం మంచిది కాదు. కుక్కపిల్లా, అగ్గిపుల్లా కూడా కవితా వస్తువులేనట. తెలుసా ?"

"అయితే కుక్కపిల్ల అరిచిందనీ—అగ్గిపుల్ల వెలిగిందనీనా రాయటం ? అదే కాబోలు సహజత్వ మంటే—ఎందుకొచ్చిన వాదన గానీ ఈసారి మంచి పురాణ గ్రంధాలు తెచ్చి పెడుదూ ! కాస్త పుణ్యమైనా వస్తుంది." మధు నవ్వి తాపీగా దుప్పటి విసిరేసి కూర్చున్నాడు—"పుణ్యం కోసమే కదూ పురాణాలు చదువుతావు ?"

"పుణ్యం మాట దేవు డెరుగు. అవి చదువు తోంటే శాంతిగా ఉంటుంది."

మధు విస్తుపోయాడు—"నీకు శాంతిగా ఉంటుందా ? నాకైతే పేజీకో లక్ష అనుమానాలు వస్తాయి.

"బుర్ర లేకపోతే సరి."

"అది లేనిది నీకే. అందుకే అలా గుడ్డెద్దు చేలో పడ్డట్టు చదువుకు పోతావు కాబోలు."

"మరి నీలా నేను చదువుకోలేదుగా ? నీకేం అనుమానా లొస్తున్నాయో చెప్పు వింటాను."

"హాస్యానికి అన్నాను గాని వదినా ! పాపం పురా ణాల్లో పతివ్రతల్ని చూస్తోంటే జాలేస్తుంది నాకు."

"ఎక్కడ నేర్చావ్ బాబూ ఇదంతా ? నాకు మతి తప్పేలా ఉంది."

"మీ సిస్టర్ డాక్టర్ చదువుతుందటగా ? బాగుచేస్తుందిలే."

"కొనబోయే ఆవు పెట్టబోయే పాట్ల పాదుని మేసినట్టే ఉంది."

"ఇంతకీ నీ కెలాంటి పుస్తకాలు కావాలి ?"

"మంచివి."

"మంచివా ? మంచికి నిర్వచనం ఏమిటి ? సిగ రెట్లు కాల్చటం నిన్నటివరకూ మంచి నాకు. ఇవాళ్టినుంచి చెడ్డ."

"అబ్బో ! నమ్మమనేనా ?"

"మారిపోయాం. అంతే -- నువ్వాకపని చెయ్యి వదినా ! కేశవ్ మామయ్య లైబ్రరీలో కావలసినన్ని పుస్తకాలు నీకు కావలసినవి తెచ్చుకుని జాగ్రత్తగా ఇచ్చేస్తూండు."

"పంచాయితీ లైబ్రరీ నుంచి తెమ్మని మీ అన్న గారిని బతిమిలాడుకుని సంవత్సరంన్నర దాటింది."

"అయితే నేనే చందా కట్టేసి అన్నయ్యకి

---

నేను కలలుకనే నా భారత దేశంలో "నిరుపేదలు కూడా యిది మా దేశం అనే అనుభూతిని పొందగలగాలి.' ఈ దేశరూపాన్ని మల్చడంలో వాళ్ళకి ప్రతిపత్తి వుండాలి. నేను కలలు గనే భారత దేశంలో ఉచ్చనీచవర్గమనే భేదాలుండకూడదు. నేను కృషి చేస్తున్న భారత్ లో అన్నివర్గాలు సామరస్యంగా వుండాలి. అక్కడ అంటరానితనం యింకా మత్తుమందులు మద్యపానాదులు వంటి శాపాల ప్రభావం ఉండకూడదు. స్త్రీలకు పురుషులతో సమాన హక్కులుండాలి. అదే నా ఇండియా.

—మహాత్మాగాంధీ,

---

# కూలిన గోడలు

చెప్తానుండు—రుక్మిణత్తయ్య వచ్చేస్తుందట గానీ వాళ్ళింట్లోవి కూడా తెచ్చుకో."

ఇందిర దిగులుగా అంది—"నువ్వు వెళ్ళిపో తున్నావు. నాకేమీ తోచదు మధూ ! ఏదో పోగొట్టు కున్నట్టు ఉంటుంది."

"అనుమానంలేదు. నువ్వు రచయిత్రివై పోతావ్. రాయటం మొదలెట్టకూడదూ ?"

"పోదూ ! నీ కన్నీ హాస్యాలే. నా బెంగ నీ కర్థం కాదు."

"బాధపడకు వదినా ! నేను వచ్చేటప్పుడు చిన్నకత్తులూ అగరొత్తులూ అన్నీ తెస్తాను. తిందుగాని."

ఇందిర ఫక్కుమని నవ్వేసింది.

మధు రైలెక్కి చోటు చూసుకునేసరికి హడా వుడిగా వచ్చాడు సీతాపతి--కవరొకటి మధుకి అందించబోయాడు—"ఏమిటి మామయ్యా ?"

"తర్వాత చూసుకుందువు గానిలే. తీసుకో."

"ఊహూ ! ఏమిటో చెప్పు."

మధు పట్టుదల ఎరిగిన సీతాపతి చెప్పక తప్ప లేదు.

"అబ్బే ! ఏంలేదురా ! ఓ యాభై రూపాయ లుంటేనూ .... తీసుకో. నీకే ఖర్చుకైనా పనికి వస్తుంది."

"వద్దులే మామయ్యా ! నాదగ్గర డబ్బు ఉంది."

"నీ దగ్గర లేదనేనా ? ఎందుకైనా పనికి వస్తుందని .... "

"అక్కర్లేదు. ఇన్నాళ్ళూ ఎలా చదువు కుంటున్నానో—ఏమై పోతున్నానో పట్టించుకోని నువ్వు ఇప్పుడు వెయ్యి రూపాయ లివ్వబోయినా నాకు అవసరంలేదు."

సీతాపతి అనునయంగా అన్నాడు—"తీసికోరా మధూ !"

"వద్దు మామయ్యా ! ఎందు కిక్కడ పబ్లిగ్గా ఈ గల్లంతు ? అందరూ చూస్తారు—నీమీద నాకేం కోపంలేదు. నువ్వయినా ఈమాత్రం అభిమానిస్తావ్. అదే పదివేలు."

సీతాపతి మరేమీ మాట్లాడలేక కవరు జేబులో పడేసుకున్నాడు.

మధు కదులుతూన్న రైల్లోంచి సీతాపతిని చూశాడు. "పిరికి మనిషి !"

చిన్నప్పుడు ఆకలేస్తోందని గోలపెడితే విని కూడా పట్టించుకోకుండా పెళ్ళాంతో చెప్పకుండా వెళ్ళిపోయేవాడు—ఈనాడు ఏభై రూపాయ లివ్వ టానికి తయారయ్యాడు దొంగచాటుగా.

*　　　*　　　*

మధు బి. ఎ. ఆఖరి పరీక్షలు రాసి వస్తున్నా డన్న సంగతి రెండిళ్ళవాళ్ళకీ సంతోషం కలిగిం చింది. నిండుకుండువంటి సూర్యం కూడా సుంద రమ్మగారూ, ఇందిరా కూర్చున్నప్పు డన్నాడు—! "మధు అనుకున్నంతా చేశాడు అమ్మమ్మా నా కెంతో సంతోషంగా ఉంది "

"పదిహేనేళ్ళుగా కళ్ళల్లో ఒత్తులేసుకుని కూర్చుంటే ఈనాటికి ఆనందం కలుగుతుంది— చూసుకోటానికి మీ అమ్మా నాన్నా లేకపోయా రురా ! కొడుకు బియ్యే చదివినందుకూ—మన వడు పుట్టినందుకూ ఎంత సంతోషించేదో !" అంది దిగులుగా సుందరమ్మగారు.

ఇందిర ఒళ్ళో నిద్రపోతూన్న కొడుకుని పడుకోబెట్టటానికి లేచింది—అంతలో విశ్వనాథం వచ్చాడు—"మధు ఎప్పుడు వస్తున్నాడమ్మా" అంటూ.

రెండిళ్ళమధ్యా బాగా సామరస్యం ఏర్పడింది. మామయ్యలూ, అత్తలూ, పిల్లలూ అంతా సూర్యం ఇంటికి వస్తూ పోతూనే ఉన్నారు.

కొడుకు చదువుసంధ్యలు లేకుండా తిరుగు తున్నాడనే బాధ వేధించినా అల్లుడు బియ్యే చదువుకున్నాడన్న సంతోషంతో సంతృప్తిపడ్డారు సీతాపతి దంపతులు.

పెళ్ళి కేమిటి ? ఎప్పుడైనా చేసుకోవచ్చు. తమ మాత్రం డాక్టర్ కావాలి—కలలు కంటూనే ఉండి సుధ. సుధ ఊహాలోకాల్లో మధు ఏమంతగా నిలవలేకపోయాడు. తను డాక్టర్ కావాలే గానీ— ఆఫ్టరాల్—మధు బాపని మించినవాళ్ళు లెంక్క మంది !

విశ్వనాథం ఒకప్పుడు మేనల్లుళ్ళను నిర్లక్ష్యం చేసినందుకు విచారిస్తున్నాడనీ—పశ్చాత్తాపంతో ఈనాడు మేనల్లుళ్ళని అభిమానిస్తున్నాడనీ అను కుంటే అదేమంత నిజంకాదు.

మధు పెంకితనం విశ్వనాథాన్ని ఏనాడూ సవాల్ చేస్తూనే ఉంటుంది. మధు చదువుసంధ్యలు

విశ్వనాథాన్ని వెక్కిరిస్తూనే ఉంటాయి... కాని వెధవ పరీక్షలు పాసైపోతున్నాడంటే బుద్ధిగా చదివేస్తున్నా డనుకుంటున్నా వేమిటి ? ఏదో వాడి గీత బాగుంది. పేసైతున్నాడు—" అంటూంటాడు పార్వతితో.

ఆ కుటుంబంలో ఒక్క సీతాపతి మీద తప్పితే మరెవరిమీదా సద్భావంలేని మధు అందరికీ దూరంగానే ఉండిపోయాడు—సుధ మీద ఉన్న ఈ అభిమానం—చిన్ననాటి నుంచీ పెంచుకుంటూన్న ఆత్మీయతలు మాత్రం మధుని ఒక రకంగా ఆ కుటుంబాన్నుంచి పూర్తిగా వేరుగాకుండా నిలవగలిగాయి.

*　　　*　　　*

పబ్లిక్ పరీక్షలు రాసి వచ్చిన మధులో ఏదో వెల్తి ఉన్నట్టు గ్రహించగలిగింది ఇందిర ఒక్కతే—మధు మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా ఆపి లేచిపోవటం—పూర్వంలా చురుగ్గా హాస్యంగా మాట్లాడకపోవటం — చదువుకోవాలని తెరిచిన

# కూలిన గోడలు

పుస్తకం గుండెలమీద పడేసుకుని తలకింద చేతులు పెట్టుకొని ఇంటికప్పుకేసి చూస్తూ ఉండిపోవటం —అంతా ఇందిరకు చాల ఆశ్చర్యం కలిగించింది. మధు మౌనంగా భోంచేస్తోంటే ఇందిర దగ్గిరే కూర్చుని మెమ్మదిగా అడిగింది—"అదేమిటి మధూ అలా ఉంటున్నావు కొత్తగా ?"

మధు తలెత్తి చూశాడు.

"నువ్వేమిటో మునుపటిలా లేవు. బొత్తిగా మారిపోయావ్. సరిగ్గా మాట్లాడటమే లేదు."

"భలేదానివే వదినా !" మధు కొంచెం నవ్వి తిరిగి అన్నం కలుపుకోసాగాడు.

"నేనేం హాస్యానికనటంలేదు సుమా ! నువ్వు చాలా మారిపోయావు."

"చాల్లే ! వూరుకో వదినా!"—

ఇందిర ఎంత ప్రయత్నించినా ఏమీ తెలుసుకోలేకపోయింది. సూర్యంతో మధు విషయం చెప్తే—

"ఆ పోదూ ! నీ అనుమానాలకేం ..." అనేవాడు— సుందరమ్మగారితో అంటే ఆవిడ నిండుగా నవ్వుతూ అంది—"వాడింకా చిన్నవాడా ? చిలకవాడా అమ్మాయ్ ఏళ్ళు పైబడుతూన్నకొద్దీ కుదురు రాదూ ? ఏదో చిన్నప్పుడలా ఆకతాయి గంతు లేశాడు మరి."

ఇందిరకు మాత్రం సంతృప్తి కలగలేదు.

మధు మునుపటిలా లేడు—ఎందుకో చాల ముభావంగా ఉంటున్నాడు. ఏదైనా ఆలోచించుకొని బాధపడుతున్నాడో ఏమో !—అంతవరకూ ఖాయం. మధు ఉదాసీనంగా ఉండటం ఇందిరకు చాల కష్టం కలిగించింది. మధూ ఆలోచన లేమిటో తెలుసుకొని ధైర్యంచెప్పి బుజ్జగించాలని ఎంత ఆరాటపడినా చేయలేకపోయింది.

"ప్రేమలో గాని పడ్డా వేమిటయ్యా ? చెప్పనైనా చెప్పు." అంది వోసారి హాస్యంగా—దానికో ఉపన్యాసం ఇవ్వాల్సిన మధు చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

"ఏమిటి బాబూ బొత్తిగా ఈ చిద్విలాసాలు ? శ్లోకా ?" అంది విసురుగా ఇందిర.

"అలాగే అనుకో."

"అంతేగాని నువ్వు చెప్పవ్ ?"

"చెప్పటానికేమైనా ఉంటేగదా ?"

ఇందిర మరి మాట్లాడలేదు.

కాలేజీనుంచి వచ్చింది మొదలు ఊరంతా కాకిలా తిరిగి వచ్చే మధు ఇంటిపట్టు వదలటం లేదు. ఓసారి ఇందిరతో అన్నాడు—"నాకేమైనా ఉత్తరాలొస్తే జాగ్రత్తగా ఉంచు వదినా !"

"ఎప్పుడూ నీ ఉత్తరాలు నీకు జాగ్రత్తచేసి ఇవ్వటంలేదూ ?"

మధు మాట్లాడలేదు.

రుక్మిణత్తయ్యకి జ్వరంగా ఉందని కబురు తెలిస్తే మధు భోజనం కాగానే వెళ్ళాడు. వెళ్ళే ముందు మరోసారి అన్నాడు—"బహుశా ఇవ్వాళ ఉత్తరా లేమైనా రావాలి."

"ఏం ? నీకేమైనా ప్రేమలేఖలు వస్తాయా ? తాళం కవరేదైనా ఉంటే నేను చించి చదివేస్తాలే" నవ్వింది ఇందిర—మధు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఆ మౌన మేమిటో ఆఖరికి ఇందిరకు చిరాకు వేసింది. (సశేషం)



# ఎన్. టి. రామారావు జాతక సమీక్ష

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | శు | ర బు | కు |
| కే | మహేష్ | | |
| | | | రా |
| | | ల గు చం | శ |



**జననకాలం 28-5-1923**

**సాయంత్రం గం॥ 4-5**

**స్థలం: నిమ్మకూరు-కృష్ణాజిల్లా**

ఫలిత భాగమునకు సంబంధించిన జ్యోతిశ్శాస్త్రం యెంతవరకు నిజం అనే ప్రశ్న తరతరాలుగ మానవ మేధస్సును వేధిస్తూ ఉంది. జ్యోతిశ్శాస్త్ర సూత్రాలను కేవలం పరిశోధనా గారాల్లో రుజువు చేయడానికి అవకాశం లేదు. కాబట్టి కొంత మంది వ్యక్తుల జాతకములను జీవిత విశేషములను సేకరించి ఆయా జాతకాలకు అన్వయించిన జ్యోతిశ్శాస్త్ర సూత్రాలు వారి జీవితాల్లో యెంత వరకు రుజువైనవో పరిశీలించుట ద్వారా శాస్త్ర సత్యాన్ని నిరూపించ వలసి ఉంది. అలాంటి పరిశోధన సందర్భములో నేను సేకరించిన వాటిలో శ్రీ ఎన్. టి. రామారావుగారి జాతకం ఒకటి.

ప్రముఖులైన వ్యక్తులతో, సన్నిహిత పరిచయం లేక పోయినప్పటికీ, వారి జీవిత విశేషాలు ప్రజలకు తెలియడానికి అవకాశం ఉంది. అందు చేత అటువంటి వ్యక్తుల జాతకాలను ప్రకటించిన యెడల ఆయా జాతకాలకు సంబంధించిన జ్యోతిశ్శాస్త్ర సూత్రాలు వారి జీవితంలో యెంతవరకు రుజువు అయినవో సామాన్యులు కూడా తెలిసికొన గలరు. గ్రహస్ఫుట భావస్ఫుటములు, షడ్బల సాధన మొదలగు గణిత విశేషముల ద్వారా సాధించ వలసిన సూత్రములను జాతకమునకు అన్వయించుట, జ్యోతి శ్శాస్త్రము నందు ప్రత్యేక కృషి చేసిన వారికి తప్ప, ఇతరులకు సాధ్యంకాదు. అందు చేత అత్యంత ప్రాథమికమైన గ్రహదృష్టి విషయంలో శ్రీ ఎన్. టి. రామారావుగారి జాతకమునకు ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్ర గ్రంథమగు సారావళి యందు చెప్పబడిన ఫలితాలను పరిశీలించుట మంచిది.

(1) చంద్రుడు తుల యందుండి శుక్రునిచే చూడబడిన యెడల జాతకుడు సౌందర్యవంతుడు, రోగహీనుడు అవయవ పుష్టి కలవాడు, ధనవంతుడు, ప్రాజ్ఞుడు, వివిధోపాయములను తెలిసిన వాడు అగును.

(2) గురుడు శుక్ర క్షేత్రమందుండి శుక్రునే చూడబడిన యెడల జాతకుడు అతి లలితమైన బుద్ధి కలవాడు ధనవంతుడు శ్రేష్ఠమైన వస్త్రాభరణములు కలవాడు సవ్యాగ్వర్తనము కలవాడు అగును.

(3) శుక్రుడు కుజక్షేత్రమందుండి చంద్రునిచే చూడబడిన యెడల జాతకుడు గొప్ప బంధము కలవాడు (స్వేచ్ఛా రహితుడు) చపల స్వభావుడు మిక్కిలి కోరిక కలవాడు అగును.

(4) శుక్రుడు కుజక్షేత్రమందుండి గురునిచే చూడబడిన యెడల జాతకుడు మంచి నేత్రములు కలవాడు, ఉదారుడు, మంచి శరీరము కలవాడు, పొడవరి, అనేక మంది పుత్రులు కలవాడు అగును.

(5) కుజుడు బుధక్షేత్రమందుండి గురునిచే చూడబడిన యెడల జాతకుడు, రాజపురుషుడు, ప్రముఖుడు, రాజకీయ వ్యవహారములపై విదేశముల కేగువాడు. అన్ని వ్యవహారముల యందు చతురుడు, నాయకుడు అగును.

(6) కుజుడు బుధక్షేత్రమందుండి శనిచే చూడబడిన యెడల జాతకుడు, నిధులు, కోటలు వీని యందుండు వాడు వ్యవసాయము చేయువాడు సంతోష రహితుడు, శూరుడు వైభవము లేని వాడు అగును.

(7) శని బుధక్షేత్రమందుండి కుజునిచే చూడబడిన యెడల జాతకుడు మల్లయుద్ధము చేయువాడు, మిక్కిలి భారమును వహించువాడు, వికృత గాత్రము కలవాడు అగును.

ఈ ఫలితములు జాతకుని యందు యెంత వరకు రుజువైనవో పాఠకులే గ్రహింప గలరు. ఆధిపత్యాది విశేషముల వలన ఇటువంటి ప్రాథమిక ఫలితములందు మార్పులు వచ్చుటకు అవకాశం ఉన్నది. ఈ జాతకమునందు తులాలగ్నములో తను భావ మధ్యమునకు గురు చంద్రులును, మేషములో సప్తమ భావ మధ్యమునకు శుక్రుడును సమీప వర్తులై యుండుట గమనార్హము. అందుచే చంద్ర గురు శుక్రుల స్థితికి చెప్పబడిన ఫలితములు సంతృప్తికరముగా సరిపోవుచున్నది. ఇట్లే మిగిలిన ఫలితములను కూడా జాతకమునకు అన్వయించి జ్యోతిశ్శాస్త్రమందలి సత్యము విజ్ఞులగు పాఠకులు గుర్తించ గలరని విశ్వసించుచున్నాను.

(స్థల విస్తరణ భీతిచే మూల శ్లోకములను ఉదహరింప లేదు) ★



ఈ ఇద్దరి స్నేహం చరిత్రలోనే బహు అపురూపమైనది. ఈ యిద్దరి 'సంగమం' దేశానికే చైతన్యప్రదాయిని అయింది.

# ముందుతరాల కిది విడీవిడని చిక్కు కాగిలదా?

# గాంధీజీ వారసుడు భౌతికవాదియా? ప్రచ్ఛన్న హైందవుడా?!

"ప్రపంచంలో యింత వైరుధ్యమున్న రెండు మహోన్నత 'మూర్తు'లు యిలా ఒకేసారి దేశాన్ని చైతన్యమార్గాన నడిపించాయా? ఈ మహాత్ముడు అతని వారసుడూ, ఒకే లక్ష్యాన్ని—రెండు వ్యతిరేక దృక్పథాలతో, రెండు భావ పూరితాలైన సందేశాలతో చేరుకుంటూ—ఒకర్నొకరు అంతగా ప్రేమిస్తూ భారతదేశంలోని కోట్లకొలది ప్రజల ప్రేమకు పాత్రులయ్యారా?" అన్నది యివాళ అంత క్లిష్టంగా, ఆశ్చర్యంగా ఉండకపోవొచ్చును కాని ముందు తరాలవాళ్లకి ఈ 'ధ్రువ సంగమం' లాటి విరోధాభాసంలాంటి "శక్తి సమన్వయం" విడివిడని చిక్కుగా, ముక్కున వేలేసుకునేదిగా అగుపించవచ్చునేమో?

నెహ్రూజీని చదివినకొద్దీ అతనొక (Colossal Paradox) పెద్ద విరోధాభాసగా అగుపిస్తాడు. భౌతికవాదిని—మతమంటే నమ్మకం లేనివాణ్ని అంటూ నెహ్రూమతంగురించి సుదీర్ఘంగా వర్ణించని చోటు లేదు. సమన్వయ సిద్ధాంతాన్ని మరింత విస్తృతంచేసి సైన్సు దృష్టిని అలవర్చుకుని బాహ్యాడంబరాలను, మూఢ నమ్మకాలను సంకుచిత తత్వాలను వదిలి బయటపడి సైన్సును మతానికి మారుగా తీసుకోవాలనే అభిప్రాయం—సాంకేతిక ప్రగతికన్నా మరో అభివృద్ధి అక్కర్లేదనే యిష్టం నెహ్రూ పదే పదే వ్యక్తం చేస్తాడు. "సైన్సు వెంటనే మతాన్ని కాదనకపోవచ్చునేమో (532 డిస్. ఇం) కాని, అది రానురాను మానవ మనుగడకు మూలాధారం కాగలదనే" నమ్మిక అతనిది.

గాంధిజీని బహుశా నెహ్రూ ప్రేమించినంతగా ఎవ్వరూ ప్రేమించలేదేమో.... "నా కర్థం కాని విషయాల గురించి నన్నేం రాయమంటావ్? ఏంజరిగినా నేను "నీతో ఉండటం తప్పదు..." అనే బలహీనతను వ్యక్తపరుస్తూ ... జైలునించి తన కిష్టంలేని ఉపవాసదీక్షను ఒప్పుకుంటూ నెహ్రూజీ ఒకసారి గాంధీజీకి టెలిగ్రామ్ యిచ్చాడు. [1932]

శంకరాచార్యుని గురించి మంత్రముగ్ధుడైనట్లు రాస్తాడు నెహ్రూ తన 'డిస్కవరీ' లో. బహుశా శంకరుని సిద్ధాంతానికి అంత ప్రయోజనం మరో ఆస్తికుడు, ఆధ్యాత్మికవాది కూడా ప్రతిపాదించ లేదేమో ననిపిస్తుంది. శంకరుడు 'భారతదేశాన్ని ఆసేతు హిమాచలం ఒక్కటిగా' చూశాడు. కనుకనే నాలుగు మూలలా నాలుగు స్తంభాల్లా నాలుగు మఠాలు [పీఠాలు] స్థాపించడం జరిగింది. శంకరునిగురించి యింకాజవహర్‌లాల్ ఇలాఅంటాడు.

"వేదాంతి, విజ్ఞాని రెండిటియొక్క ఒక గమ్మత్తయిన సమ్మేళన మతడు. భౌతికవాద ఆధ్యాత్మిక వాదాల మిశ్రమతడు సన్న్యాసి భావుకుడు కూడా. అన్నింటికన్నా ఆయన సమర్థుడైన సంస్కర్త ...."

శ్రీ నెహ్రూకి భారత వర్షమంతా ఒక్కటే—దేశ సమైక్యత సాంకేతిక అభివృద్ధికి ప్రాతిపదిక—అనే నమ్మకం చాలా ..తుగా ఆవహించినట్లు ఆయన రాసిన ఏ పుస్తకంలోనైనా ఉదాహరణలు అగుపిస్తాయి! చరిత్రలో ఎక్కడ ఎప్పుడు దేశాన్ని ఒక్కటిగా రూపొందించే ప్రయత్నం జరిగినా శ్రీ నెహ్రూ దానిని ఎలుగెత్తి చాటందే వూరుకోలేదు.

భారతం గురించి రాస్తూ "దేశమంతా ఒకటే నని 'భరతవర్ష' మనే ఏకీభావ మందుతో ఉన్నదని అది గొప్ప గ్రంధ మందుకేనని అంటాడాయన. అతణ్ని వివేకానందుడు కూడా అలాగే ఆకర్షిస్తాడు. వివేకానందుని అద్వైత సిద్ధాంత ప్రవచనమే గాక అతనిలోని అంతర్జాతీయ దృక్పథం పారిశ్రామికదృష్టికూడా శ్రీ నెహ్రూని మరింతగా ఆకర్షించినట్లు తోస్తుంది.

ఇక గాంధీజీ సంగతి సరేసరి. ఒకరు శక్తి మరొకరు సాధనము.

ఇద్దరి మాటల్లో ఎంత తేడా? గాంధీజీ మాట

ప్రాధమికమైన దశల్లోలన్న ఉద్యమాల్లో కూడా ప్రతి చిన్నవిషయాన్ని ఎదుర్కొంటాడని శ్రీ నెహ్రూ పేర్కొన్న సందర్భాలు, నెహ్రూ ఆత్మకథలో అగుపిస్తాయి కాని గాంధిజీ అసలు తత్వాలైన సత్యాహింసలే కాదు, సహనం కూడా అదే మంతంలో నించి తీసుకున్నా డన్నాడు. ఆకారరహితమైన ఒక దైవాన్ని—మానవాతీత వ్యక్తిని—వూహించలేనని పలికిన నెహ్రూ, సామాజిక సాంకేతిక వికాసానికి, లడ్డుకాగల బాహ్య చాదస్తాలు గల మూఢ మతాన్ని కాదన్నాడే కాని శంకరుని తత్వాన్నిగాని, వివేకానందుని 'శక్తి' పూజ అంటేనే "సైన్సు అభివృద్ధి" అనే వాదాన్ని కాని—లేదా గాంధీయిజాన్ని కాని అతను కాదనలేదు. చదివినకొద్దీ నెహ్రూ ఒక 'విరోధాభాసం' గా అగుపిస్తాడు.

పైగా గాంధిజీ గురించి నెహ్రూ యిలా అంటాడు. "బ్రిటిష్‌వాళ్లకే కాదు, తన ప్రజలకి, అనుయాయులకీ కూడా ఆయన ఒక "పజిల్" ఐపోయాడని !

కాని ఈ పజిల్డ్ నెహ్రూ ప్రజల బాహ్య ఆచారాలను, వారి అధునాతన పురోగతిని—దేశమంతా ఒక "గీత" క్రిందకిరావాలనే ధ్యేయాన్ని తప్ప మరొకటి ఆలోచించనేలేదు. మూర్ఖత్వాన్ని, మూఢనమ్మకాన్ని, సంకుచితత్వాన్ని తనలక్కునచేర్చుకుని రక్షణనిస్తున్న మతాన్ని కాదన్నాడు.. Mind కి Matter అద్వైతతత్వాన్నిఆపాదించుకుని కార్ల్‌మార్క్స్‌వల్ల ఆకర్షితుడయ్యానన్నాడు. 'డిస్కవరీ' లో 76 వ పుటలో ఇలా (ఈ అర్థంలో) రాశాడు శ్రీ నెహ్రూ "సంప్రదాయనికున్న గౌరవం ఈ దేశంలో మరి దేనికీ లేదు. బ్రాహ్మణేతరులకూడా (ప్రాచీన కాలంలో) బ్రాహ్మణులకన్న ఎక్కువగా, 'సాధువులుగా' గౌరవింపబడ్డ ఉదాహరణలున్నాయి".

"ఆఖరికి ఈఆర్థికయుగంలోకూడా సంప్రదాయం యొక్క ప్రభావం కొట్టవచ్చినట్లుంది. దాని వల్లనే గాంధిజీ(బ్రాహ్మణుడు కాడు) దేశమంతటికి మహానాయకుడు అయి,కోట్లకొలది యీదేశప్రజలను అధికారం—ధనం—లేదా బలం,లేదా ఒత్తిడిఅనేవేవీ లేకండా— ఉద్యమింప గలిగాడు. ఈ దేశపు ప్రజలు మనసులలోను బయటకూడా ఎటువంటి నాయకునికి భక్తితత్పరులై ఉంటారో అనడానికి యిదొక పరీక్ష (ఉదాహరణ)"

కాని అదే ప్రజ నెహ్రూని కూడా అలాగే అనుసరించింది. పజిల్డ్ నెహ్రూకన్నా— భౌతికవాది అయిన నెహ్రూకన్నా వారసుడు దొరకలేదు గాంధీజీకి. అంటే గాంధీజీ నెహ్రూని పరలోక రకంగా అర్థం చేసుకున్నాడా? అనిపిస్తుంది అనడం సాహసమే కావచ్చును; కాని ఈ రెండు మహాశక్తుల సమ్మేళనమూ ఒక పెద్ద అసత్యాభాసంగా ఉంటుంది. నెహ్రూజీని చదివినప్పుడు గాంధీజీ నెహ్రూల మైత్రిని చూసి విస్తుపోయినప్పుడు కూడా "నెహ్రూ ప్రచ్ఛన్న హైందవుడా?" ఈ తత్వాన్ని మహాత్ముడు గ్రహించాడా? అనికూడా అనిపిస్తుంది. ఒకసారి "ఎక్కడున్నడమ్మా దేవుడు?" అని కస్తూరిబాని నెహ్రూ వేళాకోళమాడితే గాంధీజీ నెహ్రూ దేవుడికి —అందరికన్నా దగ్గరగా ఉన్నాడని భాష్యం చెప్పాడు.

"గాంధీయే భారత్" అంటాడు నెహ్రూ. సంప్రదాయమే అతణ్ణి మహానాయకుణ్ణి చేసిందంటాడు మరి "నెహ్రూయే ఇవాళ ఇండియా" అన్నాడు—ఇదే సంప్రదాయబద్ధ ప్రజలకి ఆలాగా అనిపిస్తున్నప్పుడు కూడా ఇంకా 'Paradoxical'గా అగుపిస్తుందన్న మాట ఇప్పుడు!

సైన్సు పెక్కులజేసే; సంప్రదాయగా మతంగా భావించిన 'గాంధీజీవారసుడు నెహ్రూ' చేతుల్లో సురక్షితంగానే దేశంపురోగమించింది.—గాంధీజీ రఘుపతి రాఘవ రాజారామ్ (అమెరికాలో ఈ రికార్డులు లక్షలు అమ్మాయని ఆ మధ్య మన దేశంలో పర్యటించి, జానపద గీతాలను వినిపించిన, అమెరికన్ దంపతులు "ప్రింట్స్" చెప్పారు) కి మళ్లే నెహ్రూ 'జైహింద్' కూడా నినాదంకన్నా మరో స్థాయి అందుకుని దేశైక్యత కొక తారకమంత్రమైంది!

"గాంధీ— నెహ్రూ— మనం" ఈ మూడింటిలో ఒకేరకమైంది కాకపోయినా మొత్తంమీద ఒకే సంప్రదాయం ప్రచ్ఛన్నంగా వుంటోందా?

మేధావి ఐన్‌స్టీన్ గాంధీజీ గురించి రాస్తూ "బహుశా ముందు తరాల వాళ్లకి ఇటువంటి వాడు భౌతిక రూపంలో భూమ్మీద నడిచాడా?" అనిపించవచ్చునంటాడు. 44 కోట్లమంది విశ్వాసానికి పాత్రులైన ఈ ఇద్దరి భౌతిక దృక్పథంలోను విరోధాభాసంగా అగుపించే వైరుధ్యం కూడా ముందు తరాల వాళ్లని మరింత గందరగోళ పరుస్తుంది. ఈ ఇద్దరూ ఇలా ఈ భూమ్మీద నడిచారా? అని అనుమానించినా ముందు

కాని ఆ ఇద్దరు అలా నడిచారు గాంధీ నెహ్రూల రెండు తత్వాల మధ్య మహత్తర సందేశముంది, మహోన్నత సత్యముంది.

భౌతిక, మానసిక, ఆర్థిక, సామాజిక రంగాలన్నింటా విపరీత విభిన్న ప్రభావాల మధ్య నలిగిన తరతరాల ఈ దేశ చరిత్రలో ఎంత సత్యమున్నదో నిలకడ ఉన్నదో ఈ ఇద్దరి దృక్పథంలో కూడా అట్టి నిలకడైన సత్యమే ఉన్నది! అదే దేశాన్ని స్వాతంత్ర్యానికి తర్వాత ప్రగతికి నడిపింది. నడుపుతున్నది.

బుద్ధుడు అవతారమని, గుడికట్టిన సంప్రదాయం గాంధీని మందిరంలో దాచేసిన సంప్రదాయం అప్పుడే నెహ్రూని "కుంకుమ బొట్టు" పెట్టి—దైవాంశ సంభూతునిగా — భజన మందిరంలో దాచేద్దామని చూస్తున్న సంప్రదాయం— ముందు తరాలలో ఈ మహనీయుల నాయకత్వం ఒకేసారి ఈ దేశానికి సంభవించింది అన్న "సత్యాన్ని" ముక్కున వేలేసుకునే వింటుందన్నా ఆశ్చర్యం దేనికి? ప్రణాళిక బద్ధ ప్రగతిని రచించిన నెహ్రూజీని అలా గుర్తించడం అవసరం కాని దైవాంశ సంభూతుడనడం చాలదు.

వీరాజీ ★

---

**తల్లిని పిల్లలా హత్తుకుపోయాడు గాంధీని నెహ్రూ : ఆ వెనుక నున్నది "ఫ్రాంటియర్ గాంధీ"**



పరపాలన పీడక్రింద నున్న దేశం [ప్రజలు] సాధారణంగా గతంలోకి పారిపోయి దాని గురించి తియ్యని కలలు కంటూ ఓదార్పు పొందుతారు. కాని యింతకంటే ప్రమాదభరితమైన తెలివితక్కువదైన కాలక్షేపం యింకోటిలేదు......పైగా మన దేశంలో అన్ని విధాలా అణగారిపోయినా; ఆధ్యాత్మికంగా యిహంకన్నా పరం గలవాళ్లంగా మన గురించి మనం భావించే అలవాటుంది. ఆధ్యాత్మికమైనా మరోటైనా; గొప్పతనం స్వేచ్ఛ లేనప్పుడు, అవకాశాలు లేనప్పుడు ఆకలితో మాడుతున్నప్పుడు బాధలతో కుములుతున్నప్పుడు ఉండదు........."

—నెహ్రూ [డిస్కవరీలో]

# ప్రాచీన గోవా

11 వ పేజీ తరువాయి

దుస్తులు మాత్రమే వాడుతారు.

## ప్రాచీనగోవా విశిష్టత

ప్రాచీన గోవా ప్రాముఖ్యం ఇప్పటికీ తగ్గకుండటానికి కారణం సెయింటు ఫ్రాన్సిసు క్సేవియరు కాన్వెంటు. ఇది కెథిడ్రలు దగ్గరగా నిర్మింపబడింది. దీనిలో నగిషీ చూసితీరాల్సిందే గాని వర్ణింప శక్యముకాదు. దీని దగ్గరే సెయింటు కేథరిను చర్చి కూడా ఉన్నది. పోర్చుగీసు వారిచే గోవాలో నిర్మింపబడినవాటిలో ఇది మిక్కిలి ప్రాచీనమైన దంటారు. ఛాపెల్ ఆన్ ది వయిన్ ఊడ్స్ ఆఫ్ క్రీస్ట్ అనే మరో చర్చి ఇప్పటికీ వన్నె తరుగని స్థితిలో ఉన్నదంటే ఎంత ఆశ్చర్యం. నగరానికి మధ్యగా నున్న చర్చి నిర్మాణం మిక్కిలి అద్భుతం, ఆశ్చర్యజనకం అంటే అతిశయోక్తి లేదు. 17 వ శతాబ్ది మధ్యమం వరకూ సెయింటు ఫ్రాన్సిసు మహాత్ముని దేహం సెంట్ ఫ్రాన్సిస్ బోయ్‌చాపెల్ లో ఉండేది. తరువాత ఇటాలియను రాజవంశీయుడైన ఫెర్డినాండు గారిచే ఆ మహాత్ముని పూజ్య దేహం ఉంచబడిన కాఫిన్ చాలా బ్రహ్మాండముగా ఉంటుంది. రాగి రేకుపై బంగారు, వెండి రేకులచే కప్పబడి, విలువయిన రాళ్లచే పొదగబడిన ఈ సమాధి చలువ రాతి దిమ్మపై ఏర్పరుపబడింది. దిమ్మకు నలుపైపులా ఆయన జీవితంలోని ప్రధాన సంఘటనలు వర్ణింపబడినాయి. ఆయన స్మారకార్థం ప్రతి సంవత్సరం డిశంబరు 3 న ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఆరోజు గోవా అంతా ప్రభుత్వంవారిచే సెలవు దినము నిర్ణయించబడింది. అన్ని దార్లు రోమ్‌కే దారి తీస్తవి. అప్పట్ను ఆరోజు అందరూ పాత గోవాకు ప్రయాణమవుతారు. 12 సం. లకు ఒకసారి ఆ మహాత్ముని దేహం ప్రజాసమూహం చూడటానికి ఏర్పాటు చేయబడింది. (ఈ సంవత్సరం డిశంబరు 9.) ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సప్తమ ఎడ్వర్డు బ్రిటిషువారి హయాంలో భారత దేశాన్ని పాలించిన వైస్రాయిలు ఈ సమాధిని దర్శి[illegible], జాతి, లింగ, వర్ణ భేదం లేకుండా ప్రతి ఒక్కరూ ఈ కోలాహలంలో ఆనందం అనుభవిస్తారు. సెయింటు ఫ్రాన్సిసు మహాత్ముని గురించి బహుళవ్యాపకంగా ఉన్న విషయ మేమిటంటే—ఇక్కడ ఉన్న రెండు బావులలో ఒకదాని నీరు ఆయన త్రాగారుట. మరోదానిలోని నీటితో పాద ప్రక్షాళన చేశారుట.

## కిరీటాల అపహరణ

డిశంబరు 23, 1963 న ఇక్కడ చర్చిలో జరిగిన దొంగతనానికి పాత నేరస్తుడు పట్టుబడి ఫిబ్రవరి 3, 1964 న గోవా జడ్జిగారిచే 7 సంవత్సరములు కఠినశిక్ష విధింపబడినాడు. అతడు దొంగలించిన వస్తువుల వివరాలు : నాలుగు కిరీటాలు, వెండి తాళంచెవులు, వెండి ఫ్రేము, ప్లేటు, ఇంకా అనేక వెండి వస్తువులు. అతడు దొంగతనం చేయటానికి ప్రత్యేకంగా యాత్రికుడి రూపంలో ఆ రాత్రి లోపల (చర్చి) పడుకున్నాడని పోలీసుల కథనం. దురదృష్టవశాత్తు దొంగిలింపబడిన వస్తువులు తేలికవగుటచేత గలగలమని ధ్వని చేయటంతో అతడు పోలీసులకు పట్టుబడ్డాడు.

## ప్రాచీనగోవా

భారతదేశానికి పశ్చిమతీరంలోని ప్రధాన నగరాలలో గోవా ఒకటిగా ఉండేది. ప్రపంచంలోని గొప్ప నగరాల్లో ఒకటిగా అది పేరుపొందినది. "పెరుగుట విరుగుట కొరకే" అనే సామెత అక్షరాలా రుజావు చేయవచ్చు ననటానికి తార్కాణం ఈ మహానగరం అనుభవించిన వైభవమే. ప్రక్క రాజ్యాలు క్రమంగా అస్తమిస్తూంటే ఈ మహానగర ప్రాభవం కూడా క్రమంగా క్షీణించటంలో ఆశ్చర్యంలేదు. ఆదిల్ షా కాలంలో కన్నా పోర్చుగీసువారి ప్రాబల్యంలో దీని వైశాల్యం అధికమయింది. ఈనాడు ఆ మహానగరం అనుభవిస్తూన్న జీర్ణావస్థ చూస్తే ప్రతి ఒక్కరూ కన్నీటి బిందువులు రాల్చి వేడి నిట్టూర్పులు విడుస్తారు. కొద్ది క్షణాలు ప్రతి వ్యక్తి నిశ్చేష్టుడై బాహ్య ప్రపంచాన్ని మరుస్తాడు. ఈ నగరం అట్టి దీనావస్థకు రావటానికి కారణం చారిత్రకంగా చూస్తే పాశ్చాత్య దండయాత్రలు, ఆల్బుకర్కు తరువాత వచ్చినవారి అసమర్థత కొంతవరకూ ప్రకృతి భీభత్సం అనిపిస్తాయి.

## కార్నివాల్ ఉత్సవం

గోవా అంతటా జరిగే మరో ప్రధాన ఉత్సవం కార్నివాలు. ఈ సంవత్సరం ఫిబ్రవరి 9 నుండి 11 వరకు ఇది జరిగింది. భారత దేశం మొత్తంపై ఒక్క గోవాలో మాత్రమే ఈ ఉత్సవం జరుగుతుంది. పంజింలోని ఫ్లెమింగో రెస్టారెంటులో ఆ సందర్భములో మూడు రోజులు నిర్విరామంగా రాత్రింబగళ్లు నృత్య, గాన, వినోద ప్రదర్శన లేర్పాటు చేశారు. గోవా ప్రజలందరూ ఆ మూడురోజులు ఒక విధమైన ఆనంద తరంగడోలికలలో వూగులాడారంటే సత్యదూరంకాదు. దీనికి సంబంధించిన కథ ఏమిటంటే—మోమొ. రాజు 8వతేదీ (ఈసంవత్సరం) నవగోవాలో (సాయంత్రం) ప్రవేశించి 72 గంటలపాటు గోవా ప్రజ అందరికీ కార్నివాల్ జరుపమని శాసిస్తాడు. ప్రజ అందుకు అనుగుణంగా పండగ జరుపుతారు.

(ఈ వ్యాసరచనకు పాతగోవాలోని కేథలిక్ సెయింట్‌లు, గైడ్‌లు తోడ్పడినారు. ముఖ్యంగా క్రైస్తవ సంస్థ డైరక్టరుగారయిన రెవరెండ్ శాంటోనీగారు తమ ద్విభాషి ద్వారా నా కిచ్చిన ఇంటర్వ్యూ ప్రత్యేకంగా అనేక విషయాలు తెలుసుకోటానికి సాయపడింది. వారందరికీ కృతజ్ఞత.) ★

# కార్యసిద్ధి

16 వ పేజీ తరువాయి

కుండానే మరీ దగ్గరసా వచ్చేసింది !

చేరువకు వచ్చేసిన చిలువ ఉన్నపాటున నోరు తెరిచింది. వినాయకుడి కాళ్లు రెండూ టక్కున పట్టివేద్దామని, అది వాటం చూస్తూంది.

అయితే, అది పట్టుకోనక్కర్లేకుండా వినాయకుడే కోరి, తన రెండుకాళ్లూ, దాని నోటికి అందించాడు ! ఇప్పుడు దాని పని మరీ సులువయింది. బలే, బాలుడు మహ బాగా దొరికాడని చిలువ చాలా సంతోషించింది !—

తనకు తానై, గణపతి కొండచిలువ నోట్లో ప్రవేశించేశాడు ! చేతిలో అంకుశంవంటి దంతంతో సహా ప్రవేశించాడు !!—

గుటుక్కుమని గణేశుణ్ణి మింగేసింది కొండ చిలువ !—అలా మింగి, అది శరీరాన్ని దగ్గరికి ముడ్చేసుకోబోయింది. అయితే, దాని శరీర మెంత పొడుగుందో, అంత పొడుగునా గణపతి తన ఆకారాన్ని పెంచేశాడు. మరి కదల్లేకపోయింది చిలువ. అప్పుడు గణేశుడు ఆ చిలువను, నోటి దగ్గర నుంచి తోక చివర వరకూ నిలువునా చీల్చివేశాడు !—

దాని కడుపులో నుంచి గణేశుడు ఇవతలికి రాగానే, ఆ కొండచిలువ భయంకరమైన పెద్ద పెద్ద రంకెలు వేసింది. 'గణా ! గణా !!—' అని బొబ్బలిడుతూ ఉద్యానమంతా దొర్లి, రాక్షసాకారంతో నేల కూలింది.

రాజా !—ఆ చిలువ ఎవరై ఉంటారో చెప్పుకోగలవ్వా ? అని అడిగాడు, శుక్రాచార్యుడు.

'ఇంకెవరూ ?—మన అభిగాసురుడే !!'— అన్నాడు సింధురాజా.

(సశేషం)

బద్ధకస్తులకి దేవుడు ఒకే ఒక రూపంలో ప్రత్యక్షమౌతాడు. అదే, పని రూపేణా. పనికి కూలి వచ్చి దానితో తర్వాత ఆహారం సంపాదించాలి. మనుషుల్ని తమ తిండి సంపాదించుకుందుకే దేవుడు చేశాడు. అలా చెయ్యకుండా తినేవాళ్లే దొంగలు. —మహాత్మాగాంధీ.



పత్రికలు చదువుతుంది

# నాట్యనటి విజయలక్ష్మి పరిచయం

సి. ధర్మారావు.

"నమస్కారండి! "నమస్కారం! కూర్చోండి! నాకు తెలుగు అంతగా రాకపోయినా తెలుగు వారన్నా, తెలుగు పత్రికలన్నా నాకు చాల ఇష్టం. ఆంధ్ర సచిత్ర వార పత్రికను చాలాసార్లు చూసేను. హైదరాబాద్ షూటింగ్‌కు వెళ్తే ఆంధ్రపత్రికే నాకు చాలవరకు తోడుగా ఉంటుంది."

"మా పత్రిక ద్వారా మిమ్మల్ని పాఠకులకు పరిచయం చేయాలని. . . . . ."

"చాల సంతోషం. ఏం కావాలో అడగండి. తప్పకుండా నాకు తెలిసినంతవరకు చెబుతాను."

"మీ జన్మస్థలం?"

"మధుర దగ్గర ఉంది. "తిరునల్‌వేలి" లో పుట్టాను. ఇక్కడకు సుమారు 300 మైళ్ల దూరముంటుంది. పుట్టిన తేదీ కూడా చెబుతాను. ఆ. . . .5—5—1944"

"విద్యాభ్యాసం తిరునల్‌వేలిలో ప్రారంభించారా?"

"లేదండి. పుట్టడమే అక్కడ. మా నాన్నగారు "ఎయిర్ ఫోర్సు"లో ఎకౌంట్సు ఆఫీసరుగా పూనాలో పని చేసేవారు. అందుకని పూనాలోనే నా చదువు కాన్వెంట్‌లో ప్రారంభమైంది."

"స్కూలులో చదువుతున్న రోజులనుండే భరతనాట్యం, నాటకాలు మొదలగువాటిపై అభి రుచి ఉందా?"

"ఓ, యస్! కావలసినంత. స్వంతంగా స్కూలు ప్రోగ్రామ్స్‌లో నృత్య ప్రదర్శనా లిచ్చేదాన్ని. ఇంగ్లీషు నాటకాల్లో ప్రముఖపాత్రలు నాచేత వేయించేవారు. చాలవరకు బహుమతులు వచ్చాయి. నాకు ఆసక్తి ఎక్కువైంది. అది గ్రహించిన మా నాన్నగారు ఈ మద్రాసు బదిలీ చేయించు కున్నారు. ఇక్కడ కూడా కాన్వెంట్‌లోనే మెట్రిక్ వరకూ చదివాను?"

"చదువెందుకు ఆపివేశారు."

"నేను చదువుతూ శ్రీ రామయ్యాపిళ్ళెగారి వద్ద భరతనాట్యం నేర్చుకున్నాను. వారివద్దనే 1955 లో అరంగేట్రం జరిపించారు. అరం గేట్రానికి వి. శాంతారాంగారు కూడా హాజ రయ్యారు. నేను మెట్రిక్ చదువుతుండగానే చంద మామ ఫిలింస్ అధినేత శ్రీ డి. ఎల్. నారాయణ గారు వారి చిత్రం "సిపాయి కూతురు" లో మొదటిసారిగా నృత్యాలతో కూడిన ఒక వేషంతో నాకు అవకాశమిచ్చారు. ప్రతినెలా 6 నుండి 8 ప్రోగ్రాంలు ఇవ్వడం జరిగింది. స్కూలుకు వెళ్ళ డానికి వీలుపడేదికాదు. ఇప్పుడు కూడా ప్రతినెలా ప్రోగ్రాములు చాల ఎక్కువగానే ఉన్నాయి."

"ఇతర భాషా చిత్రాల్లో కూడా నటించారా?"

"ఓ. యస్! మళయాళంలో 5, తమిళంలో





స్కూటర్ రాణీ

ఫొటోలు: ప్రభాకర్.


ఒక ఉత్తమనటుడు, ఒక గొప్పదర్శకుడు
తొలిసారిగా కలసి
రూపొందించిన మహోజ్వల చిత్రం —
DBN PRODUCTIONS డి.బి.ఎన్ వారి
దాగుడుమూతలు
నిర్మాత డి.బి.నారాయణ • దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు
మాటలు ముళ్ళపూడి వెంకటరమణ • సంగీతం కె.వి.మహదేవన్

వరకు వివరిస్తున్నాయి! ఉత్తమ ప్రమాణాలు అంటే ఏమిటి?.....అన్న ప్రశ్నకు నిర్వచనం మారుతూ ఉంటుంది.....కనుక, వాటిని చర్చించటం అప్రస్తుతం అనుకుంటాను.

పైగా, సాంకేతిక విలువలుకూడా పెరిగాయి. చిత్రాలు మునుపటి అంత 'బలహీనంగా' ఉండటంలేదు. చాయాగ్రహణయొక్క స్థాయి, దానికి తగ్గట్టుగా పెరిగింది. చిత్రాలలో సహజత్వాన్ని



# స్వాతంత్ర్యానంతరం

వీలైనంత ఎక్కువగా ప్రవేశపెట్టాలనే కృషి ప్రారంభమైంది.......అయితే, ఈ విషయమై, చెప్ప తగినంత విజయాన్ని దర్శకులు సాధించలేకపోయారు.

ఒకవైపు సహజత్వంకోసం ప్రాకులాట ఎక్కువవుతున్నా అదే చిత్రంలో మరో చేత్తో దర్శకులు కృతకమైన చౌకబారు సన్నివేశాలనుకూడా ప్రవేశపెట్టటానికి వెనకాడటంలేదు. ముఖ్యంగా ఇటీవలవచ్చే సినిమా కథలకు అర్ధమూ, పర్ధమూ ఉండటంలేదు. ప్రతి సినిమాలోను కొద్దో, గొప్పో....భర్త భార్యను, భార్య భర్తను.....అపార్థం చేసుకోవటం, ప్రేక్షకుల సహనానికి అగ్నిపరీక్ష పెట్టటం మామూలు అయిపోతున్నది. ఇందువల్ల, దర్శకులు వూహించిన సహజత్వం సిద్ధించకపోగా, ప్రేక్షకులకు విసుగుదనంఎక్కువవుతున్నది.

ఈ రోజుల్లో మరీ ఎక్కువగా కనుపిస్తున్నవి. ప్రేమ దృశ్యాలు. నానాటికీ వాటి ప్రమాణాలు దిగజారిపోతున్నాయి. వాస్తవానికీ, వీటికి సంబంధం ఏకోశానా కనపడదు. దర్శకులు, తెలిసే ఈ కృత్రిమ ప్రణయ ఘట్టాలను ప్రవేశపెడుతున్నవారయితే.......వారు ఒకవర్గపు ప్రేక్షకుల మానసిక బలనహీతల్ని ధనరూపంలోకి తెచ్చుకోవాలని ప్రయత్నం చేస్తున్నట్లు చెప్పాలి.

స్వాతంత్ర్యం వచ్చాక దేశంలో విజ్ఞానంకూడా పెరుగుతున్నది. కాని, అందుకు తగినట్లుగా విజ్ఞానాత్మకమైన చిత్రాలు వస్తున్నాయా అంటే— అదీ లేదు. ఆ సాహసమూ ఎవరూ చేయటంలేదు.... విఫలమయినపోతాయన్న భయంకొద్దీ. చిత్రాల ద్వారా ఒక్కోమారు ప్రేక్షకుల అభిరుచులను కొంతవరకు మార్చగలిగిన దర్శకులు విజ్ఞానాత్మకమైన చిత్రాలు నిర్మించిననాడు, అవి పూర్తిగా వృధాకావు. వాటికీ తగిన ఆదరణ లభిస్తుంది. కాని, అలాంటి సాహసం ఎవరూ చేయకపోవటం, శోచనీయం.

సినిమాకు వెళ్లేవారిలో అధిక సంఖ్యాకులు కాలక్షేపమూ, వినోదమూ ఆశించే వెడతారు. అలా కాకుండా, సినిమాలద్వారా గుణపాఠం నేర్చుకోవాలని, అభివృద్ధి చెందాలనో ఎవరూ వెళ్లరు. ఇలాంటి స్థితిలో, ఈనాటి కొన్ని సినిమాలు వినోదాన్నికూడా పూర్తిగా అందించలేకపోవటం హర్షనీయం కాదు. హాస్యంకూడా నానాటికీ మితిమించిపోయి అపహాస్యంగా తయారవటాన్ని సామాజిక ప్రేక్షక లోకం హర్షించదు. మన హాస్య నటులుకూడా ప్రతి చిత్రంలోనూ అవే ముఖ కవళికల ద్వారా, పాసిపోయిన రీతుల్లో హాస్యాన్ని అందించటానికి ప్రయ్నత్నం చేస్తున్నారు. ఇక ఉత్తమమైన వినోదం లభిస్తుందని ఎలా ఆశిస్తాం!

ఏమయినా, ఒక్కమాట చెప్పక తప్పదు. స్వాతంత్ర్యానంతరం చిత్రాలలో సాంకేతిక విలువలు పెరిగినా, నైతిక విలువలు పెరగలేదు. నైతికంగా అభివృద్ధిచెందని సినిమాలవల్ల విశిష్టమైన ప్రయోజనం లేకపోగా, ఒక్కోమారు అపకారంమాత్రమే జరిగే ప్రమాదం ఉంది. తస్మాత్ జాగ్రత్త! ★



'దాగుడుమూతలు'లో పద్మనాభం, శారద.

## 'గ్రామదేవతలు'

సుగంధి పిక్చర్సువారు "గ్రామ దేవతలు" అనే సాంఘిక చిత్రాన్ని హైదరాబాద్ శ్రీ సారథీ స్టూడియోలో "ఇన్స్పెక్టర్ జనరల్" అనే ప్రఖ్యాత నవలాధారంగా నిర్మిస్తున్నారు. ఇంతవరకు నాల్గవ్వర రీళ్లు చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో ఆరుద్ర, కొసరాజు పాటలు వ్రాశారు.

ఈ చిత్రంలో జగ్గయ్య, రేలంగి, చలం, వంగర, లంకసత్యం, చదలవాడ, అల్లు రామలింగయ్య, రాజబాబు, ప్రసాద్, రాజసులోచన, ఉషాకుమారి, రాగిణి (హైద్రాబాద్) మొదలగువారు నటిస్తున్నారు.

## సంగీతదర్శకునిగా ఏ. ఏ రాజు

సహాయ సంగీత దర్శకునిగా పని చేస్తున్న ఏ. ఏ. రాజు ఇదివరకు ఒకటి, రెండు డబ్బింగ్ చిత్రాలకు సంగీత దర్శకునిగా పని చేశారు. ప్రస్తుతం వినాయక మూవీస్వారు నిర్మిస్తున్న "భక్తమీరా" చిత్రానికి కేల్కర్ సంగీత పర్యవేక్షణక్రింద ఏ. ఏ. రాజు సంగీత దర్శకునిగా పని చేస్తున్నారు.

ఇదికాకుండా నవరత్నా ఫిలింస్వారు మొదటిసారిగా హైద్రాబాద్లో చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలోకి ఏ. వేణుగోపాల్ వ్రాసిన రెండు పాటలను ఈమధ్య పి. సుశీల పాడగా హైద్రాబాద్ శ్రీ సారథీ స్టూడియోలో రికార్డు చేశారు. ఈ చిత్రానికిలకూడ ఏ. ఏ. రాజు సంగీత దర్శకునిగా పని చేస్తున్నారు. ఈ చిత్రాన్ని తాపీ చాణక్య దర్శకత్వం వహించమన్నట్లు తెలుస్తుంది.

## "రాజ్యలక్ష్మి వీరాభిమన్యు"

రాజలక్ష్మివారు నిర్మిస్తున్న పౌరాణిక చిత్రం "వీరాభిమన్యు" లో ద్రౌపతిగా నటించుటకు దేవికను తెలుగు, తమిళంలో కూడా తెలుగులో అభిమన్యుడుగా శోభన్బాబును, తమిళంలో ఉత్తర కుమారుడుగా నాగేష్ను ఎన్నుకున్నట్లు తెలుస్తుంది. నిర్మాతలు సుందరలాల్ నహతా అండ్ డూండీ.

సి. ధర్మారావు. ★


Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

వాశిరాజు ప్రకాశం

# స్వాతంత్ర్యానంతరం సినిమాలు!

సినిమాలదొక చిత్రమైన ప్రపంచం. కొన్ని ప్రత్యేకమైన కట్టుబాట్లు, నిర్దుష్టమైన నియమావళి, విశిష్టమైన ఆదర్శము—లాంటివి ఈ ప్రపంచంలో ఎక్కడా ఉన్నట్లు కనుపించవు!

ఏ గాలికి ఆ తెరచాప! ఒక్కో కాలానికి ఒక్కొక్క నీతి. సంవత్సర సంవత్సరానికీ వైవిధ్యమూ, వైరుధ్యమూ! ఒకనాటి సినిమాలకు, నేటి సినిమాలకు పోలికలు కనుపించవు. మూకీ సినిమాయుగంలో ఉండిన వాతావరణానికీ, ఈనాటి స్థితిగతులకు తారతమ్యం ఎంతోవుంది. అలా అనుకుంటే ప్రతి రంగంలోను, ఈ మార్పు ఉందిగదా!.... ఒక్క సినిమారంగాన్ని చూపే ముక్కుమీద వేలు వేసికొనవలసిన అవసరం ఏమిటి? అని మీరు అడగొచ్చు! సినిమారంగంలో శరవేగంతో నానాటికి వస్తున్న మార్పులను చూస్తుంటే, మిగతా రంగాలు ఎంత మెల్లిగా కదులుతూ, మెదులుతూ ఉన్నాయో అర్థమవుతుంది.

దానికి కారణం ఏమిటీ...... నాగరికత పెరిగింది. మనిషి రోజు రోజుకూ మారుతున్నాడు. ప్రజల అభిరుచులు మరోమార్గానికి మళ్లాయి 'పాత' అనబడేదాన్ని చాలావాళ్ళు 'రోత'గా ఎంచుకొని, కొంత కొత్తదనాన్ని సంతరించుకోవాలనీ, నవ్యతను ఆపాదించాలని, దీన్నంతా నలుగురిచేత ఆమోదింపచేసికోవాలన్న తాపత్రయం, నానాటికి పెరిగిపోతున్నది.

సినిమారంగంలో వస్తున్న మార్పులుకూడ దీనికి అనుగుణంగానే రూపొందుతున్నాయి. పాత పద్ధతులకు పూర్తిగా స్వస్తిచెప్పి, ఈనాటికి ఏది ప్రచారంలో ఉందో, దాన్నే ఆకళింపుచేసుకుని, తెరమీదకు ఎక్కించాలనే ప్రయత్నం జోరుగా సాగుతున్నది. ఈ ప్రయత్నం వెనుకవుండే 'ఆశయం' ఏమిటి? మనిషిని చాలా ఆధునికంగా తయారుచేద్దామనా? లేక మానవునిలోని మేధాశక్తిని, పెంపొందింపచేయాలనా ?...... లేక వ్యాపారమా? •

స్వాతంత్ర్యం ఆవిర్భావం తెరమీదకు వచ్చిన సినిమాల తీరుతెన్నులు వేరు. ఈనాటి సినిమాల లక్ష్యం వేరు. దానికి కారణం ఆ నాటికీ నేటి పరిస్థితులలోనూ, రాజకీయ, సాంఘిక రంగాలవాతావరణంలో ఉండే వ్యత్యాసం.

ఆనాటికి మనిషి యాంత్రికంగా తయారవలేదు. అవి స్వాతంత్ర్యంకోసం ముమ్మరంగా పోరాటం జరుగుతున్న రోజులు. తెల్లవారి దొరతనంపట్ల విసిగిన సామాన్య ప్రజల నరనరాలలో 'దేశభక్తి' ప్రవహిస్తూ ఉండేది. స్వాతంత్ర్యం సంపాదించుకోవటమన్నది ఆనాటి ప్రజల తక్షణ అవసరం. ఈ అవసరం చాలా ప్రబలమైనది కావటం మూలంగా, ఆ రోజుల్లో ప్రజలు ఏమి చేసినా, ఈ అంశాన్నే దృష్టిలో పెట్టుకునేవారు, కొన్ని చిత్రాలలో సమాజంలో ఆనాడు ఉన్న స్థితిగతులనుకూడా ప్రముఖంగా ప్రస్తావించటం జరిగింది. ఉదాహరణకు హరిజనోద్యమాన్ని తీసుకుందాం .... మద్యనిషేధం, విదేశీ వస్త్రాల బహిష్కరణ, ఇలాంటివి ఎలానూ ఉండనే ఉన్నాయి. వీటినే చిత్రాలద్వారా తెరకెక్కించి, ప్రజలను అప్రమత్తులుగా చేయాలనే కృషి జరిగేది. ఆ కృషికి వెనుక వ్యాపారానికి సంబంధించిన కొంత స్వార్థం ఉన్నా, మనవుణ్ణి బాగాచేయాలి; పెడదారిన పట్టించకూడదు ......అనే సదభిప్రాయం కొంతైనా ఉండేది. దీనికితోడు, 'దైవభక్తి' ప్రతి సినిమాలలోనూ ఉండేది. ఆనాటి 'గృహలక్ష్మి', 'మాలపిల్ల', 'మళ్లీ పెళ్లి', మొదలైన సినిమాలు ఈ సత్యాన్నే ఋజువుచేసి ఉన్నాయి "కల్లు మానండోయ్.....కళ్లు తెరవండోయ్" అన్నపాటలు ఈనాటికికూడా పల్లెసీమలలో వినిపించటమన్నదృష్టాంతం, ఒకరకంగా, ఆనాటి సినిమాలు ప్రజలమీద ఎంతటి మహత్తరమైన ప్రభావాన్ని ప్రసరింపజేస్తాయో విశదపరుస్తుంది. పైగా, దేశభక్తి ప్రబోధ గీతాలు వినిపించని సినిమాలు ఆ రోజుల్లో అరుదు. సాంప్రదాయంగాబద్ధంగానూ ఉండేవి. దురాచారాల ఖండన జరిగేది. సత్సాంప్రదాయాల ప్రాముఖ్యత వివరిస్తూ ఉండేవి.

స్వాతంత్ర్యానంతరం గొప్పమార్పు వచ్చింది. ఆనాటి సినిమాలకు, ఈ రోజుల్లో వస్తున్న సినిమాలకు పోలికలు లేనంతగా పరిస్థితి తయారైంది ఈ వచ్చిన మార్పుకూడా అకస్మాత్తుగా రాలేదు— అంచెలు అంచెలుగా వచ్చింది. అందువల్లనే, ఇంతటి పెద్దమార్పు వచ్చిందన్న వగ్నసత్యం ప్రజలను విశేషంగా ఆకర్షించలేదు. కాకపోతే, ఎటొచ్చీ, ఈ మార్పు రావడాన్ని ప్రజలు కొంతవరకు గుర్తించకపోలేదు.

ఈ వచ్చిన మార్పులుకూడా సామాన్యమయినవికావు. ప్రతి అడుగునా ఈ మార్పు కొట్టవచ్చినట్లుగా కనుపిస్తుంది. మరీ, కొందరు దిగ్భ్రమ చెందేలా పరిణమించాయి పరిస్థితులు.

మొదటి పెద్దమార్పు సాంఘిక చిత్రాలు. అంతకుపూర్వం పౌరాణికాలు, జానపద చిత్రాలు ఎక్కువ రావటం జరిగేది. ఆ రోజులకు తగ్గట్టుగా ప్రజలు వాటినే విరివిగా చూచేవారు. కానీ ఈ రోజున వచ్చే చిత్రాలలో తొంభయి పంతులు సాంఘికాలే. ఇలా, విరివిగా సాంఘికాలు రావటానికి కారణం ఏమిటి? ప్రజలలో అభిరుచులుమారాయా లేక, నిర్మాతల దృక్పథం మారిందా? లేక కాల పరిణామాల ఫలితమా?...అన్నీ నిజమే. పైగా ప్రతి ప్రశ్న మరో ప్రశ్నతో ముడిపడి వుంది. కాల ప్రభావంవలన ప్రజల అభిరుచులు మారాయి. (అందుకే వేరే కారణాలుండవచ్చు). ప్రజల అభిరుచులు మారినప్పుడు, నిర్మాతలకూ, దర్శకులకూ వాటినే అనుసరించక తప్పదు. చిత్రం ఆర్థికంగా విజయం సాధించాలంటే, ముందు ప్రజల అభిరుచులను గమనించి తీరాలి. అందువల్లనే సాంఘికాలు ఎక్కువగా వస్తున్నాయి.

వచ్చిన సాంఘికాల పైఖరికూడా గమనించదగినదే. దర్శకులు ఉత్తమ ప్రమాణాలను సాధిం



అగ్గిపిడుగులో ఒక దృశ్యం



భారతభాగ్య నిర్మాత జవహర్‌లాల్ నెహ్రూ




శారద

తెల్లని దంతములకు, ఆరోగ్యవంతమైన చిగుళ్లకు

# రెమి

టూత్ పేస్టు మరియు పౌడరు

CRITERION RP. 396